మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

ఏప్రిల్-జూన్, 2008




## బడ్జెట్‌లో వాటాకై - అసెంబ్లీ బాట

### కదంతొక్కిన ప్రజావాహిని



మహిళా సమస్యలపై వరంగల్‌లో మహిళలు
నిర్వహించిన సైకిల్ ర్యాలీ




గుంటూరు జిల్లాలో నిర్వహించిన పాదయాత్రనుద్దేశించి
ప్రసంగిస్తున్న ఐద్వా జిల్లా కార్యదర్శి అనీల




బడ్జెట్‌లో వాటాకై చలో హైదరాబాద్ కార్యక్రమ పోస్టర్‌ను
విడుదల చేస్తున్న ఐద్వా నాయకులు



మున్సిపల్ కమిషనర్‌కు వినతిపత్రం సమర్పిస్తున్న ఐద్వా
బృందం



మైనార్టీలకు బడ్జెట్‌లో వాటా కొరకు నిర్వహించిన సదస్సు



ఖమ్మంలో పాదయాత్రను ప్రారంభించిన మున్సిపల్ ఛైర్మన్
అఫ్రోజ్ సమీనా

# లక్ష కోట్ల బడ్జెట్ లో ఏది మా వాటా ?

చైతన్య మానవి

సంపాదకీయం...

బడ్జెట్ మహిళల జీవితాల్ని విభిన్న రీతుల్లో ప్రభావితం చేస్తుంది. బడ్జెట్‌లో స్త్రీలకు సంబంధించిన ప్రత్యేక పధకాలకు నిధుల్ని కేటాయిస్తారు. అలాగే పలు మంత్రిత్వ శాఖలకు చెందిన సాధారణ కార్యక్రమాల్లో సైతం స్త్రీల భాగం పేరిట బడ్జెట్ నిధిని కేటాయిస్తారు. జండర్ ధృక్పధంతో బడ్జెట్ కేటాయింపులు ఉండాలని ఐద్వా అనేక సంవత్సరాలుగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంది.

ప్రభుత్వాధినేతలు జిడిపి వృద్ధి రేటు పెరిగిందని, ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయని ప్రకటనలిస్తారు. కానీ వాస్తవాలు దీనికి విరుద్ధం. సంపద కొద్దిమంది వద్ద పోగుపడుతుంది. బడ్జెట్‌లో సంపన్న వర్గాలకు అనుకూలమైన విధానాలకు ప్రాధాన్యత వుంటుంది. మార్కెట్లలో ఉన్నత వర్గాలు ఉపయోగించే కార్లు, ఎ.సి.లు, ఫ్రిజ్‌లు, టివిలు, కాస్మోటిక్స్‌లాంటి వాటిపై ధరలు తగ్గుతున్నాయి. పప్పులు, నూనెలు, బియ్యం, కూరగాయల్లాంటి నిత్యావసర వస్తువుల ధరలు మండుతున్నాయి. దీనితోపాటు ప్రజాపంపిణీ వ్యవస్థను నిర్వీర్యం చేయటం వలన ఆహార భద్రత కరువైంది. తాగుడు విపరీతంగా పెరిగింది. దీని వలన మహిళలపై ఇంటా బయటా హింస పెరిగింది. తాగుడు ఎక్కువై చిన్న వయస్సులో చనిపోయే వారి సంఖ్య పెరిగింది.

మహిళా-శిశు సంక్షేమం పేరుకే సంక్షేమం. 2008-09 బడ్జెట్‌లో 1266 కోట్లు కేటాయించారు. వేతనాలు, ఇతర ఖర్చులకు మూడొంతులు ఖర్చవుతుంది.

రాష్ట్రంలో 6,35,000 లక్షల డ్వాక్రా గ్రూపులు వుంటే 2,95,000 గ్రూపులకు మాత్రమే పావలా వడ్డీ ఋణాలు అందాయి. దళిత, గిరిజన, వెనుకబడిన తరగతుల పొదుపు గ్రూపులు ప్రభుత్వం విధించిన నిబంధనల వలన పావలా వడ్డీ ఋణాన్ని పొందలేకపోతున్నాయి. పొదుపుగ్రూపులకు ప్రభుత్వం నుండి రివాల్వింగ్ ఫండు,సబ్సిడీలోన్స్ సక్రమంగా అందక పోవటంతో మైక్రోఫైనాన్స్ సంస్థల అప్పుల ఊబిలో కూరుకుపోతున్నారు. మహిళా ఉద్యమాల ఫలితంగా సాధించుకున్న గృహ హింస రక్షణ చట్టం అమలు చేయటానికి ప్రభుత్వం బడ్జెట్ కేటాయింపులు, ప్రత్యేక యంత్రాంగం ఏర్పాటు చేయలేదు. రాష్ట్ర మహిళా కమీషన్ అవినీతితో మూతపడింది.

ప్రపంచ బ్యాంకు షరతులకు లోబడి ప్రభుత్వం విద్య, వైద్య రంగాలను కార్పొరేట్ సంస్థలకు పట్టం గడుతోంది. 60 వసంతాల స్వాతంత్ర్యానంతరం మహిళల అక్షరాస్యత 51 శాతం. విద్య ప్రైవేటీకరణ జరిగితే మహిళలకు విద్య దూరమవుతుంది. ప్రైవేటు భాగస్వామ్యంతో మండలాలలో కాన్సెప్ట్ స్కూళ్ళు నడపటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

గత సం॥ వైద్య రంగానికి 3.39 శాతం కేటాయింపులు ఉండగా ఈ ఏడాది 3.32 శాతానికి తగ్గించారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో ప్రసూతి సౌకర్యాలు, లేడీ డాక్టర్లు లేక గర్భిణీ స్త్రీల అవస్థలు చెప్పనలవి కావు. ప్రైవేటు ఆసుపత్రిలో డెలివరీకి పదివేలు ఖర్చవుతుంది. ప్రాథమిక ఆరోగ్యానికి 300 కోట్లు ఖర్చు పెడితే 600 కోట్లు ఆరోగ్యశ్రీకి ఖర్చు పెడుతున్నారు. రోజు వారీ వచ్చే వ్యాధులు చికున్ గన్యా, డయేరియా, మలేరియా జ్వరాలు లాంటి వ్యాధులకు మందులకు బడ్జెట్‌లేదు. కార్పొరేట్ హాస్పటల్స్‌కి ప్రయోజనం చేకూర్చే ఆరోగ్యశ్రీ పధకానికి బడ్జెట్ ప్రాధాన్యతలు యిస్తున్నారు. ప్రపంచబ్యాంకు షరతులకు లోబడి ప్రజారోగ్యాన్ని మూడు ముక్కలుగా చేస్తోంది. ప్రభుత్వం ఎక్సైజ్ పాలసీని మార్చి ఆదాయాన్ని పెంచుకునే దిశగా ఆలోచిస్తోంది తప్ప ప్రజల సంక్షేమానికి ప్రాధాన్యతనివ్వటం లేదు.

ఒక ప్రక్క బడ్జెట్‌లో కార్పొరేట్ సంస్థలకు అనేక రాయితీలిస్తుంది. సంపన్నులపై పన్నులు తగ్గించటం, నల్ల ధనాన్ని వెలికితీయక పోవడం జరుగుతున్నది.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు మహిళలకు సంబంధించిన పధకాలకు పెట్టే ఖర్చు తగ్గిపోతుంది. ప్రభుత్వ పన్నుల విధానంమహిళలపై ప్రభావం చూపుతుంది సంవత్సరంలో అనేక సార్లు ప్రత్యక్ష ,పరోక్ష పన్నులు వేయటం వలన ప్రజలపై భారం పడుతుంది. పురుషాధిక్య సంస్కృతి గల మన సమాజంలో సహజంగానే మహిళలు అన్ని అవసరాలు కుదించుకోవాల్సి వస్తుంది. జనాభాలో సగభాగం, చాకిరీలో 3వ వంతు వున్న మహిళల వాటా పెరగాలి. విద్య, వైద్యం, ఆహార భద్రత, ఉపాధి, సంక్షేమ పధకాలకు ప్రభుత్వం ప్రాధాన్యతనిస్తూ మహిళా అనుకూలమైన బడ్జెట్ కేటాయింపులు జరగాలి.

ధనికులపై పన్నులు వేయాలి. మూడవ వంతు వనరులు స్త్రీలకు కేటాయించాలన్న ప్లానింగు కమీషను సిఫారసులను అమలు చేయాలి. గృహ పధకాలకు బడ్జెట్‌లో నిధులు పెంచాలి. వితంతువులు, ఒంటరి మహిళల కొరకు ప్రత్యేక పధకాలు, పెన్షన్ సౌకర్యం, గృహ పధకాలు విస్తరింపచేయాలి.

❋

## చైతన్య మానవి ఈ సంచికలో...



అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం

1-8-538/4, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.

ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు

ఎస్. పుణ్యవతి

మేనేజర్

ఎం. సుధ

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

టి. జ్యోతి

కె. స్వరూపరాణి

విరాళం రూ : 5/-

ప్రజాశక్తి డైలీ ప్రింగ్‌ప్రెస్, ముషీరాబాద్, హైదరాబాద్ - 500 020

## ఈ ధాత్రిని

కపిల.రాంకుమార్

ఈధాత్రిని రాత్రి పగలు
ఏనాగులు తిరిగెనో
ఏ తల్లిని ఏ చెల్లిని
కాటువేయ పొంచెనో

చరణం : చూపులతో మాటలతో - అడుగడుగున హింసలే
చేతులతో కూతలతో -త్రాగుబోతు మగని పోగరు
ర్యాగింగుల వెకిలి చేష్ట - ఉక్కునగర ఆటో లీల
సిటీ చదువు సెల్ క్రీడలు - నెలరాలె లేతపూలు
॥ఈ ధాత్రిని ॥

పొలంగట్టు చెట్టుచాటు - తరాల పెత్తనపుకాటు
రాలుకోట్టు బంగ్లాకట్టు-కొలువుదొరల కోరచూపు
ఒళ్ళంతా కళ్ళతో - కుళ్ళ యావకై పెక్కి
ఫైళ్ళు చూసే సాకుతో - ఒళ్ళు తడిమె ఆ కళ్ళు
॥ఈ ధాత్రిని ॥

రాజ్యాంగం సాక్షిగా - ఆడమగా సమానం
దుశ్శాసన పర్వంలో - నలుగుతున్న అంగాంగం
ఎర్రటోపి నల్లకోటు - తోడు దొంగలైన వేళ
కళ్ళ గంతల న్యాయం - ఆడతనానికి వెల కట్టి
॥ఈ ధాత్రిని ॥

ఎన్నాళ్ళీ పథ్యాల గాథ - తెగువ చూపి తిప్పికొట్టు
దురాచార కిచకుల - దినవార పిండమెట్టు
చెంగు నడుముదోపి - చేయి చేయి కలుపు
హింసపై పోరాదగ - ఐద్వా జెండా చేతబట్టు

# ఒంటరి మహిళలు - స్థితి గతులు

## జిల్లాల సర్వే వివరాలు

**విశాఖ**

జిల్లాలో మద్దిల పాలెం, కంచరపాలెం, ఇండస్ట్రియల్ డివిజన్, గాజువాక, అనకాపల్లి, నర్సీపట్నం, డివిజన్లలో 10 వార్డులలో దాదాపు 1,000 ఇళ్ళల్లో 150మంది ఒంటరి మహిళలను కలిశాము. వారిలో 80%మంది మహిళలు బి.సి.లు. 90%మంది నిరక్షరాస్యులు. త్రాగుడు, అనారోగ్యంతో చనిపోయిన మగవారు 90%. వారు కూలి పనులు చేసుకుంటూ అసంఘటితరంగంలో పనిచేసేవారు కావడం వలన ఎవరికీ ఆస్తులు లేవు. ముగ్గురికి పెన్షన్స్ వస్తున్నవి. ఒకరు డిగ్రీ చేశారు. ఒక అమ్మాయి భర్త ఉద్యోగం వస్తుంది అని ఎదురు చూస్తున్నది. 10 వరకు చదివిన వారు ఎవరూ లేరు. 7వ తరగతి చదివిన వారు 6గురు ఉన్నారు. ఒక్క మహిళ మాత్రమే భర్త ఆస్తికి వారసులు అయ్యారు. ఇద్దరు మగవాళ్ళు ఎయిడ్స్‌తో చనిపోగా ఒకరికి ఎయిడ్స్ కూడా సోకింది. ఆమె వయస్సు 25సం॥లు. 5గురు పిల్లలు. 1 నుండి ముగ్గురు పిల్లలు ఉన్న మహిళలు ఉన్నారు. పిల్లలను కూలికి పంపుతున్న కుటుంబాలు ఎక్కువ. వితంతు పెన్షన్స్ వచ్చేవారు 10 మంది మాత్రమే. ఎక్కువ మంది అప్లికేషన్స్ పెట్టి ఉన్నారు.




భర్త వదిలివేసిన మహిళలు 50మంది వరకు ఉన్నారు. భార్యాపిల్లలను వదిలేసి వెళ్ళిపోయిన మగవారే అధికం. వేరొక అమ్మాయిని తీసుకుని వెళ్లిన వారు 5గురు కాగా భార్యపై అనుమానంతో ఇద్దరు, పిల్లలులేరని ఒకరు భార్యను వదిలివేశారు.

భర్త చనిపోయిన వారికి ఎటువంటి సంక్షేమ పథకాలు వర్తించడం లేదు. ఎక్కువ మందికి తెల్ల రేషన్ కార్డులు కూడా లేవు. భర్త చనిపోయినవారిలో, భర్త వదిలేసిన వారు తక్కువ మంది మాత్రమే తల్లిదండ్రులు, అన్న దమ్ములపై ఆధారపడి జీవిస్తున్నారు ఎక్కువ మంది ఇంటి పనివారుగా, చిన్న చిన్న వ్యాపారాలు చేసుకుంటూ కుటుంబాలను పోషిస్తున్నారు. ఆర్థిక ఇబ్బందుల వలన పిల్లలను పై చదువులకు కూడా పంపించలేకపోతున్నారు.

సమాజం నుండి సూటిపోటి మాటలు, ద్వంద్వార్థ మాటలు అసంఘటిత రంగంలో పనిచేసేవారికి ఎదురవుతున్నాయి.

**తూర్పు గోదావరి:**

జిల్లాలో ఒంటరి మహిళల సర్వే అమలాపురం 1 వార్డులో 100 ఇండ్లు చేస్తే 26మంది ఒంటరి మహిళలు ఉన్నారు. అందులో భర్త వదిలివేసినవారు, భర్త చనిపోయిన వారు ఉన్నారు. 19 ఏళ్ళ మహిళ ఒకరు, 20నుండి 30లోపు 5గురు, 30నుండి 40లోపు 9మంది, ఆపైన వయస్సు వారు 11 మంది ఉన్నారు. ఇద్దరు మాత్రమే 10వ తరగతి చదివిన వాళ్ళు. మిగిలిన వారు ఇంటి పని చేస్తున్నారు.

**పశ్చిమ గోదావరి:**

నర్సాపురంలో 100 మంది మత్స్యకారుల మహిళల్లో,పాలకొల్లులో 30 మంది బి.సి. కుటుంబాలలో, భీమవరంలో 50 ఎస్.సి. కుటుంబాలలో, ఆకివీడులో 50 ముస్లింకుటుంబాలలో, కొవ్వూరులో 50 ఎస్.సి. కుటుంబాలు, నిడదవోలులో 50 ఎస్.సి. కుటుంబాలలో, ద్వారక తిరుమలలో 100ఎస్.సి. కుటుంబాలలో సర్వే జరిగింది.

మొత్తం ప్రాంతాలలో 60 సం॥పైబడిన ఒంటరి మహిళలు ఎక్కువమంది ఉన్నారు. యువతుల సంఖ్య నర్సాపురంలో 5గురు, అందులో 3గురు ఎయిడ్స్ పేషెంట్స్. ఇద్దరు మతిస్థిమితం లేనివారు, మిగిలిన చోట్ల 100 కుంటుంబాలకు 25 లేక 30 మంది ఒంటరి మహిళలు ఉన్నారు. అందరూ ఆర్థిక ఇబ్బందులతో బాధపడేవారే. ఎయిడ్స్, తాగుడు వల్ల పురుషులు చనిపోయిన కుటుంబాలే మొత్తం ఉన్నాయి.

**ఆదిలాబాద్:**

జిల్లాలోని కుర్షీద్ నగర్‌లో మైనార్టీ మహిళల్లో సర్వే జరిగింది. చాలా సమస్యలు ఎదుర్కొంటున్నారు. రోజు కూలి పని చేసుకొని జీవనం కొనసాగిస్తున్నారు. మైనార్టీ మహిళల్లో బయటకు వెళ్ళి పని చేసుకోవటానికి ఇబ్బందులకు గురవుతున్నారు. అత్త మామ వేధింపులు బావలు, మరుదుల వేధింపులు, అందంగా ఉంటే కుటుంబ సభ్యుల వేధింపులకు గురవుచున్నారు. చిన్న చిన్న పేటల్లో బ్రెడ్ అమ్ముకునే పని, చెత్త ఏరే పనిని చేస్తున్నారు. ఒంటరి మహిళలు ఎక్కువగా జిన్నింగ్ మిల్లులలో పనిచేస్తున్నారు. కట్టెలు అమ్ముకునేవారు మనం వారి వద్దకు వెళ్ళి అడిగితే మా సమస్యలు ఇంత వరకు ఈ విధంగా ఎవ్వరూ అడగలేదు ఎవ్వరూ పట్టించుకోలేదు. అని వ్యక్తం

చేశారు. మైనారిటీ మహిళల్లో కూడా చాలా సమస్యలు ఉన్నాయి. ఇండ్లలో పాచిపనులు చేసుకుని బతుకుతున్నవారు ఉన్నారు.

50మంది మైనారిటీ మహిళల్లో సర్వే చేస్తే ఫ్యామిలీ బెనిఫిట్ స్కీమ్ ఇద్దరికి వచ్చింది. ఫించన్లు 15మందికి, మైక్రో ఫైనాన్స్ ఫండ్ ఒకరికి వచ్చింది. పావలా వడ్డీ మాత్రం ఎవ్వరికీ రాలేదు. మైనారిటీ ఒంటరి మహిళలకు ఉపాధి లేదు. ముగ్గురు కూరగాయలు అమ్ముకుంటున్నారు.

**హైదరాబాద్:**

నేడు ప్రభుత్వాలు అనుసరిస్తున్న ఆర్థిక విధానాల కారణంగా కుటుంబాన్ని ఒంటరిగా పోషిస్తున్న మహిళలు సంఖ్య పెరుగుతున్నది. ఆర్థిక విధానాల కారణంగా పల్లెల్లో పనిలేక పట్నాలకు వలసవస్తే పేదలతో పనిలేదు, అన్నింటికీ యంత్రాలు ఉన్నాయంటూ పట్టణాలు వెక్కిరిస్తున్నాయి. సమస్యలను తట్టుకోలేక, కుటుంబాలను పోషించలేక, పురుషులు వ్యవసనాలకు బానిసవుతుంటే ఆ కుటుంబ భారాన్ని స్త్రీలు మోస్తున్నారు.

వితంతువులు, భర్త వదిలివేయబడినవారు, విడాకులు పొందినవారు, పెళ్ళి కాని మహిళలు మన రాష్ట్రంలో నూటికి 30నుండి 35 మంది ఉన్నారు. వీరిని బంధువులు, చుట్టుప్రక్కల సమాజం కూడా చులకనగా చూస్తున్నారు. ప్రపంచీకరణ, వినియోగదారీతత్వం పెరగడంతో అన్ని తరగతుల్లో భార్యను వదిలివేసి కట్నం కోసం మరోపెళ్ళి చేసుకుంటున్నారు. ఎన్నారై పెళ్ళిళ్ళు కూడా మూణ్ణాళ్ళ ముచ్చట అవుతున్నాయి. ఉగ్రవాదులు, మతోన్మాద దాడుల్లో భర్తలు కోల్పోయిన వారు ఉన్నారు. ఇటువంటి స్త్రీలపై లైంగిక వేధింపులు, అత్యాచారాలు జరుగుతున్నాయి.

**సర్వే రిపోర్టు:**

1 వయస్సు: 20-30 మధ్య 33 మంది, 30-40 మధ్య 54 మంది, 40-50 మధ్య 39మంది, 50-80 మధ్య 78 మంది.

2. వలస ప్రాంతాలు: వరంగల్ 54(15.43%), ఖమ్మం 16(4.57%) కరీంనగర్ 49(14%) హైదరాబాద్ 91(26%), రంగారెడ్డి 35(10%)

3.సామాజిక తరగతి: ఎస్.సి. 82(23.4%), బి.సి. 117(33.4%), మైనారిటీ 50(14.3%), ఒ.సి. 40(11.4%), ఎస్.టి. 60(17%)

4.వృత్తి:- కూలి 98(28%), పాచిపని 100(28.6%), కూరగాయల వ్యాపారం 50(14.3%), గృహిణి 49 (14%), ఏ వృత్తి పేర్కొననివారు 3(0.9%), ఉద్యోగాలు 50(14.3%)

5. ఆదాయం:సంవత్సరానికి 10వేల లోపు 123(35.1%), 15వేల లోపు 94(26.9%) 20వేల లోపు 60(17.1%) ఆపైన 50 (14.3%), ఆదాయం పేర్కొననివారు 23(6.6%)

6. ప్రభుత్వ పథకాలు: ఇప్పటి వరకు ఎవరికీ ఈ పథకాలు అందలేదు. తెల్ల రేషన్ కార్డులు 150 (49.9%), పెన్షన్‌లు పొందతున్నవారు 98(28%), పొదుపు గ్రూపులలో ఉన్నవారు 20(5.7%), ఫైనాన్స్ అప్పులు చేసినవారు 24(6.9%), ఇంటి లబ్దిదారులు ఒక్కరు (0.3%),పేర్కొననివారు 57(16.3%)

7 భర్త చావుకు కారణం: (223మందికి గాను) అనారోగ్యంవల్ల 105(47.1%) యాక్సిడెంట్ 16(7.2%) తాగుడు 63(28.3%), హత్య కేసుల వల్ల 1(0.4%), ఏ కారణం వ్రాయనివారు 38(17%)

8. భర్త వృత్తి: 299మంది కూలి మరియు ఆటో డ్రైవరు, రిక్షా ఒక్కేవారని రాశారు. ఒక్కరు వ్యవసాయం అని పేర్కొన్నారు. ఆస్థికి హక్కుదారులు కాలేదని కారణమని చెప్పారు. ఆస్తిలేకపోవడం, అత్తమామలు ఆస్తి ఇవ్వకపోవడం.

9. భర్త వదిలేయడానికి కారణాలు:(77మందికి గాను) అక్రమ సంబంధం 9(11.7%), బాధ్యతారాహిత్యం (తాగుడు) 20(26%), పిల్లలు కలుగలేదని 8(10.4%), ఇష్టం లేకపోవడం 25(325%), వికలాంగులు కావడం 5 (6.5%), కట్నం 10(13%)

10. ఇరుగుపొరుగు ఎలా చూస్తారు: అవమానాలు, చులకనభావం-52, మిగిలినవారు ఏమీ రాయలేదు.

11. పెళ్ళికాకపోవటానికి కారణం:- ఆదాయం లేకపోవడం, వరకట్న సమస్య అని వికలాంగ మహిళలు పేర్కొన్నారు.

12. ఇతర సమాచారము: ఒంటరి మహిళలకు ఇళ్ళు అద్దెకు ఇవ్వకపోవడంతోపాటు ఇంటా, బయటా అనేకనమ్యలు ఎదుర్కొంటున్నామని, సమస్యల పరిష్కారం కోసం అందరం ఐక్యంగా పోరాడుదామన్నారు.

**అనంతపురం:**

అనంతపురం నగరంలో 5 కాలనీలలో సర్వే చేయడం జరిగింది. సర్వే చేసిన సందర్భంగా స్పందన చాలా బాగా వచ్చింది. ఎక్కువ మంది చిన్న వయస్సులో భర్తలను కోల్పోయినవారు, మధ్య తరగతిలో కూడా ఉన్నారు. 600 ఒంటరి మహిళలలో సర్వే చేశాము. వీరిలో బిసిలో 256 మంది, మధ్య తరగతి-147, ఇతరరులు-47, ఎస్.సి. 97, ఎస్.టి. 22 మంది ఉన్నారు. భర్తలు తాగి చనిపోయిన వారు 43, అనారోగ్యంతో గుండె జబ్బులు, ఇతర జబ్బుల కారణాలతో 289, ఎయిడ్స్ -6, యాక్సిడెంట్ 46, పెళ్ళి కాని వికలాంగులు 21, అప్పులు తీర్చలేక 11, భర్త వదిలివేసినవారు 129మంది ఉన్నారు. ఇంటి అద్దెకట్టలేక, పిల్లలను చదివించలేక సతమతమౌతున్నారు.

## ధైర్యమే కవచం

(హైదరాబాదు సదస్సు)

సునీత, నస్రీన్, యాదవ్వ, మల్లమ్మ, ఆండాళ్ళు .....పేర్లు వేరు. ఊళ్ళు వేరు. కాని వేదిక మీద ఎవరికి వారు తమ కథ చెప్తూ కంటతడి పెడితే ప్రేక్షకులంతా కళ్ళు తుడుచుకున్నారు. వారందరినీ కలిపింది ఒకే సమస్య...ఒంటరితనం. ఆ ఒక్క సమస్య మాటున దాగిన వేనవేల ప్రశ్నలు గుండెల్ని పిండేస్తుంటే...ఒంటరి జీవన పోరాటానికి సిద్దమైన వాళ్లకు ఇప్పుడొక ఆసరా దొరికింది. అల్లంత దూరాన మిణుకు మిణుకుమంటున్న ఆశాదీపం.....ఓ పక్క కన్నీరు కారుతున్నా మరోపక్క చిరునవ్వూ కదలాడింది.

ఒంటరి మహిళల సమస్యలపై ఐద్వా చేపట్టిన అధ్యయనంలో భాగంగా హైదరాబాద్‌లో నిర్వహించిన ఒక సదస్సులో కన్పించిన దృశ్యమిది.

సునీత వరంగల్‌లో ఎనిమిదో తరగతి చదువుతున్నపుడు

పెళ్ళైంది. హైదరాబాదులో సొంతిల్లుందని చాలా గొప్పలు చెప్పారు అవతలివాళ్ళు. ఎనభై వేలు కట్నమిచ్చి పెళ్ళి చేసుకున్న వారంరోజులకే మోసపోయామని అర్థమైంది. వాళ్ళకు ఆస్తులూ లేవు. కష్టపడి పనిచేసే అలవాటూ లేదు. కొన్నాళ్ళు గుంజాటన పడినా సునీతే తల్లిదండ్రులకు నచ్చజెప్పింది. ఇద్దరం పనిచేసుకుని బతుకుదామని భర్తను ప్రోత్సహించింది. ఇద్దరు పిల్లలు పుట్టారు. కానీ అతని ధోరణిలో మార్పులేదు. ఇంటికి రూపాయి తెచ్చివ్వకపోగా వివాహేతర సంబంధాలతో సునీతను నానా హింసా పెట్టేవాడు. అతడ్ని వదిలించుకుని కష్టపడి ఎన్నో పనులు చేసుకుంటూ పిల్లలిదర్నీ చదివించుకుంటోంది సునీత. తానూ ఓపెన్ యూనివర్శిటీలో బి.ఎ. చదువుతోంది. బస్తీలో వారందరికీ తలలో నాల్కలా ఉంటూ అవసరమైన పనులు చేసిపెట్టే సునీత పొదుపు బృందాన్ని కూడా తయారుచేసింది. సమాజంలో ఒంటరి మహిళగా ఎదుర్కొనే సమస్యలకు లెక్కేలేదు. వాటికి భయపడి ఆగిపోతే పిల్లలకే కాదు, మనకు మనమే అన్యాయం చేసుకున్నవాళ్లమవుతాం. సమాజాన్ని ఎదుర్కొంటూనే ముందుకు పోవాలి అంటూ తోటివారికి నూరిపోస్తుంది ఈ ధీర.

**రకరకాల కారణాలు:-**

సమాజంలో అన్ని వర్గాల్లోనూ పలు కారణాల వల్ల స్త్రీలు ఒంటరిగా మిగిలిపోవాల్సివస్తోంది. సమస్య ఎవరికైనా సమస్యే. కానీ ఆర్థికంగాకాస్త పర్వాలేదనుకున్నవాళ్ళు, ఉద్యోగస్తులను పక్కన పెట్టి కింది స్థాయి, మధ్యతరగతి, నిరుపేద వర్గాల్లో వారిని పరిశీలిస్తే వారి జీవితాలు ఎంతో దయనీయంగా ఉన్నాయి. ఐద్వా 16 జిల్లాల్లో సర్వే చేపట్టింది. కొన్ని వేలమంది మహిళలను ప్రశ్నించి నివేదికలు రూపొందిస్తుంది. ప్రాంతాలవారీగా వారిని సమీకరించి సదస్సులు నిర్వహిస్తున్న ఐద్వా హైదరాబాద్‌లో ప్రాంతీయ సదస్సు ఏర్పాటు చేసి హైదరాబాద్ లో చేసిన అధ్యయన వివరాలను ప్రకటించింది. సదస్సులో అనేకమంది మహిళలు ప్రభుత్వ సహాయాన్ని కోరారు. భర్త మరణించిన వారు, విడాకులు తీసుకున్నవాళ్ళు, భర్త మరొకరితో వెళ్లిపోగా ఒంటరిగా మిగిలినవాళ్లు, అవివాహితులు, ఇలా పలు కారణాలవల్ల చాలా మంది జీవితంతో ఒంటరి పోరాటం చేస్తున్నారు. భర్త మరణించినవారిని కదిలిస్తే ప్రదానంగా మద్యపానం అనారోగ్యానికి దారితీస్తోందనడం గమనార్హమంటోంది ఐద్వా.

ఒంటరిగా జీవించడమంటే ఒకటి కాదు అన్నీ సమస్యలే. వీటిని కుటుంబం,సమాజం, ప్రభుత్వం... ఈ మూడు కోణాల నుండి చూడాల్సివుంటుంది. తనను తాను పోషించుకోవడానికి, బిడ్డల్ని పోషించడానికి, చదివించడానికి వీరు రెక్కలు ముక్కలుచేసుకోవాల్సి వస్తుంది. సునీత ఒకదశలో పొద్దున్న, సాయంత్రం చెరో మూడుగంటలు మానసిక వైకల్యంతో బాధపడుతున్న పిల్లలకు ట్యూషన్లు చెప్తూ మధ్యాహ్నం వేళ పదిమంది ఇళ్ళల్లో బట్టలుతికేదట. పాచిపని చేసుకుంటూ పిల్లల్ని పోషించుకుంటున్న మహిళలెందరో ఉన్నారు. ఒంట్లో శక్తి ఉన్నంతవరకు పనులు చేసుకుంటారు. ఆ తర్వాత? మల్లమ్మ, ఆండాళు..వీళ్లు ఆ దశలోనే ఉన్నారు. పిల్లల పెళ్ళిళ్లు చేసి పంపారు. వయసు మీరిన వీరిని చూసుకునే తాహతు వారికి లేదు. ఎదిగిన బిడ్డలున్నారని పింఛను ఆపేశారు. మేమెలా బతకాలి? అంటూ ఏడుస్తూ ప్రశ్నించారు పలువురు వృద్ధ మహిళలు. ఇక సమాజంలో వేధింపులు సరేసరి. ప్రభుత్వం నుంచి వీరికెలాంటి సహాయకాలూ లేవు.

వాళ్ళేం కోరుతున్నారంటే...

**1. ఒంటరి మహిళల సంక్షేమానికి బడ్జెట్‌లో ప్రత్యేక నిధి ఏర్పాటు చేయాలి.**

**2.కేరళలోలాగా ఇళ్ల స్థలాలు, అంత్యోదయ కార్డులు ఇవ్వాలి.**

**3. జాతీయ కుటుంబ సంక్షేమ నిధిని విడుదల చేయాలి. కుటుంబ లబ్ధి పథకం కింద ఆర్నెల్లలోపు పదివేల రూపాయల నిధిని విడుదల చేయాలి.**

**4. పిల్లలకు చదువు, ఉద్యోగ అవకాశాలు కల్పించాలి.**

**5. వితంతు, వృద్ధాప్య పింఛన్లతోపాటు ప్రభుత్వ పథకాలన్నీ వీరికి అమలుచేయాలి. పింఛను 200రూ॥ల నుంచి 500రూ॥లకు పెంచాలి.**



# హైకూలు

## అకాల వర్షం

కల్లాల్లో నిండుగా ఎర్రబంగారం
రైతన్న కంట్లో కన్నీరై కురిసింది
పాలకుల పర్యటనల్లో
తాలుగాయైతేలింది!!

----------

పచ్చని పైరుగాలి
ఆశల్ని మోసింది!
కాంక్షల్ని పెంచింది
అకాల వర్షం రైతన్న గుండెల్ని పిండింది!!

---------

నిండుగా పైరు
నీలాడ్డానికి సిద్దంగా!
నేలంతా పరుచుకుంది
మాయదారి వాన నోట్లోనే కొట్టింది!!

\- సుధాకిరణ్. బి.

# ఎట్టకేలకు అడవుల చట్టం!



-బృందా కరత్

షెడ్యూల్డ్ తెగల, ఇతర సంప్రదాయ అటవీ నివాసుల (ఓటిఎఫ్‌డి) (అటవీ హక్కుల గుర్తింపు) చట్టం 2006 అమలుకు కావలసిన విధానపరమైన నిబంధనలను ఎట్టకేలకు జనవరి 1న కేంద్ర ప్రభుత్వం నోటిఫై చేసింది. ఇదంతా జరగటానికి దాదాపు ఏడాది కాలం పట్టింది. నిబంధనలను నోటిఫై చేయని పక్షంలో ఏ చట్టమైనా అమలుకు నోచుకోదు. పార్లమెంటరీ నిబంధనలను అనుసరించి సర్వసాధారణంగా ఒకచట్టాన్ని ఆమోదించిన ఆరు మాసాలలోపు వీటిని నోటిఫై చేయవలసి ఉంటుంది. కాని ఇటీవలి కాలంలో మూడు చట్టాల విషయంలో ఈ సంప్రదాయం ఉల్లంఘనకు గురైంది. సెజ్ చట్టాన్ని తీసుకుంటే అభివృద్ధి కమిషనర్‌లను నియమించే విషయంలో ప్రభుత్వానికి విపరీతమైన అధికారాలను కల్పించటం జరిగింది. గృహ హింస వ్యతిరేక చట్టం విషయంలోఉద్దేశపూర్వకంగానే నిబంధనల ప్రకటనను ఏడాదిపాటు జాప్యం చేశారు. అటవీ చట్టం విషయంలో కూడా ఇదేరకమైన జాప్యం జరిగింది. ఈ లోపల పలు రాష్ట్రాలలో గిరిజనులను వారి వారి నివాసాల నుంచి వెళ్లగొట్టారు. పార్లమెంటు అభీష్టానికి తూట్లు పొడిచేటందుకు బలమైన వర్గాలే ప్రయత్నించాయి. నిబంధనల ప్రకటన జారీని మరింత జాగు చేయించటానికి లేదా చట్టంలోని కొన్ని సెక్షన్‌లను మార్చేటందుకూ ఈ వర్గాలు పూనుకున్నాయి.

**ఫలించని కుయుక్తులు:**

ప్రస్తుతాంశానికి వస్తే వన్య మృగాలు తిరిగే ప్రాంతాల నుంచి గిరిజనులను ఖాళీ చేయించేవరకు నిబంధనల జారీని నిలిపి ఉంచాలంటూ గిరిజనులకు వ్యతిరేంగా వున్న పర్యావరణ 'సంరక్షకులు' ఉన్నతాధికారులు చాలా ప్రయత్నాలు చేశారు. నిజానికి ఇలాంటి చర్యలు చట్టాన్ని దెబ్బతీసే స్వభావాన్ని కలిగి ఉన్నాయి. ఈ చట్టం పరిధిలోకి వచ్చేది కేవలం 2 శాతం భూమి మాత్రమే అయినప్పటికీ అటవీచట్టం కారణంగా అడవులన్నీ నాశనమవుతాయంటూ దుష్ప్రచారాన్ని సాగించారు. దొడ్డితోవన జరిగే ఈ ప్రయత్నాలు అమలు కాలేదంటే అందుకు కారణం అఖిలపక్ష ప్రతినిధి బృందం ప్రధానిని కలవటంతో పాటు, ఈ అంశంపై పార్లమెంటులో మార్క్సిస్టు పార్టీ వాకౌట్ చేయటం, పర్యావరణ మంత్రిత్వ శాఖ కార్యదర్శిపై హక్కుల తీర్మానాన్ని ప్రవేశపెట్టటం, సంబంధిత అధికారులతో పలుసార్లు సమావేశాలను నిర్వహించటం, అన్నిటినీ మించి గిరిజనులను సమీకరించడం వల్ల ఇప్పటికైనా ఈ నిబంధనల ప్రకటన వెలువడింది.

గతంలో పలుమార్లు చెప్పినట్లుగా ఇప్పటి చట్టం పేర్కొన్న అన్ని రక్షిత ప్రాంతాలలోనూ వన్యమృగాలు నివసించే ప్రాంతాలను గుర్తించి అక్కడ నుండి గిరిజనులను గెంటివేసేటందుకు అవసరమైన సమయం కోసమే నిబంధనల ప్రకటనను జాప్యం చేశారు. గిరిజనుల, ఇతర సంప్రదాయ నివాసుల అటవీ భూముల హక్కులను గుర్తించటంలో ఈచట్టం చాలా కీలకమైనది. దేశం మొత్తం మీద చూసినట్లయితే 600 రక్షిత ప్రాంతాలున్నాయి. చట్టం చెపుతున్నట్లుగా ప్రధానమైన వన్యమృగాల నివాసాలను గుర్తించటానికి కనీసం ఒకటి రెండేళ్ళు పడుతుంది. ఈ చర్యలను ప్రభుత్వం విడనాడింది. ఇంతకుముందున్న వన్యమృగ సంరక్షణ శాసనాలు ప్రధానంగా పులుల సంరక్షణతో ముడిపడి ఉన్నాయి. నిబంధనలను జాప్యం చేస్తే పులుల సంరక్షణ కేంద్రాలలో (సూత్రబద్ధంగా ఆమోదించిన ఎనిమిదింటితో సహా) గుర్తింపు పని పూర్తయింది. మొత్తం 273 గ్రామాలను వేరే చోటకు మార్చాలని నిర్ణయించారు. ఈ సందర్భంగా ఒక విషయాన్ని గమనంలో ఉంచుకోవాలి. అటవీ భూమిని ఖాళీ చేసే ప్రతి గిరిజన కుటుంబానికి కేవలం లక్ష రూపాయలనుమాత్రమే ప్రభుత్వ ఇస్తుంది. దీనిని మార్క్సిస్టు పార్టీ పార్లమెంటులో తీవ్రంగా వ్యతిరేకించింది. నిరసనలు వెలువడటంతో ప్రతికుటుంబానికి పదిలక్షల రూపాయలు లేదా ప్రత్యామ్నాయ భూమిని ఇచ్చే విధంగా ఒక ప్యాకేజిని రూపొందించినట్లు తెలియవస్తున్నది. ఈ పెంపుదల గణనీయమైనదే అయినప్పటికీ ఈ సందర్భంగా కొన్ని ప్రశ్నలు తలెత్తక మానవు. మొదటిదేమిటంటే అసలు ఈ పునరావాసం అవసరమా అన్నది. గిరిజనులతోనూ, ఇతర గ్రామస్తులతోనూ ముందుగా సంప్రదింపులు జరపాలని చట్టం చెపుతున్నదా లేదా అన్నది రెండవది. ఈ రకమైన సంప్రదింపులు లేకుండా ఎలాంటి పునరావాస చర్యలనుచేపట్టరాదు. ఛత్తీస్‌ఘర్‌లో ఇలాంటివి 50 గ్రామాలు ఉన్నాయి. మధ్య ప్రదేశ్, రాజస్థాన్, మహారాష్ట్ర, ఒరిస్సాలలో మిగిలినవి ఉన్నాయి. వారి హక్కులకు రక్షణ ఉండేలా వారితో సంప్రదింపులు జరపటం ఎంతైనా అవసరం.



**లోటుపాట్లు:**

ఎట్టకేలకు ప్రకటించిన నిబంధనలలో చాలా లోటుపాట్లు ఉన్నాయి. మరీ ముఖ్యంగా ఐదింటిని ప్రత్యేకించి చూడవలసిఉంది. మొదటిదేమిటంటే విశుద్ధ జీవితావసరాలకు సరికొత్త భాష్యాన్ని చెప్పారు. ఇది, అటవీ ఉత్పత్తులకు సంబంధించి చట్టం ఇచ్చిన హక్కులను తోసిపుచ్చే ప్రయత్నం చేస్తున్నది. రెండవది ఏమిటంటే, అడవుల పరిసరాలలో నివసించే వారి గురించి స్పష్టత లేకపోవడం. మూడవ విషయం, గ్రామ సభల నిర్ణయినికి వ్యతిరేకంగా విజ్ఞాపనలు చేసుకునే వారిలో 'ప్రభుత్వ సంస్థలను' కూడా చేర్చడం. గ్రామసభలో కోరం అత్యధికంగా ఉండాలని పట్టుబట్టటం నాల్గవది. పార్లమెంటులో మంత్రి ఇచ్చిన హామీలను నిబంధనలలో చేర్చకపోవడం ఐదవది. ఇలాంటి వాటినన్నటిని దృష్టిలో ఉంచుకుని నిబంధనలను సరిదిద్దాలి.

ఏది ఏమైనప్పటికీ ఈ చట్టాన్ని త్వరగా అమలు చేసేటందుకై మనశక్తి సామర్థ్యాలను సంపూర్తిగా వినియోగించాలి. ప్రస్తుత చట్టాన్ని అనుసరించి గిరిజనులను, ఇతర సంప్రదాయ అటవీ నివాసులను వారి నివాసాల నుంచి ఖాళీ చేయించే కార్యక్రమాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వెంటనే విరమించాలి. మధ్య ప్రదేశ్, రాజస్థాన్, జార్ఖండ్, మహారాష్ట్రలలో ఇప్పటికీ అటవీ వాసులను ఖాళీ చేయించే కార్యక్రమం కొనసాగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. కొన్ని చోట్ల అటవీ అధికారులు గుంటలు తవ్వుతున్నారు. దశాబ్దాలుగా ఈ ప్రాంతం గిరిజనుల స్వాధీనంలో ఉన్నప్పటికీ ఇలా జరుగుతున్నది. చట్టంలోని నిబంధనలను అనుసరించి ఈ అక్రమ చర్యలను ప్రతిఘటించవలసి వున్నది.

ఇందుకు గాను తక్షణమే ఈ చర్యలను తీసుకోవాలి. 1. ఎలాంటి జాప్యం లేకుండా తక్షణమే వెరిఫికేషన్ చర్యలను చేపట్టాలి. రాష్ట్ర కమిటీలు, ప్రజా సంఘాలు సంబంధిత అధికారులను కలుసుకుని గ్రామ సభలను సమావేశ పరిచే కార్యక్రమాన్ని తక్షణమే నిర్వహించవలసిందిగా కోరాలి. అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు వెనువెంటనే కదలి ఈ క్రమాన్ని ప్రారంభించటానికి చొరవ చూపాలి. చట్టాన్ని అనుసరించి గ్రామ సభలు, అటవీ హక్కుల కమిటీలను ఎన్నుకోవాలి. భూమికి సంబంధిచి అర్హులైన వారి విజ్ఞాపనలను పరిశీలించాలి. కమిటీలో కనీసం మూడింట ఒక వంతు గిరిజనులు ఉండేలా చూడాలి. 2. ఫిర్యాదుదారులు తమ ఫిర్యాదులను అటవీ కమిటీకే అందచేయాలి. లబ్దిదారులు తమ హక్కులను తెలుసుకొనేలా అచ్చువేసిన ఫారంలను గిరిజనులకు అందచేయాలి. ఎలాంటి జాప్యము లేకుండా వారి హక్కులను అమలులోకి తేవాలి. జాబితాలో పేర్కొన్న తొమ్మిది ఆధారాలలో ఒకదానికన్నా ఎక్కువైన ఆధారాలను ఫిర్యాదీదారుడు అందచేయవలసి ఉంటుంది. అవి, పూర్వీకులు ఇచ్చిన హక్కు పత్రం లేదా ప్రభుత్వం జారీ చేసిన ఓటరు కార్డు. రేషన్ కార్డు వగైరాలు. 3. మైనర్ ఫారెస్టు ఉత్పత్తులకు సంబంధిచిన హక్కులను అమలు చేయవలసిందిగా సంబంధితులకు అటవీ శాఖ సూచనలు ఇవ్వాలి. ప్రత్యేకించి గిరిజన మహిళలు ఎక్కువగా వేధింపులకు గురౌతున్నారు. రూ. 100ల విలువకు మించని ఉత్పత్తులను పోగు చేసినందుకుగాను దాదాపు 11,000 కేసులు అపరిష్కృతంగా ఉన్నాయి. ఇలాంటి కేసులన్నీ వెంటనే ఉపసంహరించాలి. 4. దంపతుల పేరుతో భూమి పట్టాలను ఇస్తున్నందున చట్టాన్ని అనుసరించి గిరిజన మహిళలకు ప్రత్యేకమైన హక్కులు ఉంటాయి. ఈ హక్కులను తెలియ చెప్పేటందుకై విస్తృతంగా ప్రచారం జరగాలి. 5. అటవీ నివాసులతో మనకుగల సంబంధాలను వినియోగించి మాఫియా ముఠాలను ఏకాకులను చేయాలి. గిరిజనులను పావులుగా ఉపయోగించుకునే వారి ఎత్తుగడలను భగ్నం చేయాలి.

గిరిజనులు, ఇతర సంప్రదాయక అటవీ నివాసులు ఎదుర్కొంటున్న చారిత్రక అన్యాయాలను తుదముట్టించడంలో ఈ చట్టం గణనీయమైన పాత్రను నిర్వహించగలదు. ఈచట్టాన్ని నిబంధనలను తీసుకురావటంలో మార్క్సిస్టు పార్టీ గణనీయమైన పాత్రనే నిర్వహించింది. ఇక యిప్పుడు ఈ చట్టం అమలయ్యేలా చూడటంలో చురుకైన పాత్రను నిర్వహించాలి.



## అప్పుడు తెలియలేదా?

ఇప్పుడు ఆడపిల్లల కొరత వేధిస్తోందని
మగవాళ్ళకి మనోవ్యాధి పట్టుకుంది..
తోడు దొరకక ఒంటరి పక్షుల్లా
ఎక్కడ వాలాలో అర్థం కాని నైరాశ్యం పీడిస్తోంది.
స్కానింగ్ వెలుతురులో వేటాడినపుడు
తెలీదా ఈ పర్యవసానం..
ప్రేమనే వేట కొడవళ్లు చేసి
పీకలు తెగ్గోసిన రోజు..
తమ జీవిత మూలాలకి అది గొడ్డలిపెట్టని
తెలుసుకోకపోతే ఇలాగే ఉంటుంది..
అశ్వమేధయాగంలా...
అహంకారపు గుర్రాన్ని వదిలి...
డబ్బుకోసం 'ఆడసూయ' యాగం చేస్తే
అమ్మైనా మిగలదని అర్థం కాని అజ్ఞానులా వీళ్లు..
తెలిసి చేసిన పాపమే అయినా
శాపంలా ఒంటరితనమై
తమనే చుట్టుకుంటుందని
ఊహించని మగ మూర్ఖత్వం అది
ఆడదాని తోడు లేకుండా మనగలిగే మగ
వాడిని
పురాణాల్లోనైనా చూపించగలరా..?
ఏ యుగమైనా...
అర్ధనారీశ్వరం అర్థవంతమైన
ఆచరణలో కొస్తే
ప్రత్యేక మహిళా దినోత్సవాల
అవసరం ఎందుకొస్తుంది?
మనుషులుగా మమేకమై
మనుగడ సాగించడం తప్ప..

-అమర్వాణి

(ఆంధ్ర జ్యోతి సౌజన్యంతో)

# ఇంటి పనివారికి కనీస వేతనం

★ రోజుకు వంద, ★ 8గంటల పనిదినం, ★ గంటలెక్కనా వేతన స్థిరీకరణ, ★ వారినికి ఒక రోజు సెలవు, ★ ఐద్వా కృషి ఫలితంగా జీవో.

తెల్లారిలేస్తే పలు ఇళ్లల్లో చాలా పనులు ఎదురుచూస్తుంటాయి. ఒకే వ్యక్తి కోసం . కడగాల్సిన పాత్రలు, ఉతకాల్సిన దుస్తులు, తుడవాల్సిన ఇళ్లు...నిత్యం నిరీక్షించేది ఆ వ్యక్తి కోసమే. ఆమెకు వారాంతపు సెలవు ఉండవు. పండగలొస్తే...ఇంటికి బంధువులొస్తే పని పెరుగుతుంది. నెల జీతం మినహా బోనస్‌లు, పింఛన్లు వారికి తెలియవు. వీటికి తోడు లైంగిక అత్యాచారాలు, దొంగతనం ఆరోపణలు ఎదుర్కోవాల్సి రావడమూ కద్దు. ఈ పరిస్థితిని మార్చేశామంటోంది కొత్త జీవో.




ఇంటి పనిచేసేవారికి కనీస వేతనం రోజుకు వందరూపాయలు ఉండేలా చూస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఒక జీవో విడుదలచేసింది. దాని ప్రకారం ఇక పని మనుషులకు జీతం పనిగంటలు బట్టి లెక్కించి ఇవ్వాల్సి ఉంటుంది. రోజూ ఎనిమిది గంటల చొప్పున పనిచేస్తే నెలకు రూ॥2600 చెల్లించాలి. రోజూ అరగంట చొప్పున పనిచేస్తే రూ॥163 ఇవ్వాలి. ఆ లెక్కన గంటకైతే 325రూ॥లు, గంటన్నర వ్యవధి పనికి 488రూ॥ల చొప్పున పనివారికి నెలవారీ వేతనాన్ని ఇవ్వాలని తేల్చారు. వారానికి ఒక రోజు సెలవు కల్పించారు. అది ఆదివారం కావొచ్చు మరో రోజు కావచ్చు. అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) అనుబంధంగా స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో దాదాపు ఐదేళ్లుగా సాగుతున్న ఉద్యమం తాజా జీవోకి నేపథ్యం.

ఐద్వా ఆధ్వర్యంలో ఐదేళ్ళ క్రితమే స్నేహ ఇంటి పనివారల సంఘం ఏర్పడింది. రాష్ట్ర వ్యాప్తంగా 85 పట్టణాల్లో శాఖలు ఉన్న ఈ సంఘం ఇంటి పనివారికి కనీసవేతనం ఇవ్వాలంటూ చాలా కాలంగా ఆందోళన చేస్తోంది. అన్ని జిల్లాల నుంచి ఈ వృత్తిలో ఉన్న మహిళలను సభ్యులుగా తీసుకుని రాష్ట్ర కమిటీని ఏర్పాటు చేసి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. పని మనుషులను కార్మికులుగా గుర్తిస్తూ తెచ్చిన తాజా జీవో స్నేహ ఇంటిపనివారల సంఘ విజయంగా పేర్కొంటున్నారు. ఆ సంఘ రాష్ట్ర కన్వీనర్ జ్యోతి. వలసలు పెరిగిన నేపథ్యంలో నగరాల్లో , పట్టణాల్లో ఇళ్లలో పనిచేసే మహిళల సంఖ్య బాగా పెరిగింది. మా సంఘంలో సభ్యులే ముప్పైవేల దాకా ఉన్నారు. హైదరాబాదులోనే వారి సంఖ్య మూడు లక్షల వరకూ ఉంటుందని అంచనా. శ్రమ దోపిడీ మాత్రమే కాదు. పని వాళ్లు కొన్నిచోట్ల లైంగిక అత్యాచారాలకు, దొంగతనం ఆరోపణలను, అవమానాలను కూడా ఎదుర్కోవాల్సి వస్తోంది. ఇవన్నీ చూసే మేము చాలాకాలంగా ఆందోళన చేస్తున్నాం. మధ్యలో కనీస వేతనాలకు సంబంధించి గెజిట్ నోటిఫికేషన్ ఒకటి విడుదల చేశారు. కానీ అది సరిగా లేదని మేం అభ్యంతరం చెప్పాం. లేబర్ కమిషనర్ మీద ఒత్తిడి తెచ్చాం. దాంతో తాజా జీవో విడుదల చేశారు. గుర్తింపు కార్డులు, పి.ఎఫ్., ఇ.ఎస్.ఐ. లాంటివి ఇంకా పరిశీలనలో ఉన్నాయి. అవి కూడా ఇచ్చేవరకు మా ఆందోళన కొనసాగుతుంది. ఇప్పటి వరకు ఎవరూ పట్టించుకోని సమస్య ఇది. కర్ణాటక, మహారాష్ట్రలో ఇలాంటి చట్టం పకడ్బందీగా అమలువుతోంది.

ఈ విషయం ఎంతో సంతోషంగా ఉంది. సంఘటితమవడం వల్లే కార్మికులుగా గుర్తింపు లభించింది. సంఘంగా ఏర్పడకముందు చాలా ఇబ్బందులు ఎదుర్కొనేవాళ్ళం. తక్కువ వేతనాలు ఇచ్చేవారు. అవమానాలు ఎన్నో ఉండేవి. సంఘంలో చేరాక ఫోటోలతో గుర్తింపు కార్డులిచ్చారు. అవి పెట్టుకుని వెళ్తే యజమానులు కూడా మమ్మల్ని గుర్తించారు. గౌరవంగా మాట్లాడుతున్నారు. వేధింపులు తగ్గాయి. మా మిగిలిన డిమాండ్లు కూడా సాధించే వరకు ఆందోళన చేస్తూనే ఉంటాం. సంఘాన్ని మరింతగా పటిష్టపరిచేందుకు కృషి చేస్తాం. అని సంఘ నగర అధ్యక్షురాలు నాగమణి అంటున్నారు.

జీవో ఏమంటుందంటే!

1.పాత్రలు కడగటం, బట్టలు ఉతకడం, ఇల్లు ఊడవటం, తుడవటం, పిల్లలను చూడటం, వృద్ధులు, అశక్తుల సంరక్షణ, పచారీ సామాగ్రి తీసుకురావడం, పిల్లలను బడికి తీసుకెళ్లడం, తీసుకురావడం, ఇతర గృహ సంబంధ పనులు ఇంటి పనివారి జీవో పరిధిలోకి వస్తాయి. 2.రోజుకు (8గంటలు) వంద చొప్పున 28 రోజులకు రూ॥2,600 కనీసం వేతనం చెల్లించాలి. 3.రోజంతా పనిచేయించుకొనే అవసరం లేకపోతే అరగంట లెక్కించి నెల వేతనం ఇవ్వాలి. 4 నెలకు నాలుగురోజులు సెలవు. 5.జీతాలకుసంబంధించిన జమా ఖర్చులు యజమానులు నిర్వహించనక్కరలేదు. 6.తనిఖీ అధికారులెవరూ ఇంటి ఆవరణలోకి ప్రవేశించరాదు. 7.కార్మిక చట్టం కింద కార్మిక శాఖ కమిషనర్ తన సిబ్బందిని తనిఖీకి ఆదేశించవచ్చు. 8.14 ఏళ్ళ లోపు పిల్లలతోపనిచేయించుకోరాదు. 9.జీవోలో పేర్కొన్న మొత్తం కన్నా ఎక్కువ వేతనం ఇస్తున్నట్లయితే దాన్ని తగ్గించేందుకు వీల్లేదు. ○

-వకుళాభరణం లలిత

# ఉన్నవ లక్ష్మీబాయమ్మ



శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ ఒక రోజు ఆమెకు పరిచయమైన శ్రీమతి గోళ్ళమూడి రాజ్యలక్ష్మమ్మ గుంటూరు వాస్తవ్యురాలు గారింటికి వెళ్తే ఇంట్లో ఒక ఆరేళ్ళ పాప 'పతి భుజియించిన మెతుకొక్కటి మిగలకుండ'అని ఆ పాప చదువుతూ ఉంటే లక్ష్మాబాయమ్మ 'ఛీ ఛీ! ఏమిటా చదువు' అని అనటం ఆమె సంస్కరణ భావానికి మూలమని చెప్పవచ్చు. అల్లే విజయవాడలో జరిగిన ఒక సాహిత్య సభ ఉపన్యాసంలో ఒక ప్రసిద్ద కవి పురుషులైన కవులను గూర్చి, శిల్పులను, చిత్రకారులను గూర్చి ప్రస్తావించినపుడు లక్ష్మీబాయమ్మకు పట్టరాని కోపం వచ్చి 'ఏమి ఉపన్యాసమయ్యా యిది' ఒక స్త్రీ పేరైనా చెప్పారు కాదు. ఆంధ్ర నారీలోకం అంత గొడ్డుపోలేదు. అని చెప్పింది. స్త్రీలను ఇంత చిన్న చూపు చూచిన ఈ సభలో పాల్గొనటం మాకు మర్యాద కాదని ఆమె లేచిరావడం స్త్రీలపట్ల ఆమెకున్న శ్రద్ధాసక్తులను తెలపడానికి ఇదొక మంచి ఉదాహరణగా పేర్కొనాలి.

అంతటి చేవ ఉన్న మనిషి కాబట్టే లక్ష్మీబాయమ్మ బాలవితంతువులను ఆదరించి వివాహం చేయగల్గారు. ఊరంతా వెలివేసినా పుట్టింటివారు ఒత్తిడి తెచ్చినా భర్త ఉన్నవ లక్ష్మీ నారాయణ గారితో కలిసి ఉద్యమాలు నడిపించారు. వితంతు వివాహాలు చేయగల్గారు. జాతీయోద్యమంలో పాల్గొనగల్గారు. సహాయ నిరాకరణోద్యమం, విదేశీ వస్త్ర బహిష్కారం, ఖాదీ ఉద్యమం అన్నింటిలో ముందు నిలబడగల్గారు. లక్ష్మీనారాయణగారు జైలుకు వెళ్ళినా సహాయ నిరాకరణ బాధ్యతనంతా తన యొక్క భుజస్కందాల మీద వేసుకొని వాడ వాడలకు, పల్లె పల్లెలకు తిరుగుతూ జాతీయోద్యం ప్రచారాన్ని కొనసాగించారు. అంతేకాదు. మహిళా వాలంటీర్లను తయారు చేసి వారిచేత జాతీయోద్యమ గీతాలను పాడించారు. అవసరమైతే మహాకాళిగా మారిపొయ్యేవారు. ఆమెలో ఉన్న విప్లవ భావం, పరతంత్ర శృంఖలాలను ఛేదించి వెయ్యాలన్న తపన ఆమె ప్రతి అడుగులో, ప్రతి మాటలో కన్పిస్తుంది.

1882లో శ్రీ నడింపల్లి సీతారామయ్య, శ్రీమతి రామలక్ష్మమ్మల ముద్దు బిడ్డగా జన్మించిన లక్ష్మీబాయమ్మకు పదోఏట గుంటూరు తాలూకా వేములూరిపాడు వాస్తవ్యులైన ఉన్నవ లక్ష్మీనారాయణతో వివాహమైంది. స్ఫురద్రూపి, సరళస్వభావుడు, ఇంగ్లండులో బారిస్టరు పట్టా పుచ్చుకున్న ఉన్నవ లక్ష్మీనారాయణ గారితో వివాహం జరగడమే కాదు. ఆయన సంస్కార భావాలను, స్వాతంత్రేచ్ఛను అర్ధాంగిగా పుణికిపుచ్చుకున్నారు. భార్యను విజ్ఞానఖనిగా, సంస్కార భావాలుగల వ్యక్తిగా తీర్చిదిద్దడానికి లక్ష్మీనారాయణగారు ఎంతో కృషి చేశారు. దానికి తోడు ఈ దంపతులిరువురు గుంటూరులో ఒక వితంతువు శరణాలయాన్ని స్థాపించారు. రాజమండ్రి నుంచి శ్రీ వీరేశలింగం గారి పిలుపును అందుకొని ఆయన స్థాపించిన ఆశ్రమాన్ని శరణాలయాన్ని నిర్వహించడానికి పూనుకొని ఎంతో అనుభవాన్ని సంపాదించారు.

లక్ష్మీబాయమ్మ బాలికల కోసం 'శారదా నికేతన్' అనే గురుకుల పాఠశాలను గుంటూరులో ప్రారంభించారు. విదేశీపాలన వల్ల ప్రజల్లో పాతుకుపోయిన పాశ్చాత్య భాషా వ్యామోహాన్ని, పాశ్చాత్యుల్ని అనుకరించే తత్వాన్ని పోగొట్టడం ఈ పాఠశాల లక్ష్యంగా భావించారు. కుల,మత, జాతి విచక్షణ లేకుండా అందరిని చేర్చుకొని ఉచితంగా వసతి సౌకర్యాలను ఏర్పరిచారు. వయసు మళ్ళిన స్త్రీలను, వివాహితులైన స్త్రీలను చేర్చుకోవద్దని శ్రీ లక్ష్మీనారాయణగారు ఆంక్షలు పెట్టినా వారికే ప్రాధాన్యతనిచ్చి ఎంతో సమర్ధతతో సంస్థ నిర్వహణ భారమంతా వహించి కార్యక్రమాలను విజయవంతం చేయటంలో ఆమెకు ఆమె సాటి. జాతీయ నిధిని ప్రోగు చేయటానికి బర్మాకు కూడా వెళ్ళారంటే ఆమె పట్టుదలను, కార్య నిర్వహణా చాతుర్యాన్ని ఏమనవచ్చు. సంస్థలో చదువుతున్న ప్రతి బాలికలోనూ దేశభక్తి పెల్లుబికించడంలోనే ఆమె నాయకత్వం యిమిడి ఉంది. శ్రీమతి లక్ష్మీబాయమ్మ అంతటా తానేయై వీరావేశం ఉట్టిపడగా పరాశక్తిగా విజృంభించడం భారతజాతికే గర్వకారణంగా పేర్కొనాలి.

స్వాతంత్ర్య సమరంలో శ్రీ బాలగంగాధర్ తిలక్ ఆనాటి రాజకీయ గురువు. శ్రీ ఉన్నవ దంపతులు, శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, శ్రీ కాశీనాధుని నాగేశ్వర రావుపంతులు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీటంగుటూరి ప్రకాశం పంతులు, శ్రీ ఆచంట లక్ష్మీపతి దంపతులు తరచు పొట్లపూడిలో కలుసుకొని స్వరాజ్య సంపాదన గూర్చి, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం గూర్చి సమాలోచించేవారు. పల్నాటి ప్రజల పుల్లరి చెల్లించకుండా అడవులు ఉపయోగించుకొని ప్రభుత్వాన్ని చికాకుపరిచేవారు. అటువంటి తరుణంలోనే ఉన్నవ లక్ష్మీ నారాయణగారిని జైలుకు పంపించడానికి కారణమైంది. అప్పుడే శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతితో కలిసి ఆంధ్ర ప్రదేశంలో నిరవధిక ప్రచారం చేశారు. శిబిరాలు నిర్వహించడం, పోలీసు ధిక్కారాన్ని ఎదుర్కోవటంలో దిట్ట శ్రీమతి లక్ష్మీబాయమ్మ. ఒకనాడు పోలీసుదళం వచ్చి వడ్డించిన విస్తళ్ళను తొక్కిపారేసి, వండిన గుండిగలను కుమ్మరించడం, దొరికిన వారినెల్లా లాఠీలతో చావబాదడం గుంటూరులో మరువలేని దృశ్యం, మరుపురాని సంఘటన.

దేవరంపాడు గ్రామంలో ఉప్పుతయారీలో ఉండగా 1930 జూన్ 9వ తారీఖున లక్ష్మీబాయమ్మకు 8 నెలల కఠిన కారాగార శిక్షను ఆనాటి ప్రభుత్వం విధించింది. అల్లే శాసనోల్లంఘనం రెండోసారి దేశాన్ని కుదిపినప్పుడు పోలీసుల నిషేధాజ్ఞను అతిక్రమించి ఆమె ఢిల్లీకి చేరినపుడు మరల ఆమెను అరెస్ట్ చేశారు. మిన్ను విరిగి మీదపడ్డా వెన్నుచూపని అపర ఝాన్సీ బాయియే శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ. తాను ప్రచారం చేయడమేగాక శ్రీమతులు సంగం లక్ష్మీబాయమ్మ, బనవరాజు రాజ్యలక్ష్మమ్మ వంటి యువతులనెందరినో తీర్చిదిద్దగల్గారు. గుంటూరులో మూడోసారి అరెస్టయినపుడు రాయవెల్లూరు జైలుకు పంపగా అక్కడ ఆమెను ఎ క్లాసు జైలులో ఉంచారు. ఆమె సి క్లాసు రాజకీయ బాధితులకు ఆహారపదార్థాలను అందించారని అలజడి ఉండనే ఉంది.

ఉన్నవ లక్ష్మీబాయమ్మ పాల్గొనని జాతీయ ఉద్యమాలు లేవు. ఆమె ఉపన్యసించని, ప్రబోధం చేయని స్త్రీల సమస్యలు లేవు. ఎక్కడ ఏ సంస్కరణ అవసరమైనా సాంఘిక మార్పు రావల్సినా ఆమె పాత్ర ఉండనే ఉంది. గుంటూరు పురపాలకసంఘ సభ్యురాలిగా కాంగ్రెసు పక్షానికే ప్రతిభ చేకూర్చారు. మహాత్మాగాంధీజీ శారదా నికేతనానికి వచ్చినపుడు వారి ఉద్బోధలను తు.చ. తప్పక అమలు పరచిన వ్యక్తి లక్ష్మీబాయమ్మ.

ఎన్ని ఇబ్బందులు ఎదురైనా సంస్థయే ఆమెకు ప్రాణం. విద్యార్థినులు ఆమెకు బిడ్డలకన్నా ఎక్కువ. వసుధైక కుటుంబంలో మాతృమూర్తిగా దేశసేవికగా, సంఘ సంస్కారిణిగా గౌరవింపబడ్డ వ్యక్తి ఉన్నవ లక్ష్మీబాయమ్మ. స్త్రీలు ఒకరిమీద ఆధారపడకుండా స్వతంత్రంగా బ్రతకాలని లక్ష్మీబాయమ్మ ఆశించేవారు. ఈమె గృహలక్ష్మి, స్వర్ణకంకణ గ్రహీత అయినప్పటికీ జాతీయ ఉద్యమ కాలంలో స్వర్ణకంకణాన్ని ధరించనని ప్రతినబూనినందున ఆమె దాన్ని ధరించలేదు. అనారోగ్య పరిస్థితిలోఉన్నా శాంతినికేతన్ రజతోత్సవాన్ని వీక్షించగల్గానని ఆనందపడ్డారు. 1952లో తన 70వ యేట పరమపదించారు. అంతటి కీర్తి గడించిన ఉన్నవ లక్ష్మీబాయమ్మను ఆంధ్ర జాతి ఏనాటికి మరువలేదు. అందుకే శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ రాసిన 'వీర నారి ఉన్నవ లక్ష్మీబాయమ్మ' అనే బుర్రకథ ఆంధ్ర దేశంలో నేటికి ప్రచారంలో ఉంది. అందులో :

"బీడు వారిన స్త్రీల బ్రతుకుకు గోడు ఉడిగినాది
వాడిపోయిన యశోవల్లికి వన్నె హెచ్చినాది
అలమి యుండిన అంధకారము అంతరించినాది
వెలుగు రేఖలు స్త్రీల మోముపై వీరనారి గాథ".

గుంటూరు జిల్లాలో పుట్టిన ఉన్నవ లక్ష్మీబాయమ్మ.

"అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ" అన్న మాటను సార్థకం చేసింది. ఏకైక దీక్షతో ఆంధ్ర మహిళల ఉన్నతికి అఖండ కృషి చేసి వీరనారి అనిపించుకొన్న వ్యక్తియే ఉన్నవ లక్ష్మీబాయమ్మ.



# పరసువేది

-గోపాలుని అమ్మాజీ





"సీతమ్మ కోడలు చేస్తున్న పని నాకేం నచ్చల్లేదు. (నోరునొక్కుకుంటూ) అవ్వ! మరీ యింత విడ్డూరం ఏనాడైనా కనీవినీ ఎరుగుదుమా? రేపట్నుంచి అందరూ ఛీ కొడుతుంటే అప్పుడు తెలుస్తుంది. ఆ పిల్లకి, తను ఎంత పెద్ద తప్పు చేసిందో." కళ్ళు, చేతులు తిప్పేస్తూ అంది శేషారత్నం.

'అవును వదినా! నాకూ అంతే అనిపిస్తోంది. ఇంతకీ ఆ పిల్ల అట్లా ఎందుకు చేసిందో. ఒక వేళ ఆపిల్లకీ, మొగుడికీ మధ్య ఏవైనా గొడవలుండేవేమో!" దీర్ఘాలు తీస్తూ మరీ అనుమానం వ్యక్తం చేసింది తాయారు.

"మొగుడు పెళ్ళాలన్నాక గొడవలు ఉంటూనే ఉంటాయి. అంతమాత్రాన మరీ ఇంతగా తెగిస్తుందా? ఒక్కమాట చెప్పు. మన యిళ్ళల్లో మాత్రం మనకి మొగుళ్ళతో చిన్నవో, పెద్దవో గొడవలు రావటం లేదూ? అయినా ఆడదానికి ఒకసారి మెళ్ళో పసుపు తాడంటూ వడ్డాక అన్నిటికీ సర్దుకుపోవటానికి అలవాలు పడాలే గానీ మనంతట మనమే నిర్ణయాలు తీసుకుని మరీ ఇంతగా బరితెగించటం అంత మంచిది కాదు. ఈ రోజు కాకపోయినా రేపయినా ఊళ్ళో వాళ్ళు వూరుకుంటారా? గట్టిగా నాలుగు చివాట్లు పెట్టి జరగాల్సిన తతంగం ఏదో జరిపే తీరుతారు" కచ్చగా, నిక్కచ్చిగా చెప్పింది శేషారత్నం.

"నిజమే వదినా! జరిపించకపోతే ఎలా చెప్పు. తెల్లారిన దగ్గర్నుంచి అందరం ఒకేచోట తిరగాల్సిన వాళ్ళం. మనకైనా మంచి-చెడు, శుభం-అశుభం అంటూ వుంటాయి కదా! పైగా పిల్లా జెల్లా ఉన్న కుటుంబాలు. ఏ రోజు పడితే ఆ రోజు ఆ పిల్ల మనకి ఎదురుపడితే జరగరానిదేమన్నా జరిగిందే అనుకో, ఏమనుకున్నా ప్రయోజనం ఉండదు. అందుకే కదా మన పెద్ద వాళ్ళు ఎంతో ఆలోచనతో ఇలాంటి ఆచారాలు పెట్టింది. పోయిన వాడెలాగూ పోయాడు. ఇదంతా తన ఖర్మ అని సరిపెట్టుకొని జరగాల్సిన తంతు జరిపించేసి వుంటే ఆ పిల్లకీ, మనకీ కూడా ఎంతో మర్యాదగా ఉండేది. కానీ ఆ పిల్ల ఈ రకంగా ఎదురు తిరగటం, భీష్మించుకుని కూర్చోవటం. అబ్బే! చాలా విడ్డూరంగా ఉంది." కడుపులో విషాన్నంతా ఒక్కసారిగా కక్కేసింది తాయారు.

పెరట్లో వాళ్ళ సంభాషణంతా గదిలో పడుకొని వున్న సృజనకి చాలా స్పష్టంగానే వినబడుతోంది. వాళ్ళ మాటలు వింటుంటే చిన్నతనంలో పెరట్లోని బాదం చెట్టు మీద నుంచి వినిపించే కాకుల అరుపులు గుర్తొచ్చాయి సృజనకి. ఆ ఆలోచన రాగానే ఆమె పెదవుల మీద చిరునవ్వు చోటు చేసుకుంది.

సృజన భర్త రవీంద్ర చనిపోయి పది రోజులు దాటింది. ఈ పదిరోజుల్నించి సృజన ప్రవర్తన, ఆమె చేసే పనులు అందరికీ ఎంతో వింతగా అనిపిస్తున్నాయి. వాళ్ళందరి భాషలో చెప్పాలంటే పాపం ఎవరికీ అంతుపట్టటం లేదు.

రవీంద్ర చనిపోయిన రోజునుంచి సృజన మౌనవ్రతం పట్టిన దానిలా ఎవ్వరితోనూ పెదవి విప్పి ఒక్కమాట కూడా మాట్లాటంలేదు. అప్పుడప్పుడూ మౌనంగా రోదించేది. మొదటి రెండు రోజులు ఆమెచేత అన్నం తినిపించటం, నీళ్ళు తాగించటం కూడా చాలా కష్టం అయింది అక్కడి వాళ్ళందరికి.

మూడో రోజు నుంచీ సృజనలో చిత్రమైన మార్పు వచ్చింది. ఆమె ఎప్పటిలాగానే తన పనులన్నీ తానే చేసుకుపోతోంది. అందరితో కలిసే టిఫిన్ తినటం, భోజనం చేయటం, పిల్లల పనులు చేసుకోవటం చేస్తోంది. మిగిలిన టైం అంతా గదిలో మంచం మీద పడుకొని వుంటోంది. ఆమె అలా అందరితో కలసి యిల్లంతా తిరిగేయటం ఎవరికీ నచ్చటం లేదు. ఒకరిద్దరు చూచాయగా ఆమెకి చెప్పారు కూడ. అయినా సృజన అవేమీ పట్టించుకోలేదు. అందుకే, ఆమె ప్రవర్తన గురించి ఎవరికి తోచినట్టు వాళ్ళు భాష్యం చెప్పుకుంటున్నారు పాపం!

అక్కడికి వచ్చిన బంధువుల్లో ప్రొఫెసర్ ఒకాయన వున్నారు. ఆయన సృజన తల్లిదండ్రులకి సలహా యిస్తున్నాడు. పాపం చిన్న వయసులోనే భర్త పోయాడు కదా! ఆమె బాగా షాక్ అయింది. బహుశ ఆమె మెంటల్ కండిషన్ సరిగ్గా లేదనిపిస్తోంది. ఎందుకైనా మంచిది ఒకసారి సైక్రియాటిస్టుకి చూపించండి" అని.

అది విన్న సృజనకి నవ్వు వచ్చింది. వీళ్ళకి మనిషి మెదడు గురించి తెలినంతగా మనిషి హృదయం గురించి తెలీకపోవటం ఎంత దురదృష్టమో' అనుకుంది.

ప్రస్తుతం ఈ విషయాన్ని ఇక్కడ ఒక్కసారి ఆపి, మనం గతంలోకి వెళ్లినట్టయితే...

సృజనకి, రవీంద్రకి పెళ్ళయి ఆరేళ్ళయింది. ఈ ఆరేళ్ళ కాలంలో రవీంద్ర సృజనని ఏనాడు ఒక మనిషిగా చూసింది లేదు. పెళ్లయిన కొత్తల్లో మాత్రం ఆమెకి తన వైవాహిక జీవతం ఒక అద్భుత స్వప్నంలా అనిపించింది. తర్వాత కొద్ది నెలలకే ఆమె ఆ స్వప్నం లోంచి మేల్కొంది. వాస్తవంలో బ్రతకటం మొదలుపెట్టిన సృజనకి రవీంద్ర అసలు రూపం కళ్ళకి స్పష్టంగానే కనిపించటం మొదలుపెట్టింది. 'వేయి అబద్ధాలు ఆడయినా ఒక పెళ్ళి చేయాలనే' సామెత సృజన విషయంలో నిజమే అయింది. పెళ్ళికి ముందు రవీంద్ర గురించి అతని తల్లిదండ్రులు, మధ్యవర్తులు చెప్పిన మాటలన్నీ అబద్ధాలే అని

కొద్ది రోజులకే అర్థం అయింది సృజనకి. అతనికి లేని దురలవాటంటూ లేదు. సిగరెట్ నుంచి స్త్రీ వ్యామోహం దాకా అన్నీ వున్నాయి.

ఇవన్నీ తనకి తెలిసే లోగానే డాక్టర్ తను గర్భవతినని, మూడోనెల అని చెప్పింది. ఏం చేయాలో తెలీని అయోమయ పరిస్థితిలో పడిపోయింది సృజన. ఆమె తన భర్తను గురించి, తన సంసారం గురించి తల్లిదండ్రులకి ఎన్నోసార్లు ఎన్నో రకాలుగా చెప్పి ఏడిచింది.ఆమె ఎంత చెప్పినా ఎన్ని సార్లు చెప్పినా అవతల్నించి వచ్చిన సమాధానం మాత్రం ఒక్కటే వుండేది. "నువ్వు ఆడపిల్లవి. ఒక్కసారి పెళ్ళి అయిన తర్వాత కష్టమైన, నష్టమైన నీ జీవితం నీ భర్తతోనే. నువ్వే ఓర్పుతో, సహనంతో అతన్ని మార్చుకోవాలి. అంతకు మించి మనమేమీ చేయలేం" అని.

సృజన మానసికంగా దానిక్కూడా సంసిద్ధురాలయింది. ఎలా అయినా రవీంద్రలో మార్పుతేవాలి అనుకుంది. అతనిలో మార్పు తేవటం కోసం, తన సంసారాన్ని ఆనందంగా తీర్చిదిద్దుకోవటం కోసం ఆమె చేయని ప్రయత్నం అంటూ లేదు. ఆ ప్రయత్నంలోనే ఆరేళ్ళు గిర్రున తిరిగిపోయాయి. సృజన తన ప్రమేయం లేకుండా ఇద్దరు పిల్లలకి తల్లి అయింది. కానీ రవీంద్రలో మాత్రం ఎలాంటి మార్పు రాలేదు.

రవీంద్ర మారకపోవటానికి కొంత కారణం అతని తల్లి, అక్క అని కూడా చెప్పాలి. రవీంద్ర తప్పు చేస్తున్నప్పుడల్లా సృజన అడ్డుపడి, వద్దని ఎంతగానో వారించేది. కానీ అతనితోపాటు అత్త, ఆడపడుచు కూడా ఆమెతో ఘర్షణకి దిగేవాళ్ళు. అయినా ఆమె ఒంటరి పోరాటం సాగిస్తూనే ఉండేది. రవీంద్ర మాత్రం సృజన మీద పట్టుదలతో, తన మూర్ఖత్వంతో ఇంకా దిగజారిపోయాడు. దానికి పర్యవసానంగా అతని ఆరోగ్యం క్షీణించసాగింది. సృజన ఎన్నోసార్లు అతన్ని డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళాలని ప్రయత్నించింది. ఆ విషయంలో కూడా అతను ఆమెకి ఎదురుతిరిగేవాడు. భార్యకి వున్న ఓర్పు, సహనం, ప్రేమ మృత్యువుకి లేకపోయింది. అందుకే అతన్ని అమాంతం కబళించి వేసింది.

రవీంద్ర చనిపోయాడన్న విషయం తెలిసి అక్కడికి వచ్చిన ప్రతి ఒక్కరు సృజన మీద ఎంతో సానుభూతి కురిపించి పోతున్నారు.

పెళ్ళయిన దగ్గర్నుంచి అసలు వాడికి మనశ్శాంతే లేకుండా పోయిందని వచ్చిన వాళ్ళందరి దగ్గరా వాపోతున్నారు అత్త, ఆడపడుచు.

ఇప్పుడు ఆమెనీ, పిల్లల్ని తీసుకొచ్చి తమ నెత్తిన ఎక్కడ పడేస్తారో అని భయపడుతున్నారు పుట్టింటివాళ్ళు.

చిన్న వయస్సులోనే ఐదోతనాన్ని పోగొట్టుకుందని విలపిస్తోంది సృజన తల్లి.

మనం తిరిగిమళ్ళీ వాస్తవంలోకి వస్తే-

రవీంద్ర చనిపోయిన పదోరోజు సాయంత్రం కొందరు ముత్తైదువలు సృజన గదిలోకి వచ్చారు. వాళ్ళు తనతో ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడటానికే వచ్చారని అర్థం అయింది సృజనకి. మౌనంగానే లేచి కూర్చుంది. వాళ్ళు చిన్నగా విషయం మొదలుపెట్టారు. "దేముడు నీకెంతో అన్యాయం చేశాడు. చిన్న వయస్సులోనే భర్త పోవడం అనేది దురదృష్టమే. కానీ ఏం చేస్తాం తల్లీ! విధికి తలవంచాల్సిందే కదా! రేపు ఉదయం చీకటితోనే నువ్వు మెడలో సూత్రాలు, గాజులు, బొట్టు అన్నీ తీసేయాలి. అది మన ఆచారం. ఇక రేపట్నుంచి నువ్వు వైధవ్యం అనుభవించాల్సిందే". కొంచెం సంకోచిస్తూనే విషయం చెప్పారు. అక్కడికి వచ్చిన వాళ్ళల్లో సృజన అత్త, ఆడపడుచు కూడా ఉన్నారు.

సృజన ఒక్క నిమిషం కళ్ళు మూసుకుంది. ఈ క్షణం కోసమే తను ఈ పదిరోజుల్నుంచి ఎదురు చూస్తోంది. అన్నేళ్ళ తన గుండెకోతకీ, తను అనుభవించిన నరకానికీ ప్రతీకారం తీర్చుకోబోతున్న సమయం రానేవచ్చింది. తను అనుకున్నది సాధించి తీరాలి అనుకుంది దృఢంగా. కళ్ళు తెరిచి అత్తగారి వంక చూస్తూ అడిగింది. "నేనెందుకు వైధవ్యం అనుభవించాలి" అని.

అంతే! ఆ ప్రశ్నకి అక్కడున్న వాళ్ళంతా ఒక్కసారిగా అదిరిపడ్డారు. నిజంగానే సృజనకి పిచ్చెక్కింది అనుకున్నారు.

కొద్ది నిమిషాల తర్వాత వాళ్ళల్లో ఒకామె కొంచెం తేరుకుని చెప్పింది. "అదేంటి! తల్లీ నీ భర్త చనిపోతే నీకు వైధవ్యం రాకుండా ఎలా వుంటుంది?" అని.

నేనడిగింది ఆమెని. మిమ్మల్ని కాదు. సమాధానం చెప్పాల్సింది ఆవిడే" అంది సృజన అత్తగార్ని చూపిస్తూ.

ఇంక సృజన అత్తగార్కి నోరువిప్పక తప్పలేదు. "ఏమిటే ఆ పిచ్చివాగుడు. చచ్చిపోయింది. నీ మొగుడు. ఆ మాత్రం కూడా తెలీటం లేదా నీకు? మొగుడు చనిపోతే పెళ్ళాం వైధవ్యం అనుభవించక ఏం చేస్తుంది?" అత్తగారి లాగానే అడిగింది ఆమె.

**"నేను ఆయన పెళ్ళాన్ని అనే విషయం ఎప్పుడు తెలిసింది మీకు?" మళ్ళీ అడిగింది సృజన.**

**"కొత్తగా తెలిసేదేముంది. వాణ్ణి నువ్వు పెళ్ళి చేసుకున్నప్పుడే వాడి పెళ్ళానివయ్యావు.".**

ఆ మాటలు విని పెద్దగా నవ్వింది సృజన. "ఇది చాలా విచిత్రంగా ఉందే. ఈ విషయం మీకు మీ అబ్బాయి చచ్చిపోగానే గుర్తొచ్చిందన్న మాట. నేను నా భర్తని వ్యసనాల్నించి తప్పించి ఒక మనిషిగా మార్చటానికి ప్రయత్నించినప్పుడల్లా మీరందరూ నన్నేమని అడిగేవారు? 'నువ్వవరివి? నీకేం సంబంధం మా విషయాల్లో తలదూర్చటానికి' అని పదే పదే హెచ్చరించేవారు. అప్పుడు 'నువ్వెవరు? నీకేం సంబంధం' అని అడిగిన మీకు మీ అబ్బాయి పోగానే అకస్మాత్తుగా నాకు అతనితో ఉన్న బాంధవ్యం గుర్తొచ్చిందా?

వ్యసనాలు ముదిరిపోయి, ఆరోగ్యం క్షిణిస్తుంటే డాక్టర్ దగ్గరికి రమ్మని, ఆ ఛండాలపు అలవాట్ల నుంచి బయటపడమని కొన్ని వందల సార్లు కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమిలాడాను. అప్పుడు కూడా 'నువ్వెవరు? నాకు చెప్పటానికి, నా విషయంలో కల్పించుకునే అధికారం నీకేముంది? అని ప్రశ్నించారు. అలా ప్రతి విషయంలోను నువ్వెవరు నీకేం సంబంధం అని అడుగుతుంటే నా గుండెల్లో ఎంత బాధ కలిగేదో తెలుసా? కేవలం పగలు వండి పెట్టటానికి, రాత్రిళ్ళు సుఖానివ్వటానికే నేను పరిమితమైపోయాను. అంతే గానీ ఏనాడైనా అతనితో ఆనందాన్ని, సంతోషాన్ని పంచుకోగల్గానా? సహనం ఈ రోజు నాకు మిగిల్చింది ఏమిటి?

అతని వల్ల సుఖం, సంతోషం, ఆనందం చివరకి మనశ్శాంతి కూడా నేను ఏనాడు పొందలేదు. అలాంటిది ఈ రోజు ఈ వైదవ్యాన్ని మాత్రం ఎందుకు పొందాలి? మీరు కూడా నన్ను ఎప్పుడూ 'నువ్వెవరు? నీకేం సంబంధం' అని అడిగేవారు కదా! ఇప్పుడు అదే ప్రశ్న ఇక్కడ వున్న వీళ్ళందర్ని కూడా అడగండి. 'నా కొడుకుచనిపోతే వైధవ్యం పొందటానికి ఆమెవరు? ఈమెకేంటి సంబంధం' అని.

బ్రతికున్నప్పుడు ఎలాగూ నా జీవితాన్ని అతనే శాశించాడు.

కానీ ఇప్పుడు అతని చావు కూడా నన్ను శాశిస్తుందంటే నేను ఒప్పుకోలేను, కనీసం యిప్పటికైనా నేను బంధవిముక్తురాల్ని అవుదామనుకుంటున్నాను. అతనితో ఆరేళ్ళపాటు అనుభవించిన నరకం చాలు నాకు. దాన్ని జీవితాంతం భరించే మనసు గానీ, సహనంగానీ యింక నాకు లేవు. ఇప్పుడు కనుక నేను వైధవ్యాన్ని స్వీకరిస్తే బ్రతికినన్నాళ్ళు అతనితో బంధాన్ని ముడివేసుకున్నట్లే అవుతుంది. అందుకే నేను వైధవ్యాన్ని పొందటానికి ఎంత మాత్రం సంసిద్ధంగా లేను దయచేసి మీరంతా ఇక్కడి నుంచి వెళ్ళిపోవచ్చు. మళ్ళీ ఎప్పుడూ నా దగ్గర ఈ విషయాన్ని ప్రస్తావించకండి." చెప్పదలచుకున్న విషయాన్ని చాలా సూటిగా, స్పష్టంగా చెప్పింది. ఇప్పుడు ఆమె మనసు ఎంతో తేలికపడింది.

ఆరోజు రాత్రి సృజనకి నిద్రపట్టడం లేదు. సాయంత్రం జరిగిన సంభాషణంతా మళ్ళీ గుర్తుకొచ్చింది. దాంతోపాటు శేషారత్నం, తాయారమ్మల మాటలు కూడా గుర్తొచ్చాయి. చిన్నగా నవ్వుకుంది సృజన. 'పాపం పిచ్చివాళ్ళు' అనుకుంది జాలిగా. తను తీసుకున్న నిర్ణయంతో ఎలాంటి పొరపాటు లేదని మరొకసారి దృఢంగా అనుకుంది. తన భవిష్యత్తు, పిల్లల భవిష్యత్తు గురించి ఈ పదిరోజులు దీర్ఘంగా ఆలోచిస్తూనే ఉంది. ఇప్పుడు ఒక స్పష్టమైన నిర్ణయానిక్కూడా వచ్చింది. తెల్లవారగానే తను ఈ యింటిని, ఈ చీకటి బ్రతుకును వదిలివెళ్ళిపోతోంది.

**'ఇప్పుడు తను స్వేచ్ఛా జీవి'.**

ఈ ఆలోచన రాగానే సృజనకి నవ్వు వచ్చింది. మనిషి మనసు ఎంతో చిత్రమైంది అనుకుంది. ఇదే కనక తన భర్త తనకి తోడు నీడగావుంది, మానసికంగా తనతో బంధం పెంచుకొని వుంటే ఇదే స్వేచ్ఛని'ఒంటరి బ్రతుకు ' అనుకుని కుమిలిపోయి ఉండేది. తనకి బ్రతుకంతా అంధకారంలా అనిపించేది. మనసుకి వైరాగ్యం ఆవరించేది. సమాజం కోసం, సాంప్రదాయాల కోసం అనుభవించే వైధవ్యం కన్నా, మానసిక వైరాగ్యంలో ఎంతో స్వచ్ఛత వుందనిపించింది సృజనకి ఆక్షణంలో. 'ఇది స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తుంది.' అనుకుంది. దాన్నే నిజమైన బంధం అంటారు. సృజనకి మరో ఆలోచన కూడా వచ్చింది. 'వైధవ్యం అనేది స్త్రీలకి మాత్రమే ఎందుకు ఉంది? పురుషులకి ఎందుకు వర్తించదు? ఒకవేళ పురుషుల విషయంలో కూడా ఎలాంటి నియమాలువున్నా వాటిని ప్రపంచానికి తెలియనీయకుండా ఈ సమాజమే వాటిని భూస్థాపితం చేసి ఉంటుంది అనుకుంది మనసులో.

ఆలోచనల్లో మునిగిపోయిన సృజనకి అకస్మాత్తుగా తన మెడలోని సూత్రాలు గుర్తుకువచ్చాయి. అవి ఆమె గుండెల మీద బరువుగా వ్రేలాడుతున్నాయి. ఆరేళ్ళుగా ఆమె ఆ బరువుని మోస్తోంది. కానీ ఈ రోజు నుంచి వాటిని మోయాల్సిన అవసరం లేదనిపించింది. సూత్రపు గొలుసు తీసి చేతిలో పట్టుకుంది. వాటిని ఏం చేయాలో అర్థం కాలేదు. ఇప్పుడు తను వున్న పరిస్థితుల్లో తనకి డబ్బు చాలా అవసరం. ఆ ఆలోచన రాగానే చేతిలో వున్న గొలుసుని రెండుసార్లు పైకి,కిందికి వూపి చూసింది. చాలా బరువుగానే వుంది. మొదటిసారిగా సృజనకి తన సూత్రాల విలువ తెలిసింది. 'ఇన్నేళ్ళకు అవి తన జీవితానికి నిజంగా ఉపయోగపడుతున్నాయి' అనుకుంది.

సృజన బీరువాలోంచి తనవి, పిల్లలవి అనుకున్న వస్తువులన్నీ చక చకా సర్దేసుకుంది. 'ఈ రాత్రితో తనకీ యింటితో సంబంధం పూర్తిగా తెగిపోతుంది. ఇంక ఈ జన్మలో తను ఈ ఇంటి గడప తొక్కద్దు' అనుకుంది.

అన్నీ సర్దుకోవడం పూర్తయాక వెళ్ళి మంచం మీద కూర్చుంది. అప్పుడు ఆమె దృష్టి ప్రక్కనే పడుకుని ఉన్న ఐదేళ్ళ కొడుకు సుధీర్, మూడేళ్ళ కూతురు సుమన ల మీద పడింది. ఇద్దరూ గాఢ నిద్రలో ఉన్నారు. వాళ్ళ ముఖాల్లో పసితనపు అమాయకత్వం ఉంది. 'వీళ్ళిద్దర్ని తను పెంచి పెద్దవాళ్ళని చేసి, ఎంతో ప్రయోజకుల్ని చేయాలి' అనుకుంది.

అప్పటికే అర్ధరాత్రి కావటంతో మంచం మీద వాలిన సృజనకి క్షణాల్లో నిద్రపట్టేసింది. ఆ నిద్రలో ఆమెకొక చిత్రమైన కల వచ్చింది.

సుధీర్ ఒక రాచరికపు సింహాసనం మీద కాలు మీద కాలేసుకుని ఎంతో హుందాగా, అధికారికంగా కూర్చుని ఉన్నాడు. అతని తల మీద బంగారపు కిరీటం ఉంది. అతనికి కొద్ది దూరంలోనే సుమన నిలబడి ఉంది. ఆమె తల మీద కూడా కిరీటం పెట్టబడి ఉంది. ఇద్దరి కిరీటాల మీద ఏవో అక్షరాలు కూర్చబడి వున్నాయి. సృజన వాళ్ళకి కొద్దిగా దూరంగా ఉండటం వల్ల అవి ఆమెకి స్పష్టంగా కనిపించటం లేదు. వాటిని చదవటం కోసం సృజన పిల్లలకి దగ్గరగా వెళ్ళింది. ఇప్పుడు ఆమెకి ఆ అక్షరాలు ఎంతో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

సుధీర్ తల మీద ఉన్న బంగారు కిరీటానికి ముందు భాగంలో మూడు అక్షరాలు ఎంతో అందంగా ముత్యాలతో పొదగబడి ఉన్నాయి. 'స్వైరత' అని.

సుమన తల మీద ఉన్న కిరీటం మీద మాత్రం ఎంతో విలువైన వజ్రాలతో, ఐదు వాక్యాలు లిఖించబడిఉన్నాయి.

**'కార్యేషు మంత్రి**
**కరణేషు దాసి**
**భోజ్యేషు మాత**
**శయనేషు రంభ**
**క్షమయా ధరిత్రి'** అని.

అన్ని వజ్రాలు పొదగడం వల్ల కిరీటం ఎంతో బరువుగా ఉంది. ఆ బరువంతా పంటి బిగువున భరిస్తోంది సుమన. అది చూసిన సృజనకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. పిల్లల్దిరినీ దగ్గరకు పిలిచి, వాళ్ళ తలల మీదున్న కిరీటాన్ని తీసేయబోయింది. వానీ పిల్లలిద్దరూ ఒక్కసారిగా "వద్దు మమ్మీ! ప్లీజ్ వాటిని ఉండనీయి. బాగున్నాయి." అన్నారు జాలిగా ముఖాలు పెట్టి. వాళ్ల అమాయకత్వానికి జాలేసింది. సృజనకి. 'ఆ రెండు కిరీటాలు ఎంత ప్రమాదమైనవో, అవి వాళ్ళ జీవితాన్ని ఎంత విచ్ఛిన్నం చేస్తాయో పాపం వాళ్ళకి తెలీదు కదా!' అనుకుంది మనసులో...

సృజన పిల్లలిద్దరినీ దగ్గరికి తీసుకుని ఎంతో ప్రేమగా, లాలనగా చెప్పింది. " ఈకిరీటాలు మీ కొద్దు. తీసేయండి. మీ యిద్దరికీ రెండూ అందంగా, ఒకేలాగా వుంటాయి." అంటూ ముద్దు పెట్టుకుంది. వెంటనే పిల్లలిద్దరూ కిరీటాలు తీసి క్రింద పడేశారు.

సృజనకి వెంటనే మెలకువ వచ్చింది. పిల్లల దగ్గరికి వెళ్ళి వాళ్ళ తలపైన చేత్తో నిమురుతూ అనుకుంది. 'అవును మీ యిద్దరికీ అందమైన జీవితాన్ని యిస్తాను' అని. ఆ క్షణం ఆమె మనసు ఎంతో తృప్తితో నిండిపోయింది.

స్వైరవి: యధేచ్ఛగా సంచరించ గల స్వేచ్ఛా, స్వాతంత్రాలు కలిగినవాడు.

పరసువేది: ఇనుముని సైతం బంగారంగా మార్చగల విద్య, ఆ విద్యను నేర్చిన వాడు. రెండింటికీ అదే మాట వర్తిస్తుంది.

✶

# అమ్మ చెప్పిన అబద్ధాలు

- మాడభూషి శ్రీధర్



**మా** అమ్మ అబద్ధాలు చెప్పింది కనీసం ఏడు

1. పుట్టెడు పేదరికంలో పుట్టిన కొడుక్కు తల్లి అన్నం పెడుతున్నది. తనకు ఏమీ మిగిల్చుకోకుండా అన్నం తీసి కొడుకు కంచంలో పెడుతుంటే అడిగాను.
'అమ్మా మరి నీకు' అని
'నీవు తిను నాన్నా.......నాకు ఆకలి లేదు.......అది తొలి అబద్ధం.

2. అమ్మకూ నాకూ ఒకేసారి జ్వరం వచ్చింది. మందుల ధాటి తట్టుకోవడానికి సేపులు, బత్తాయిలు తినాలని డాక్టర్ చెప్పారు. అమ్మ అన్ని బత్తాయిలు ఒలిచి నాకే పెడుతున్నది.
అమ్మా నువ్వూ ఒక బత్తాయి తినమ్మా.....అంటే
నాకు బత్తాయిలు ఇష్టం లేదు కన్నా' అని చెప్పింది రెండో అబద్ధం

3. ఇద్దరూ బీడీలు చుడితే తప్ప జీవితం సాగని స్థితి. కొడుకు చదవాలంటే బీడీ పని ఆగక తప్పదు. తల్లి ఎక్కువ బీడీలు చేయాల్సిందే. రాత్రి ఎందుకో మెలకువ వచ్చింది. అమ్మ ఇంకా పని చేస్తున్నది.
'మళ్లీ రేపు కూడా పనికి వెళ్లాలి కదమ్మా. త్వరగా పడుకోమ్మా' అన్నాను.
'నేనేమీ అలసిపోలేదురా.....' అమ్మ ఆడిన మూడో అబద్ధం అది.

4. తను పరీక్షలు రాస్తున్నాడు. ఏప్రిల్ ఎండలు మండిపోతున్నాయి. అమ్మ పరీక్షలపుడు నా వెంట ఉండితీరాలని వ్రతం పెట్టుకున్నది. పరీక్ష ముగిసి గంట కొట్టగానే బయటకు పరుగెత్తాను. అమ్మ ఎంతసేపటి నుంచి ఎండలో ఎదురు చూస్తున్నదో. నా దగ్గరికి వచ్చేసింది. సీసాలో దాచిన మజ్జిగ నాకు తాగించింది. మధ్యలో ఆగి అడిగాను...
'అమ్మా నువ్వూ తాగు'...అని.....
'నాకు దాహం లేదురా'అంది. నాలుగో అబద్ధం.

5. నాకు ఉద్యోగం వచ్చింది. పొరుగు పట్టణంలో. అమ్మ రాలేదు. తన పని తానే చేసుకునేది. తనకు కావలసిన డబ్బు తానే సంపాదించుకునేది. పొద్దున్నే కూరగాయలు అమ్మి. డబ్బు పంపితే తిప్పి పంపుతూ. 'నాకు డబ్బు అక్కర్లేదురా.......' అని రాసింది. అయిదో అబద్ధం.

6. గ్రాడ్యుయేషన్‌తో సరిపెట్టుకోకుండా ఇంకా చదివాను. అమెరికా వెళ్లాను. డాలర్లు సంపాదిస్తున్నాను. అన్నన్ని కష్టాలు పడ్డ అమ్మకు అమెరికాలో అన్ని సౌఖ్యాలు అందించాలని అక్కడికి రమ్మన్నాను.
'నాకవన్నీ అలవాటు లేదురా, అవేవీ సరిపడవురా...' అంది. ఆరో అబద్ధం.

7. అమ్మకు జబ్బు చేసిందని స్నేహితుడు రాస్తే అమెరికా నుంచి వచ్చేసాను. మంచం మీద పడి ఉంది అమ్మ. క్యాన్సర్ అంటున్నారు డాక్టర్లు. అంటే ఎంత బాధ ఉంటుందో కదా? శరీరం కృశించింది. నాకు కన్నీళ్లు ఆగలేదు. చెంపలు తడిసిపోతున్నాయి. అమ్మ చూడలేకపోయింది.
ఏడవకురా తండ్రీ... నాకే బాధా లేదు......' అమ్మ ఏడో అబద్ధం ఆడింది. అంతలోనే కన్ను మూసింది.

బ్రహ్మ లేకపోతే సృష్టి ఉంటుందో లేదో నాకు తెలియదు. కాని అమ్మ లేకపోతే నేను లేను. భగవంతుడు అన్ని చోట్లకూ తానే వెళ్లలేక అమ్మను సృష్టించి పంపాడంటారు. ఆ అమ్మకు అనుక్షణం జోహార్లు, అహరహం నివాళులు.

- (చినుకు సౌజన్యంతో)

# నీరు సరుకు కాదు - హక్కు

## ఐద్వా 8వ జాతీయ మహాసభలలో చర్చించిన కమీషన్ పేపర్



"జీవితానికి సర్వస్వం నీరే - నీరు లేనిదే జీవితం లేదు."

నీటిని పొందడం ప్రతి మనిషి ప్రాథమిక హక్కు. ఐక్య రాజ్య సమితి పర్యావరణ పథకము 2003 సంవత్సరానికి అంతర్జాతీయ నీటి సంవత్సరముగా ప్రకటించింది. "అందరికీ నీరు" అన్నది దాని నినాదము. 2015 సం॥నాటికి సురక్షిత మంచి నీరు అందని వారి శాతాన్ని సగానికి తగ్గించాలని 2002 సం॥లో జోహన్స్‌బర్గ్‌లో ఐక్యరాజ్యసమితి ప్రకటించింది. ప్రస్తుతం 2007 సం॥ కానీ ఆ పథకము యొక్క పురోభివృద్ధి ఆశాజనకంగా లేదు.

2010నాటికి సుమారు 250 కోట్ల జనాభాకు సురక్షిత త్రాగే నీరు అందుబాటులో వుండదని ఆందోళన చెందుతున్నారు. భారతదేశము, పాకిస్తాన్ మరియు దక్షిణాసియాలోని ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలు నీటి వనరులు క్షీణించడం, జనాభా పెరుగుదల, నీటి వనరుల వినియోగానికి మరియు అభివృద్ధికి సరియైన ప్రణాళికలు లేకపోవడం, అనే సమస్యలను ఎదుర్కొంటున్నాయి. ధరలేని మరియు పునరుద్ధరించలేని వనరు "నీరు"కు వున్న గిరాకీ దృష్ట్యా ఈ దేశాలలో ప్రైవేటు వ్యక్తులు పెట్టుబడులు పెట్టేందుకు అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి.

నీటి తలసరి వినియోగాన్ని బట్టి 147 దేశాలలో భారతదేశం 100వ స్థానంలో ఉంది. 1951 నుండి భారతదేశములో నీటి లభ్యత క్రమంగా తగ్గుతున్నది. సురక్షిత నీటి లభ్యత 1700 క్యూబిక్ మీటర్ల కన్నా తక్కువ వున్నట్లయితే ఆ దేశం తీవ్ర నీటి సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నట్లు. ఇది చాలా ఆందోళనకర పరిస్థితి. కఠిన చర్యలు తీసుకోవలసిన అవసరం ఉంది. ఇక్కడ మనం గమనించాల్సిన ఒక సంగతి ఏమిటంటే అమెరికా సామ్రాజ్యవాదం తన జనాభాతో సంబంధం లేకుండా వనరులను పెద్ద మొత్తంలో వినియోగించుకుంటుంది. మిగతా ప్రపంచ జనాభా గురించి ఏ మాత్రం ఆలోచించదు. ఉదాహరణకు వాతావరణ మార్పులపై క్యూటో ఒప్పందాన్ని అది అంగీకరించలేదు.

### బహుళజాతీ సంస్థల పాత్ర మరియు గాట్స్:-

నీటి రంగాన్ని ప్రైవేటు పరం చేయటానికి ప్రపంచ బ్యాంకు ఆతృతగా వున్నది. వివిధ అంశాలకు సంబంధించి దాని సూచనలు: 1. నీటి యాజమాన్యానికి సంబంధించిన అన్ని స్టేజీలను (దశలను) వాణిజ్యపరం చేయడం. 2. ప్రైవేటు పెట్టుబడులను ప్రోత్సహించడం, 3. నీటి ధరను పెంచడం 4. జల విద్యుత్‌చ్ఛక్తి మరియు నీటి పారుదల పరిధిని పెంచడం. 5. నీటికి మార్కెట్‌ను సృష్టించడం.

సుమారు 50 కోట్ల జనాభాకు బహుళజాతిసంస్థలు నీటి సేవను అందజేయడం ద్వారా అత్యధిక ఆదాయాన్ని పొందుతున్నాయి. అట్లాంటా, బెర్లిన్, కాసాబ్లాన్కా, ఒన్‌టారియో, సాన్ ఫ్రాన్సిస్‌కో లాంటి పెద్ద పట్టణాలలో నీటి సరఫరా యాజమాన్యాన్ని బహుళజాతి సంస్థలు నిర్వహిస్తున్నాయి. వాటి వ్యాపారం మెల్లగా విస్తరిస్తున్నది. 2016 నాటికి సుమారు 115 కోట్ల జనాభాకు ఈ సంస్థలు నీటిని సరఫరా చేయవచ్చు.

| బహుళ జాతి సంస్థ పేరు | అనుబంధ సంస్థ | దేశ యాజమాన్యం | 2001 నాటికి ఆదాయ (యు.ఎస్. కోట్ల డాలర్లలో) |
|---|---|---|---|
| వివేన్‌డి | వినిండి వాటరు | ఫ్రాన్స్ | 5170 |
| సూయిజ్ | ఒన్‌డియో | ఫ్రాన్స్ | 3720 |
| బాగ్గీస్ | సౌర్ | ఫ్రాన్స్ | 1790 |
| కెల్డా | యార్క్‌షైర్‌వాటర్ | బ్రిటన్ | 210 |
| ఆర్.డబ్ల్యు.ఇ. | థేమ్స్ | జర్మని | 5520 |

21వ శతాబ్దంలో యుద్ధాలు నీటి కోసం జరుగుతాయి అని అంటారు. బొలివియాలోని కొచమాంబలో నీటి కోసమే సివిల్ వార్ (అంతర్గత యుద్ధం) జరిగింది. కొచమాంబాలో నీటిని బలవంతంగా ప్రైవేటువారికి అప్పగించడంతో నీటి ధర 300 శాతం పెరిగి వేలాది మంది జీవితం దుర్భరమైంది. బెచెల్ అనే బహుళజాతి సంస్థ 40 సం॥లకు కాంట్రాక్టు పొందిన తరువాత వర్షపు నీరు వినియోగంపై కూడా పన్ను విధించాలనేంతవరకు వెళ్లింది. చివరకు ప్రజలు నీటి వనరులపై తమ హక్కును కాపాడుకునేందుకు ప్రభుత్వానికి మరియు బెచెల్ కంపెనీకి వ్యతిరేకంగా యుద్ధం చేయాల్సి వచ్చింది. ప్రజలు బెచెల్ వాటర్ కార్పొరేషన్‌ని దేశం నుంచి బయటకు గెంటివేయగలిగారు. దక్షిణాఫ్రికాలో సూయిజ్ మరియు నివాండి నీటి కార్పొరేషన్లకు నీటి వనరుల నియంత్రణను ఒప్పచెప్పడమైంది. ఫలితంగా ప్రీ పెయిడ్ నీటి కార్డుల రూపంలో నీటి వినియోగ చార్జీలు విపరీతంగా పెరిగాయి. పేద ప్రజలు సురక్షితంకాని నీటిని త్రాగవలసి వచ్చింది. దాని ఫలితంగా 40,000మంది మరణించారు. పబ్లిక్ సర్వీస్ ఇంటర్నేషనల్ అనే సంస్థ ఇంగ్లాండ్‌లో నీటి చార్జీలు 106శాతం

పెరిగాయిని, ఫలితంగా అనేక కుటుంబాల వారు నీటి కనెక్షన్‌ను తీయించేశారని నమోదు చేసింది. మన అవసరం వారి అత్యాస అన్నది మనం గ్రహించాలి. మనదేశము మరియు మన ప్రజలు ఈ పరిస్థితిని ఎదుర్కోవాలా?

మన దేశంలో సూయిజ్ సంస్థ ఢిల్లీ పక్కన నీటి శుద్ధి ప్లాంటును ఏర్పాటు చేసారు. ఈ ప్లాంటుకు నీటిని తెహ్రీ డాము నుండి సరఫరా చేస్తున్నారు. ఆ కారణగా షమారాన్‌పూర్, మీరట్, గజియాబాద్‌లో నివసిస్తున్న అత్యధిక ప్రజానీకం నీటిని పొందలేకపోతున్నారు.నెస్లే, కోకో కోలా మరియు పెప్సీ కంపెనీలు అనేక ప్రాంతాలలో మంచి నీటి మార్కెట్‌ను సాధించుకున్నాయి. కేరళలో కోకో కోలా కంపెనీ రోజుకి 10 లక్షల లీటర్ల నీటిని భూమి నుంచి వెలికితీస్తుంది. ఆంధ్ర ప్రదేశ్‌లో ఖమ్మం జిల్లాలో రోజుకి 2,25 లక్షల నీటిని వెలికి తీస్తున్నారు. తమిళనాడు శివగంగా జిల్లాలో నీటిని వెలికి తీయడానికి కోకో కోలా కంపెనీ ప్రయత్నించింది. కాని ప్రజలు మిలిటెంటుగా పోరాటం చేయడంతో వెనుదిరిగింది. ఆ పోరాటంలో ఐద్వా కూడా పాల్గొంది. తిరునల్‌వెళ్లి జిల్లాలో కోకో కోలా కంపెనీ సౌత్ ఇండియా బాట్లింగ్ కంపెనీతో ఒక అవగాహనకు వచ్చింది. ప్రపంచంలోనే శీతల పానీయాల రంగంలో కోక్ ప్రథమ స్థానంలో ఉన్నదని మనం మర్చిపోకూడదు. అమెరికాలో గత ప్రెసిడెంట్ ఎన్నికలలో జార్జ్ బుష్‌కు అత్యధిక డొనేషన్‌ను అందజేసింది. కోకో కోలాలో 80-85 శాతం వరకు నీరు ఉంటుంది. ఒక లీటరు కోక్‌ను తయారు చేయడానికి 5 లీటర్ల నీటిని వాడతారు. కనుక ఈ కంపెనీ ఎక్కడ తన ప్లాంటును ఏర్పాటు చేస్తే అక్కడ భూ గర్భ జలాలు తగ్గిపోతాయి. ఛత్తీస్‌ఘడ్‌లో షోయోనాథ్ నదిలో ఒక భాగాన్ని ప్రైవేటు వారికి అప్పగించారు. అయితే పోరాటాలు కొనసాగించడంతో 2002లో ప్రైవేటీకరణను విరమించుకున్నారు. ప్రభుత్వానికి నీటి పన్ను కట్టడం, ప్రైవేటు వారికి నీటి పన్ను కట్టడంతో సమానం కాదు. ఎందుకంటే ప్రభుత్వం వసూలు చేసిన పన్నును ఆ రాష్ట్రంలో లేదా దేశంలో వినియోగిస్తుంది. కాని బహుళజాతి సంస్థలు అభివృద్ధి చెందుతున్న దేశాల నుండి లాభాల రూపంలో ఆదాయాన్ని తీసుకుపోతాయి. ప్రభుత్వము మరియు ప్రజలు నీటి పంపిణీకి సంబంధించి స్వయం ప్రతిపత్తిని కోల్పోతారు.

ప్రస్తుత ప్రపంచములో నీరు హక్కుగా పరిగణించబడిన పరిస్థితి నుంచి వస్తువుగా మార్చబడింది. గ్యాట్ నీటిని వ్యాపార వస్తువుగా చేసింది కనుక ఈ విధంగా జరిగింది. భారత దేశం కూడా ఈ వర్గీకరణను అంగీకరించింది. గ్యాట్‌లోని నిబంధనలు నీటితో కలుపుకుని సహజవనరుల రంగంలో బహుళజాతి సంస్థలను ఎర్రతివాచి పరిచి ఆహ్వానిస్తున్నాయి. త్రాగడానికి కాని లేదా వ్యవసాయానికి కాని నీటిని ప్రభుత్వాలు ఖచ్చితంగా లేదా తక్కువ ఖరీదుకు సరఫరా చేయకూడదని బహిర్గతంగా గ్యాట్ చెప్తున్నది. దీనిని మహారాష్ట్ర కాంగ్రెస్ ఎన్‌సిపి ప్రభుత్వం విధేయతతో అమలు చేస్తున్నది. అందుకనే అక్కడ ప్రభుత్వం నీటి నియంత్రణా చట్టాన్ని ఆమోదించింది. ఆ చట్టం ప్రకారం పెట్టుబడిదారులు, అధికారులు మరియు నిపుణులతో కూడిన గ్రూపుకు నీటి వనరుల యాజమాన్య బాధ్యతను ప్రభుత్వం అప్పగించింది. నీటి తీరువా/పన్నును ఏడాదికి ఒక ఎకరానికి రూ॥8,000గా నిర్ణయించారు. ఇద్దరు పిల్లలు ఉన్న రైతు ఎకరానికి ఏడాదికి 12,000రూ॥లు నీటి తీరువా/పన్ను కట్టాలి.



భారతదేశము, పాకిస్తాన్, బంగ్లాదేశ్ మరియు శ్రీలంక వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో సురక్షితంకాని నీరు త్రాగడం వల్ల వచ్చే నష్టాలను ప్రచారం చేయడం కారణంగా ప్రజలు నీటిని లీటరు రూ॥10 నుంచి 200రూ॥ వరకు ఇచ్చి కొనుగోలు చేయడానికి సిద్ధపడుతున్నారు. ఐరోపాలో 56 అంశాలను పరిగణించి నీటి యొక్క నాణ్యతకు సర్టిఫికేట్ యిస్తారు. కాని భారతదేశంలో 16 అంశాలను మాత్రమే పరిగణిస్తున్నారు. మన జ్ఞాపకశక్తికి హాని కలిగించే రసాయనాలు లేదా కాన్సర్ కారక రసాయినాలు అన్ని బ్రాండ్ల నీళ్ళలోనూ వున్నాయని రిపోర్టులు తెలియజేస్తున్నాయి.

**జాతీయ నీటి విధానము:-**

భారత భూ గర్భ జల వనరుల అధారిటీ ప్రకారం భారతదేశంలో వివిధ ప్రాంతాలలో నీటి సంక్షోభానికి సంబంధించిన వివరాలను క్రింది పట్టికలో ఇవ్వడమైనది.

| రాష్ట్రము | నీటి సమస్యను / ఎద్దడిని ఎదుర్కొంటున్న జిల్లాలు | జనాభా సంఖ్య (లక్షలలో) |
|---|---|---|
| ఛత్తీస్‌ఘడ్ | 12 | 94 |
| గుజరాత్ | 22 | 291 |
| మధ్య ప్రదేశ్ | 32 | 127 |
| ఒరిస్సా | 28 | 119 |
| రాజస్థాన్ | 31 | 330 |
| మహారాష్ట్ర | 26 | 455 |

కేంద్ర జలవనరుల కమీషన్ నిర్వహించిన సర్వే ప్రకారం అవస్థాపనా సౌకర్యాల కొరత మరియు సాంకేతిక పరిజ్ఞానం లేని కారణంగా మనం భూ ఉపరితల జలవనరులలో 36 శాతం మాత్రమే వినియోగించుకోగలుగుతున్నాము. అంచనాల ప్రకారం ఏడాదికి 188 మిలియన్ హెక్టార్ల లీటర్ల నీరు లభ్యమవుతున్నది. కనుక సమర్ధవంతమైన జాతీయ జలవనరుల విధానం అవసరం.

1987 సెప్టెంబరులో జాతీయ జల విధానం ఆమోదం పొందింది. ఈ విధానం త్రాగునీటికి, వ్యవసాయానికి, విద్యుత్చ్ఛక్తికి, పరిశ్రమలకు ఇతర అవసరాలకు ఆ క్రమానుసారం ప్రాధాన్యతను ఇచ్చింది. కాని దాని అమలు సంతృప్తికరంగా లేదు. 15 ఏండ్ల తరువాత 2005లో మరో జాతీయ విధానాన్ని రూపొందించింది. ఈ విధానం త్రాగునీటికి ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చింది వ్యవసాయానికి అంతగా ప్రాధాన్యతను ఇవ్వలేదు.

రెండు లేదా అంతకన్నా ఎక్కువ రాష్ట్రాల మధ్య జలవనరుల పంపిణీకి మరింత ఎక్కువ ప్రాధాన్యతను ఇవ్వవలసి వుంది. అటువంటి విధానం లేని కారణంగా రాష్ట్రాల మధ్య జల వివాదాలు తలెత్తుతున్నాయి. స్వాతంత్ర్యం వచ్చి 60 ఏండ్లు గడిచినప్పటికి, గంగా, బ్రహ్మపుత్ర మరియు పద్మ నదులలో వరదల నియంత్రణకు అవసరమైన విజయవంతమైన నిష్పాక్షికమైన జల విధానాన్ని అమలు చేయలేకపోయాము. ప్రతి ఏడాది 7.5 మిలియన్ల హెక్టార్లు వరదలతో కొట్టుకుపోతాయి మరియు 40 మిలియన్ల హెక్టార్లు వరదల బారిన పడతాయి. మరో వైపు మన దేశంలో 1/6వ వంతు భూమి కరువు బారినపడుతుంది. కనుక గ్రామీణ మరియు పట్టణ ప్రాంత ప్రజలు, పన్ను చెల్లించేవారు మరియు పన్ను చెల్లించనివారి సమస్యలను, రైతులు, భూమిలేని వ్యవసాయ కార్మికుల సమస్యలను బాధలను, పరిష్కరించేందుకు సమగ్ర జల విధానం అవసరం.

పశ్చిమ బెంగాల్, త్రిపుర, కేరళ ప్రభుత్వాలు ప్రజల నీటి సమస్యను పరిష్కరించేందుకు సమగ్ర విధానాన్ని అమలు చేయడం ద్వారా వారి నిబద్ధతను చాటుకున్నాయి. కాని జల విధానాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు వదిలివేయకూడదు. కేంద్ర ప్రభుత్వం తన సొంత ప్రణాళికను రూపొందించుకోవాలి మరియు దాని అమలుకై నిధులను సమకూర్చాలి.

నీటి సంక్షోభం మహిళలను ప్రత్యక్షంగా ప్రభావితం చేస్తుంది. కుటుంబం యొక్క నీటి అవసరాలను తీర్చడం మహిళల యొక్క ప్రాథమిక బాధ్యత. నీరు లభ్యమయ్యే ప్రాంతం నుండి ఇంటికి నీరు తేవడానికి ఒక మహిళ ఏడాదికి సగటున సుమారు 15,000 మైళ్ళు నడవాల్సి ఉంటుంది.

గుజరాత్‌లో సియాని గ్రామం తీవ్ర నీటి ఎద్దడిని ఎదుర్కొంటున్నది. ఒక పెద్ద బావి మాత్రమే ఎల్లప్పుడూ ఆ గ్రామంలో నివసించే 11,000 జనాభాకు సురక్షితమైన నీరు అందిస్తుంది. నీటి ఎద్దడి ఆ గ్రామంలో పెండ్లిళ్లను ప్రభావితం చేస్తున్నది. ఆ గ్రామంలో ధనవంతులు పేద మహిళలను పెండ్లాడాలని కోరుకుంటున్నారు. ఆ విధంగా వారిని కుటుంబ అవసరాల కోసం నీటిని తీసుకుని రావడానికి వుపయోగించుకోవచ్చు. ఇది నరేంద్రమోడిని దేశంలోనే మంచి ముఖ్యమంత్రిగా ఎన్నుకొన్న రాష్ట్రంలో జరుగుతున్నది.

**2025 నాటికి భూమి పై 2/3 వంతు జనాభా తగినంత నీరు పొందరు (ప్రపంచ జనాభా నివేదిక 2002) 50 శాతం జనాభా రోజుకి కనీసం 50 లీటర్ల నీటిని పొందరు (ఐక్య రాజ్యసమితి 2001)**

**అభివృద్ధి చెందుతున్న దేశాలలో సురక్షితం కాని మంచినీరు త్రాగడం కారణంగా 5 సంవత్సరాల లోపు పిల్లలు ప్రతీ 8 సెకన్లకు ఒకరు చనిపోతున్నారు. (యునిసెఫ్)**

**తలసరి నీటి వినియోగంము (క్యూబిక్ మీటర్లలో)**

| | |
|---|---|
| **అమెరికా** | **1688** |
| **ఆస్ట్రేలియా** | **945** |
| **జపాన్** | **723** |
| **చైనా** | **431** |
| **భారతదేశం** | **497** |
| **దక్షిణ ఆఫ్రికా** | **288** |

**మూలం: సెంటర్ ఫర్ ఎకోలజీ మరియు హైడ్రోలజీ, బ్రిటన్.**





# హైకూలు

నీ గెలుపు దౌర్జన్యం
నా గెలుపు ధైర్యం!
దౌర్జన్యం రాజ్యమేలే
దౌర్భాగ్యాన్ని కూల్చేది మాత్రం ధైర్యమే!!
-----------
వంటగది నీ సామ్రాజ్యం
అంటావా!
మరి వంట గిన్నెలనిండా
నీ పేరేంటో!!
------------
వంటింటి నిండా మిషన్లే
నువ్వు చేసేదేంటంటావా!
అవును మరి నన్నుకూడా
ఎపుడో రోబోట్ క్రింద మార్చావ్‌గా!!

జి.అమలశ్రీ.



చదవడం వలన ప్రయోజనమేమంటే నలుమూలలనుంచీ వచ్చే విజ్ఞానాన్ని పొందడం, దాన్నుంచి గుణపాఠాలు తీసుకోవడం.

– గాంధీజీ

# ఉద్యమాల వెలుగురేఖ 'మార్చి 8'

-ఎస్. పుణ్యవతి

ఎన్నో ఉద్యమాల ఫలితంగా ఆవిర్భవించిన 'మార్చి8' మరెన్నో మహిళా విముక్తి ఉద్యమాలకు స్ఫూర్తినిస్తోంది. ఇంటా బయటా సమాన హక్కుల కోసం స్త్రీలు సాగించే ఉద్యమాలకు మార్చి8 సంకేతంగా నిలిచింది.

ఒక్కసారి చరిత్రలోకి తొంగి చూద్దాం....

మార్చి 8కి అంకురార్పణ జరిగింది. 1910లో అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సంస్థ ఆధ్వర్యంలో క్లారాజట్కిన్ నేతృత్వంలో 1910 సంవత్సరంలో డెన్మార్క్ రాజధాని కోపెన్ హాగేన్‌లో రెండవ అంతర్జాతీయ సోషలిస్టు మహిళా మహాసభ జరిగింది. మొదటి మహాసభ 1907 జర్మనీలో స్టట్‌గార్ట్ పట్టణంలో జరిగింది. ఈ సదస్సులోనే 15 దేశాల నుండి 50మంది మహిళలతో కమిటీ ఏర్పడింది. అప్పట్లో సార్వజనీన ఓటుహక్కు లేదు. ఆస్తులున్న పురుషులకు మాత్రమే ఓటు హక్కు ఉంది. అలాగాకుండా అందరికీ ఓటు హక్కు కావాలని సదస్సు తీర్మానించింది.

ఈ అంతర్జాతీయ సంస్థకు నాయకురాలిగా క్లారా జట్కిన్ ఎన్నికయ్యారు. 'సమానత్వం' పత్రిక ప్రారంభమయ్యింది. కోపెన్ హాగేన్‌లో జరిగిన రెండవ సదస్సు ఒక అడుగు ముందుకు వేసి సంవత్సరంలో ఒక రోజును మహిళల కోర్కెల దినంగా జరపాలని, ప్రపంచ వ్యాపితంగా వర్గ చైతన్యం గల ట్రేడ్ యూనియన్ సంస్థలన్నీ కోర్కెల దినం జరపాలని తీర్మానించింది.

అందుకు మార్చి 8వ తేదిని ఎంపిక చేశారు. మార్చి 8కి చారిత్రక ప్రాధాన్యత ఉంది. న్యూయార్క్ నగరంలో కుట్టుపని చేసే మహిళా కార్మికులు వేతనాలు, 8గంటల పని దినం వంటి కోర్కెలతోపాటు మహిళల ఓటుహక్కు డిమాండ్ కోసం సమ్మె చేశారు. ఆ సత్సాంప్రదాయాలు పాటించేందుకు మార్చి8 అంతర్జాతీయ మహిళల హక్కుల దినంగా రెండవ సోషలిస్టు మహిళా సదస్సు ప్రకటించింది.

మార్చి 8కి ముందు వివిధ దేశాల్లో అటు కార్మిక సంఘం నాయకత్వంలోను, ఇటు బూర్జువా మేధావులు, మహిళా ఉద్యమాల నేతృత్వంలోనూ అనేక ఉద్యమాలు సాగాయి. అదే మార్చి 8 ఆవిర్భావానికి దారితీశాయి. కారల్ మార్క్స్ నాయకత్వంలో 1864లోనే శ్రామికుల అంతర్జాతీయ సంఘం ఏర్పడింది. దానినే మొదటి ఇంటర్నేషనల్ అంటారు. ఫ్యాక్టరీలలో కార్మికులను పనిలో పెట్టుకోరాదనే వాదనలు కొంతమంది నాయకులు చేసేవారు. అవి సరికాదని కారల్‌మార్క్స్ వాదించారు. భారీ పరిశ్రమలలో పనిచేసేందుకు స్త్రీ కార్మికులు అత్యధిక సంఖ్యలో ముందుకురావాలని, తద్వారా మహిళా విముక్తికి సరైన మార్గం ఏర్పడుతుందని వాదించారు. అదే సందర్భంలో మహిళా శ్రామికుల ప్రత్యేక హక్కుల కొరకు ట్రేడ్ యూనియన్లు పోరాడాలని, సమాన వేతనాలు, రాత్రి షిఫ్టులో పని నిషేధం వంటి డిమాండ్లపై చట్టాలు తేవాలని స్పష్టం చేశారు. ఒక్కమాటలో చెప్పాలంటే ట్రేడ్ యూనియన్లు పురుష కార్మిక సంఘాలుగా గాక స్త్రీ, పురుష కార్మిక సంఘాలుగా మారాయి. ఆ తరావాత కాలంలో వేలాదిమంది స్త్రీలు కార్మిక సంఘాలలో చేరి నిర్మాణాత్మక కృషి చెయ్యడం ఆరంభించారు.

వాస్తవానికి ఫ్రెంచి విప్లవం స్త్రీల హక్కుల ఉద్యమానికి తెరలేపింది. ఫ్రెంచి విప్లవ నినాదం స్వేచ్ఛా సమానత్వం, సౌభ్రాతృత్వం . ఈ నినాదం వ్యక్తి స్వేచ్ఛకు నాంది పలికింది. ఇంటి చాకిరికీ, కట్టుబాట్లకు, మత పరమయిన సాంప్రదాయాలకు, వ్యవసాయ సంబంధిత వృత్తులకు కట్టివేయబడి, సామాజిక సంబంధాలు లేక చైతన్య రాహిత్యంగా ఉన్న స్త్రీలలో ఫ్రెంచి విప్లవ నినాదాలు స్వేచ్ఛా పిపాసను రేకెత్తించాయి. 'మహిళలకు' ఉరికంబాలెక్కే హక్కు ఉన్నపుడు పార్లమెంటులో ప్రవేశించే హక్కు 'ఎందుకుండకూడదు? అని ప్రశ్నించారు. ఆ విధంగా పురుషులకే స్వతంత్రమయిన రాజ్యాధికార హక్కు స్త్రీలకు ఎందుకు ఉండరాదని ప్రశ్నించారు.

పారిస్ కమ్యూన్‌తో స్త్రీల రాజకీయ చైతన్యం మరొక అడుగుముందుకు వేసింది. కార్మిక సంఘాల ఆధ్వర్యంలో సాగిన సోషలిస్టు విప్లవానికి నాంది పారిస్ కమ్యూన్. ఇది 1871లోజరిగింది. ఫ్యాక్టరీ కార్మికులు, టైలర్లు, లాండ్రీ వర్కర్లు, రోజు కూలీ పనివారు, మధ్య తరగతి మేధావులు మొదలగు అన్ని రంగాల నుండి పురుషులతోపాటు స్త్రీలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. వెయ్యి మందికి పైగా మహిళా ఖైదీలు వారి కమిటీచే విచారించబడ్డారు.

18వ శతాబ్దం చివరలో ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాల మీద పారిశ్రామిక విప్లవం వచ్చింది. పారిశ్రామిక విప్లవం బూర్జువా పునర్వికాస ఉద్యమానికి దారితీసింది. శాస్త్ర, సాంకేతిక రంగాల్లోను, సామాజిక శాస్త్రాలోనూ సాగిన కృషి, అధ్యయనం ప్రజల్లో చైతన్యం పెంచాయి. కొత్త కొత్త ఆశలు, ఆలోచనలు రేకెత్తించాయి.

స్త్రీ విముక్తికి సంబంధించి సైద్ధాంతిక, అవగాహనతో కూడిన గ్రంథం 'కుటుంబం, వ్యక్తిగత ఆస్థి, రాజ్యాంగాల పుట్టుక'అనే గ్రంథాన్ని ఏంగెల్స్ 1884లో రచించారు.

ఆ తరువాత ప్రముఖ జర్మన్ కమ్యూనిస్టు ఆగస్ట్ బెబెల్ రచించిన 'మహిళలు గతంలో, వర్తమానంలో, సోషలిజంలో' అనే గ్రంథం వచ్చింది.

మహిళలు పురుషుల కంటే తక్కువ అనే పాతకాలపు సిద్ధాంతాలను త్రోసివేసి స్త్రీలు పురుషులతో సమానమనే సోషలిస్టు సిద్ధాంతాలన్ని ఈ గ్రంథాల ద్వారా ఏంగెల్స్, బెబెల్ ఇద్దరూ నొక్కి చెప్పారు. ఏంగెల్స్, బెబెల్ రచనలు కార్మికోద్యమం పైనా, శ్రామిక మహిళా ఉద్యమం పైనా మంచి ప్రభావం చూపాయి. క్లారాజట్కిన్ వంటి నాయకురాండ్రు మహిళా కార్మికుల సమస్యల్ని అంతర్జాతీయ వేదికల పైన లేవనెత్తి, శ్రామిక మహిళా ఉద్యమానికి ఒక ప్రాముఖ్యతను తీసుకువచ్చారు.

మరో వైపు బూర్జువా మేధావులు, సంఘాల ఆధ్వర్యంలో కూడా స్త్రీల హక్కులకోసం ఉద్యమాలు సాగాయి. జె.ఎస్.మిల్ రచించిన మహిళల దాస్యము చాలా ప్రముఖమైన గ్రంథం. ఆయన స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు కావాలని పార్లమెంటులో వాదించారు.

1830నుండి స్త్రీ విద్య, సామాజిక స్వేచ్ఛ, స్త్రీలకు ఓటు హక్కు వివాహం-విడాకుల హక్కుల కోసం వివిధ సంస్థలు, నేతల ఆధ్వర్యంలో ఉద్యమాలు నడిచాయి. ఆ క్రమంలో మార్చి 8 ఒక మైలురాయి వంటిది. ప్రపంచ వ్యాపితంగా మార్చి 8 మహిళల సమాన హక్కులకి, మహిళా విముక్తికి సంకేతంగా నిలిచింది. మహిళలు చేపట్టిన చాలా ఉద్యమాలు మార్చి 8న జరిగాయి. రష్యాలో జార్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా శ్రామిక మహిళలు నిర్వహించే అనేక ఉద్యమాలు మార్చి 8న జరిగాయి. రష్యాలో జార్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా శ్రామిక మహిళలు నిర్వహించే అనేక ఉద్యమాలకు మార్చి8ని ఎంచుకునే వారు. ప్రముఖ కమ్యూనిస్టు నేత లా పాషనారా నాయకత్వంలో ఫాసిజానికి వ్యతిరేకంగా 1936లో మార్చి8న లక్ష మంది మహిళలు ప్రదర్శన నిర్వహించారు. ప్రపంచశాంతి కోరుతూ యుద్ధానికి వ్యతిరేకంగానూ, ఉపాధి, ఆహార భద్రత కోసం మార్చి8న అనేక ప్రదర్శనలు వివిధ దేశాల్లో జరిగాయి, జరుగుతూనే ఉన్నాయి.

1975లో ఐక్య రాజ్యసమితి అంతర్జాతీయ మహిళా దశాబ్దం ప్రకటించిన తరువాత మార్చి8కి మరింత ప్రాముఖ్యత పెరిగింది. ప్రభుత్వ సంస్థల ఆధ్వర్యంలో కూడా మార్చి 8 ఉత్సవాలు జరుగుతున్నాయి. అయితే ప్రభుత్వాధినేతలు ఉత్సవాలు జరుపుతూ మభ్యపెడుతున్నారే తప్ప మహిళా సమస్య పరిష్కారానికి పూనుకోవడం గాని, పోరాట స్ఫూర్తిని గుర్తించడం గాని జరగడం లేదు. ఒక వైపు దేశం శరవేగంతో అభివృద్ధి పథం వైపు దూసుకుపోతుందని చెబుతున్నా రోజుకు ఇరవై రూపాయల ఆదాయంతో బ్రతికే అసంఘటిత కార్మికులు కోట్ల సంఖ్యలో ఉన్నారని ప్రభుత్వ నివేదికలే చెబుతున్నాయి. వారిలో గణనీయంగా స్త్రీలు ఉన్నారని వేరే చెప్పాలా? చట్ట సభల్లో రిజర్వేషన్ల కోసం బడ్జెట్టులో వాటా కోసం, పని హక్కు కోసం, నివాస స్థలం కోసం, గౌరవ ప్రదమైన వేతనం కోసం, వృద్ధాప్యంలో భద్రత కోసం మహిళలు తోటి పురుష శ్రామికులతో కలిసి పోరాడుతున్నారు. తుదకంటూ పోరాడుతూనే ఉంటారు.

## భారత దేశంలో మహిళా గవర్నర్లు

| | | |
|---|---|---|
| 1.సరోజినినాయుడు | ఉత్తరప్రదేశ్ | ఆగస్టు1947నుంచిమార్చి1949 |
| 2.పద్మజానాయుడు | పశ్చిమబెంగాల్ | నవంబర్1956 నుంచి జూన్1967 |
| 3.విజయలక్ష్మీపండిట్ | మహారాష్ట్ర | నవంబర్ 1962 నుంచి సెప్టెంబర్1963 |
| | | డిసెంబర్ 1963 నుంచి అక్టోబర్ 1964 |
| 4. శారదా ముఖర్జీ | ఆంధ్రప్రదేశ్ | మే 1977 నుంచి ఆగస్టు 1978 |
| | గుజరాత్ | ఆగస్టు 1978 నుంచి ఆగస్టు 1983 |
| 5. జ్యోతి వెంకటాచలం | కేరళ | అక్టోబర్ 1977 నుంచి అక్టోబర్ 1982 |
| 6. కుముద్‌బెన్ జోషి | ఆంధ్రప్రదేశ్ | నవంబర్1985 నుంచి ఫిబ్రవరి 1990 |
| 7.రామ్ దులారిసిన్హా | కేరళ | ఫిబ్రవరి 1988నుంచి ఫిబ్రవరి 1990 |
| 8. సెర్లా గ్రెవాల్ | మధ్యప్రదేశ్ | మార్చి 1989నుంచి ఫిబ్రవరి1990 |
| 9. చంద్రావతి | పాండిచ్చేరి | ఫిబ్రవరి 1990 నుంచి డిసెంబర్ 1990 |
| 10.రాజేంద్రకుమారిబాజ్‌పేయి | పాండిచ్చేరి | మే 1995నుంచి ఏప్రిల్ 1998 |
| 11. షీలాకౌల్ | హిమాచల్‌ప్రదేశ్ | జులై 1997 నుంచి డిసెంబర్ 1999 |
| | కర్ణాటక | డిసెంబర్ 1999 నుంచి ఆగస్టు 2002 |
| 14. రజనీరాయ్ | పాండిచ్చేరి | ఏప్రిల్ 1998 నుంచి జూలై 2002 |
| 15. ప్రతిభా పాటిల్ | రాజస్థాన్ | నవంబర్ 2004 నుంచి జూన్ 2007 |

## నువ్వు-నేను

నా గుండె గాయమయ్యింది
నీ పని అందరూ మెచ్చుకున్నారనికాదు!
ఇంటి పని ఆడవారి జన్మహక్కని
మీరంతా భావించారని!!

------------

ఏపనైనా నువ్వు చేస్తే
బోల్డు కాంప్లిమెంట్స్!
అదే నేచేస్తే 'నా' క్వాలిఫికేషన్
అమ్మాయని కామెంట్!!

-----------

మీడియా ఛానల్సులో
మహిళలే విలన్లు
నిత్యజీవితంలో
రోజు ఓడిపోయే పిచ్చితల్లులు!!

-----------

పనిమనిషి
మరమనిషా!
సాధించుకున్న హక్కులతో
ఇపుడు సవ్యసాచి!!

----

విద్యార్థులు
కార్పోరేట్ కాలేజిలో
మెలిచే హైబ్రీడ్ మొక్కలు!
ఎంత డబ్బు ఎరువేసినా
మెరుగుదలలేని బోన్సాయిలు!!

సుధాకిరణ్. బి.



# మహిళలపై పెరుగుతున్న హింస

**జాతీయ మహిళా కమిషన్ సభ్యురాలు మాలినీ భట్టాచార్య గారితో ఫ్రంట్‌లైన్ రిపోర్టర్ టి.ఆర్. రాజ్యలక్ష్మి చేసిన ఇంటర్వ్యూ వివరాలు:**

పేద ప్రజలకు చట్టాల గురించిన సమాచారం పూర్తిగా తెలుసుకునే హక్కు ఉంది. చట్టాల వలన ప్రత్యేక ప్రయోజనాలు చాలా వున్నాయి. సమాజంలో కొన్ని పనులు అంగీకరించబడవనే అధికారిక గుర్తింపు చట్టాల వలన కలుగుతుంది. చట్ట పరంగా, రాజ్యాంగపరంగా మహిళల రక్షణ కోసం చేపట్టాల్సిన చర్యల గురించి అధ్యయనం చేయడానికి, అజమాయిషీ చేయడానికీ ఒక చట్టపరమైన సంస్థ ఉండాలని మహిళా సంఘాలు చిరకాలంగా చేసిన కృషి ఫలితంగా 1992వ సం॥ జనవరిలో జాతీయ మహిళా కమిషన్ ఏర్పడింది.

సంస్థ ఏర్పడినతరువాత గడచిన 15సం॥కాలంలో ముందుకొచ్చిన సవాళ్ళను అధ్యయనం చేసే కృషి జరిగింది.. మహిళలకు సంబంధించిన పలు అంశాలను జాతీయ మహిళాకమిషన్ సభ్యురాలు మాలినీ భట్టాచార్యగారు ఫ్రంట్‌లైన్ పత్రికకు వివరించారు.

**మహిళలపై హింస పెరగడానికి కారణాలు:**

మహిళలపై పెరుగుతున్న హింసకు కారణం సమాజంలోని వెనుకబాటుతనమే. మనకు కొన్ని చట్టాలున్నాయి. విజ్ఞానం అందుబాటులో ఉంది. చాలా మంది మహిళలు విద్యావంతులవుతున్నారు. మహిళలు బయటికి వచ్చి ఉద్యోగాలు కూడా చేస్తున్నారు.

మహిళలపై పెరుగుతున్న హింసకు వ్యతిరేకంగా గొంతు విప్పుతున్నాం. ఈ రకమైన గళం పితృస్వామ్య వ్యవస్థకు ఒక బెదిరింపుగా ఉంది. సాంప్రదాయ బద్ధమైన సమాజం బ్రద్దలవుతుంది కనుకనే హింస పెరుగుతుందని కొంతమంది చెబుతున్నారు. నేను దీనికి అంగీకరించడం లేదు. కొన్ని రకాలైన హింసా పద్ధతులు గతం నుండి కొనసాగుతున్నాయి. నిమ్న కులాలు, జాతులు పట్ల వాటికి సంబంధించిన మహిళల పట్ల హింస గతం నుండీ కొనసాగుతూనే ఉంది.

గతమెంతో ఘనంగా ఉందని చెప్పుకోవడం వలన ఉపయోగం లేదు. మహిళలు ఎక్కువ విద్యా వంతులై బయటికి వెళ్ళగలిగే పరిస్థితి ఉంటే వరకట్న సమస్య తీవ్రమవడమేకాక కొన్ని కొత్త రూపాలతో ముందుకొస్తుంది.

వరకట్నం, దానికి సంబంధించిన హింస స్వరూపం మారిపోయింది. వరకట్న సమస్య ఆస్తులతో ముడిపెట్టబడింది. ఇప్పుడు మహిళలు పొందుతున్న తండ్రి ఆస్తిలో వాటా హక్కుతో కడా ముడిపెట్టబడింది. ప్రజల జీవన విధానంలోనే పెద్ద మార్పు వచ్చింది. ముఖ్యంగా మీడియా మరియు వినిమయ వస్తువుల ప్రకటన దారులు నిరంతరం వెంపర్లాడే ఎగువ మధ్య తరగతి వర్గాల్లో జీవన విధానంలో పెద్ద మార్పు వచ్చింది. కనుక విద్యావంతులై ఉండి ఉద్యోగం చేస్తున్న యువతి కూడా కట్న కానుకలతో కూడుకున్న వైభవోపేతమైన వివాహం జరగాలని కోరుకుంటుంది. చాలా టివి సీరియళ్లలో కూడా ఇలాంటి ఆడంబరాలు చిత్రీకరించి వాటిని ప్రోత్సహిస్తున్నారు. ధనిక హిందూ కుటుంబాల్లో ప్రామాణికంగా భావిస్తున్న ఇటువంటి ఆడంబరాలు మిగిలిన ఇతర పేద వర్గాలకు, కులాలకు పాకింది. దీనితో వరకట్నం కొత్త స్వరూపంతో ముందుకొచ్చింది.

మహిళలపై పెరుగుతున్న లైంగిక హింస ఇంకొక పెద్ద అంశంగా ఉంది. పూర్వ కాలంలో మహిళలు ఇంట్లో ఉంటే సురక్షితంగా ఉంటారని చెప్పేవారు. కాని మహిళలు ఇళ్ళల్లో కూడా నిరంతరం హింసను ఎదుర్కొంటూనే ఉన్నారు. ఇప్పుడు మనం దీనిని హింసగా గుర్తించగలుగుతున్నాము. మొత్తం సమాజమే హింసాపూరితంగా మారుతుంది. పోటీతత్వం, దురాక్రమణ తత్వం ఎక్కువగా వున్న కార్పొరేట్ సాంప్రదాయాలు ప్రబలడంతో హింస పెరగడమే కాక బలహీన వర్గాలు ఈ హింసకు బలవుతున్నారు. సాధారణంగా సమాజంలో హింస ఉంటే మహిళలపై కూడా దాని ప్రభావం అధికంగా ఉంటుంది. కనుక మహిళలపై హింస పెరుగుతుంది. దీని ప్రభావంగా నేడు బిపిఒలలోమరియు కార్పొరేట్ సంస్థలలో లైంగిక వేధింపులు అధికమయ్యాయి. గతం నుండి వస్తున్న హింసాత్మక ధోరణులు తిరిగి పునరావృతమవుతున్నాయి.

ఉద్యోగుల స్వభావం పూర్తిగా మారిపోయింది. నూతన విధానాలతో మహిళలు ప్రధానంగా కాంట్రాక్టు పద్ధతిలోనే ఉద్యోగాలు పొందగలుగుతున్నారు. పర్మినెంట్ ఉద్యోగులైతే కొన్ని చట్టబద్ధమైన సౌకర్యాలు, భద్రత ఉంటాయి. పర్మినెంట్ ఉద్యోగాలు కాంట్రాక్టు పద్ధతిలోకి మారడం, కాంట్రాక్టు పద్ధతిలో ఉద్యోగావకాశాలు పెంచడం మహిళల ఉపాధి పరిస్థితినే పూర్తిగా మార్చివేశాయి. ఉద్యోగులు పొందిన కొన్ని హక్కులను ఈ విధానంలో వదులుకోవలసి వస్తుంది. వేరొక ప్రక్క మధ్య తరగతి వారికి ఆపైన వర్గాల వారికి కొన్ని అవకాశాలు పెరగడంతో సమాజంలో అంతరాలు పెరుగుతున్నాయి. దీనిని ఆర్థికవేత్తలు ఉపాధి లేని అభివృద్ధిగా కాక ఉన్న ఉపాధి పోగొట్టే అభివృద్ధిగా చెబుతున్నారు. దీని అర్థం ఇప్పుడు పురుషులకు ఉద్యోగావకాశాలు దొరకడం లేదు. మహిళలు తమను మరింత

దోచుకునే పరిస్థితులలో ఉద్యోగాలు దొరుకుతున్నాయి. చాలామంది మహిళలకు ఉద్యోగ పరిస్థితులు అననుకూలంగానే ఉన్నాయి. ముందెన్నడూలేని రీతిలో మహిళాకార్మికుల వలసలు అసాధారణంగా పెరిగిపోయాయి. అణగారిన, బడుగువర్గాలకు చెందిన మహిళలు కొన్ని రకాల పనుల కోసం వలసలు వెళ్లినపుడు రకరకాల వేధింపులకు గురికావలసివస్తుంది. కొన్ని సార్లు మహిళలను అక్రమ వ్యాపారానికి పరిస్థితులు దారితీస్తున్నాయి. వలసలను మహిళల అక్రమ తరలింపును వేరు వేరుగా చూడలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. సరళీకరణ విధానాల యుగంలో వలసలు వెళ్ళడానికి స్వేచ్ఛ వచ్చిందనే భావన ఉంది కాని మహిళలు తమ ఇష్ట ప్రకారం వలసలు వెళ్ళడం తగ్గి అక్రమ తరలింపు ప్రారంభమయ్యింది.

జాతీయ మహిళా కమిషన్ పలు అంశాలపై కృషి చేయడంలో ముందు పీఠిన ఉన్నది. కాని బాలికల లింగ నిష్పత్తి పడిపోవడం లాంటి విషయాలలో కమిషన్ ప్రభావం అంతగా కనిపించకపోవడానికి

**కారణాలు:**

ప్రస్తుతం ఉన్న చట్టాలకు అవసరమైన మార్పులను సూచించడం, కొన్ని విధానాలను, కొన్ని కొత్త చట్టాలను ప్రతిపాదించడం మహిళా కమిషన్ ప్రణాళికలో భాగంగా ఉంది. గత 15సం॥ల కాలంలో మహిళా కమిషన్ అనేక విషయాలలో జోక్యం చేసుకొని పనిచేసింది. కమిషన్ ప్రభుత్వానికి కొన్ని ప్రతిపాదనలు చేయడం మాత్రమే చేయగలుగుతుంది. గత మూడు సం॥ల కాలంలో చేసిన కొన్ని ప్రతిపాదనలు పరిశీలిస్తే అత్యాచారానికి గురైన బాధిత మహిళలకు ఒక నిధిని కాని లేక ఒక స్కీమును కాని పెట్టాలని కమిషన్ ప్రతిపాదించింది. దానిని 11వ పంచవర్ష ప్రణాళికలో ప్రవేశపెడతారని భావించాము. కాని ఇప్పటి వరకూ దానిని పట్టించుకోలేదు. లైంగిక వేధింపులకై ఒక సమగ్ర చట్టం తేవాలని దేశ వ్యాప్తంగా పెద్ద వర్క్‌షాపు నిర్వహించాము. ఈ విషయంలో కమిషన్ అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం సాయం తీసుకుంది. ఐద్వా తయారు చేసిన బిల్లుపై చర్చించాము. తరువాత దానిని ఆమోదించాము. అత్యాచారాన్ని నిరోధించడంలోనూ బాధిత మహిళల పునరావాసానికి సంబంధించిన అంశాలలోనూ, ప్రత్యేకించి బాలికలు అత్యాచారానికి, లైంగిక వేధింపులకు గురైనపుడు చేపట్టాల్సిన ప్రత్యేక చర్యల గురించి ఐద్వాయొక్క సలహాలను కోరాము. ప్రస్తుతానికి ఈ విషయానికి సంబంధించి ప్రత్యేక చట్టమేమీ లేదు. పని ప్రదేశాల్లో లైంగిక వేధింపుల నిరోధానికి సంబంధించిన బిల్లు ప్రతిని తయారు చేయడానికి కమిషన్ న్యాయవాదుల సహాయం తీసుకుంది. జాతీయంగా ఈ విషయంపై సంప్రదింపుల తరువాత తయారైన ఈ బిల్లును ప్రభుత్వానికి పంపడం జరిగింది. బిల్లును పార్లమెంటులో ప్రవేశపెడతారని భావించాము కాని ప్రభుత్వం ఆ పని చేయలేదు. ఇదంతా కష్టతరమైన పని అయినప్పటికీ ఇది అత్యవసరమైన పనిగా కమిషన్ భావించింది.

మహిళా శిశు సంక్షేమ శాఖ, జాతీయ మానవహక్కుల కమిషన్ మరియు జాతీయ మహిళా కమిషన్ మూడు కలిసి సంయుక్తంగా మహిళల అక్రమ తరలింపు విషయంపై ఒక జాతీయ పథకం రూపొందించాయి. ఈ పథకంలో అక్రమ తరలింపుపై సమగ్రంగా చర్చించబడింది. అక్రమ తరలింపుల నిరోధక చట్టం(ఐటిపిఎ) లో వ్యభిచార నిమిత్తం మహిళలను తరలించే విషయం మాత్రమే ప్రస్తావించబడింది. కాని వారికి కావలసిన రక్షణ మరియు పునరావాస సౌకర్యాల విషయంపై కమిషన్ పట్టుపట్టడం జరిగింది. తరువాత దానికి అంగీకరించారు. ఇప్పుడు ఈ పథకం ప్రభుత్వామోదానికై ఉంది. లింగ నిర్ధారణ నిరోధక చట్టం విషయంలోకూడా జోక్యం చేసుకొని చట్టం ఇంకా సమర్ధవంతంగా అమలు కావడానికి చట్టంలో చేయాల్సిన మార్పులను సూచించాము.

బాలికల నిష్పత్తి పడిపోవడం గణాంక పరంగానే కాక సాంఘిక పరంగా కూడా తీవ్ర ఆందోళన కలిగిస్తుంది. తక్కువ మంది మహిళలుంటే వారి విలువ పెరుగుతుందని కొంతమంది వాదిస్తున్నారు. ఇది పూర్తిగా వాస్తవ విరుద్ధమైన వాదనమాత్రమే. వాస్తవంగా తక్కువమంది ఉన్నపుడు ఎక్కువ అణచివేయడానికి అవకాశం వస్తుంది. గణాంకాలు ఈ విధంగా పడిపోవడం ఆందోళన కలిగిస్తుంది. గణాంకపరంగానే కాక సమాజంలో భార్యలు, తల్లులు, కూతుళ్ళు ఎలా ఉద్భవిస్తారనే ప్రశ్న ఉదయిస్తుంది. అంతేకాక ఇన్ని సంవత్సరాల మహిళా ఉద్యమం స్వాతంత్రం తరువాత మహిళల పుట్టుకనే నివారించే ప్రయత్నాలు చేస్తూ మహిళల విలువను దిగజార్చడం అత్యంత శోచనీయమైన విషయం.

మహిళలకు సంబంధించిన అంశాలు జాతీయ ప్రాముఖ్యం కలిగిన అంశాలుగా గుర్తించకపోవడానికి కారణాలు ఏమిటి? మరియు న్యాయ వ్యవస్థ మహిళా అంశాలపై సానుకూలంగా పనిచేయకపోవడానికి కారణాలు ఏమిటి అనే విషయాలపై:

ఇవి సామాజిక అంశాలుగా మేము (మహిళా కమిషన్) భావిస్తున్నాము. కాని సరళీకరణ విధానాల కారణంగా సామాజిక అంశాలలో ప్రభుత్వ జోక్యం తగ్గింది. విధానపరంగా మహిళల అంశాలకు ప్రాముఖ్యత కొంత ఉంది. కాని వాటి అమలులో లోపాలున్నాయి. ఉదాహరణకు లింగ నిర్ధారణ నిరోధక పరీక్షల చట్టం ప్రకారం కొన్ని వైద్య పరీక్షలలో సాంకేతిక పరిజ్ఞానాన్ని నియంత్రించాల్సి ఉంది. కాని ఒక సదుపాయాన్ని ఇచ్చేవారు కాని, ఆ సదుపాయాన్ని పొందేవారు కాని ఒక రకమైన భావజాలానికి అలవాటు పడినపుడు ప్రభుత్వం తన బాధ్యతలను సులభంగా వదులుకొంటుంది. ఈ వైద్య పరీక్షలన్ని మనకసలు అవసరమా అనేది ఆలోచించాలి. ఒక మనిషి ఏదైనా సేవను పొందడానికి కాని అమ్మడానికి కాని స్వేచ్ఛ కావాలనుకొనే ప్రస్తుత పరిస్థితులలో ఒక నియంత్రణా చట్టాన్ని చేయాలంటే చాలా కష్టతరంగా మారింది.

న్యాయ సేవలకు సంబంధించిన వ్యవస్థను ఉదాహరణగా తీసుకుంటే చట్ట ప్రకారం దళితులకు, షెడ్యూల్డ్ తెగలవారికి, పేదప్రజలకు ఉచితంగా న్యాయం అందాలి. కాని మనం దీనని అమలు చేయలేకపోతున్నాము. మొత్తంగా ఎక్కడ చూసినా లాభార్జనే ధ్యేయంగా మారుతున్న ప్రస్తుత పరిస్థితులలో సమాజ సేవా దృక్పధం గల వ్యక్తులు ఉండడం కష్టంగా మారుతుంది. పేద ప్రజలు న్యాయపరమైన సహాయం పొందడానికి హక్కులు కలిగిఉన్నారు. కాని ఇప్పుడున్న చట్టాలు వారికి ఏమాత్రం సహాయంగా లేవు. మనం ఒక అసమానమైన, కులమతాల పరంగా విభజించబడిన సమాజంలో ఉన్నాము. కనుక మన చట్టాలు కూడా ఈ సామాజిక ఆర్థిక అంశాలకే లోబడి వుంటాయని అర్థం చేసుకోవాల్సిఉంది. వర్గాల ప్రాతిపదికన పితృస్వామ్య వ్యవస్థగా మన సమాజం ఉంది. కాని అసలు చట్టాలే లేకపోతే మహిళలపై జరుగుతున్న నేరాలను మనం ఆమోదించినట్లు అవుతుంది.

ఉదాహరణకు వరకట్న నిరోధ చట్టం అంత ప్రతిభావంతంగా పనిచేయడం లేదని మనకు తెలుసు కాని అసలు నిరోధక చట్టమే లేకపోతే మనం వరకట్న సాంప్రదాయాన్ని ఆమోదించినట్లే అవుతుంది. కనుక చట్టాల వలన కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు ఉన్నాయి. సమాజంలో కొన్ని పనులు అంగీకరింపబడవని తెలిపే అధికారిక గుర్తింపు ఈ చట్టాల వలన కలుగుతుంది.

(ఫ్రంట్‌లైన్ సౌజన్యంతో)



# నీ మొగుడేగా కొట్టిండు

- వేములపల్లి సత్యవతి

సుశీల, చరిత ఎదురెదురు యిండ్లలో ఉంటున్నారు. వారివురి మధ్య పరిచయమేర్పడి సన్నిహితులైన స్నేహితులయ్యారు. సుశీల, చరిత కంటె పది సంవత్సరాలు పెద్దది. ఇద్దరుపిల్లలున్నారు. పదవ తరగతి వరకే చదువుకున్నది. చరిత గ్రాడ్యుయేట్. ఇంకా తల్లికాలేదు. ఇరువురి భర్తలు ఉద్యోగాలు చేస్తున్నారు. చరితకు ఉద్యోగం చేయాలన్న ఆసక్తి లేదు. స్వచ్ఛంద సంస్థల కార్యకర్తలతోకలిసి సామాజిక కార్యక్రమాలలో పాల్గొని పని చేస్తూ ఉంటుంది. మహిళల సమస్యలను గురించి పనిచేసే మహిళా సంఘాల మీటింగులకు ఒక్కతి గానీ, సుశీలతో కలిసి గాని వెళుతూఉంటుంది. రవీంద్ర భారతిలోను, లలిత కళాతోరణంలోను మరెక్కడైనా సంగీత సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలకు హాజరవుతుంది. అప్పుడప్పుడు భర్త భాస్కర్‌తో లేక వీలయితే సుశీలను వెంట తీసుకొని వెళుతుంది. ఆ మధ్య రవీంద్ర భారతిలో జరిగిన జానపద కళాకారుల సాంస్కృతిక కార్యక్రమాలకు వెళ్లాలనుకుని సుశీల కూడా వస్తుందేమో అడుగుదామని ఆమెయింటికి వచ్చింది.

**చరిత:** సుశీలక్కా!

**సుశీల:** ఆ, రా చరితా.

**చ:** ఏం చేస్తున్నావు?

సు: మధ్యాహ్నం వేళకదా! పనేమిలేదు. వట్టిగానే పడుకున్నా సాయంకాలం పోచమ్మ (పనిమనిషి) వచ్చే వరకు ఖాళీ.

చ: అయితే మనం మాట్లాడుకోవచ్చునన్న మాట.

సు: ఓ, తప్పకుండా.

చ: ఎల్లుండి నుండి రవీంద్ర భారతిలో జానపద కళాకారుల సాంస్కృతిక కార్యక్రమాలు మొదలవుతాయి. మన ప్రాచీన జానపద కళలు మరుగునపడి పోతున్నవన్న వార్తలు పత్రికలలో చదువుతుంటాను. నాకు చూడాలని ఉంది. నీకు వీలవుతుందా? ఇంతకు ముందు లలిత కళాతోరణంలో జరిగే వాటికి వెళదామంటే వీలు కాదన్నావు. అందుకని అడుగుతున్న.

సు: అవును చరిత 15రోజులకొస్తానని (అప్పుడు) వూరు వెళ్ళిన పోచమ్మ నెల రోజుల తర్వాత నాలుగు రోజుల కిందట వచ్చింది. పాచిపని, అంట్లు, బట్టలు, వంటపని, ఇంటి పని వుంటాయి కదా! ఆ కార్యక్రమాలేమో సాయంకాలం ఆరుగంటల నుండి మొదలవుతాయి. పిల్లలు సాయంకాలం అయిదు గంటలకు యింటికి వస్తారు. మధ్యాహ్నం సరిగా తింటారోలేదో? వాళ్లకేదైనా చేసి వుంచితే యిష్టంగా తింటారు. నాకు తృప్తి కల్గుతుంది. ఈ సంగతి నీవు తల్లివయిన తర్వాత గాని అనుభవం కాదు. మీ బావగారి సంగతి అంతే ఉదయం 9గంటలకు వెళ్లి సాయంకాలం 7గంటల తర్వాతగాని యిల్లు చేరరు. ఆ సమయంలో నేను యింటిలో లేకుంటే ఏం బాగుంటుంది చెప్పు. అక్కడికి ఆదివారం రోజున లేక ఏదైనా సెలవురోజున చరిత గారితో కలిసి ఎక్కడికైనా వెళ్లవలసి ఉంటే వెళ్లు. ఇంటిలో నేను చూసుకుంటానంటారు. ఉదయం పదకొండు గంటల నుండి సాయంకాలం నాలుగు గంటల వరకు వుండే వాటికి నీతోకలిసి తప్పక వస్తూ ఉంటాను కదా! అలాంటివి నాకు యిష్టమేనన్న సంగతి నీకు తెలుసు కదా!

చ: నిజమేననుకో మంచి కార్యక్రమాలను నీవు చూడలేకపోయావన్న బాధతో అలా అన్నాను. అపార్థం చేసుకోకక్కా. అలాంటిదేమీ లేదు. పిచ్చి పిచ్చిగా ఆలోచించుకొని మనసు నొచ్చుకోకు.

వారివురు అలా మాట్లాడుకుంటూ ఉండగానే పోచమ్మ వచ్చింది. తలకు కట్టు కట్టి ఉంది. కట్టు సంగతి సుశీలకు తెలుసు కానీ చరితకు తెలియదు. తరచూ వస్తూ ఉండటం వలన పోచమ్మతో కూడ చనువు ఏర్పడింది. పోచమ్మని చరిత తలకు కట్టు ఎందుకు కట్టుకున్నావని అడిగింది.

పోచమ్మ: దెబ్బ తగిలిందమ్మగారూ.

చ: ఎట్లా తగిలింది? జారి ఏ రాయి మీదనన్నా పడ్డావా?

పో: వాడు కట్టె పేడుతో కొట్టిండు.

చరితకు వాడు కొడుకా? లేకా పెనిమిటీ? అర్థం కాక సుశీల వైపు చూచింది. సుశీల సంగతేంటో చెప్పింది. మామ చనిపోయాడని పోచమ్మ పూరువెళ్ళిందని చెప్పానుకదా? దినవారాలయిన తర్వాత పోచమ్మ భర్త యిల్లు అమ్ముతానన్నాడంట. పోచమ్మ అమ్మవద్దని ఎదురు తిరిగిందంట. యిరువురి మధ్య నాలుగయిదు రోజులు ఘర్షణ జరిగింది. ఎంతకూ పోచమ్మ వినకపోయేసరికి కోపమొచ్చి పేడుతో తలపై కొట్టటానికి పైకి ఎత్తాడంట. తెలివిగా పోచమ్మ తలను పక్కకు వంచితే జారి చెవుపైన దెబ్బతగిలింది. నాలుగయిదు కుట్లు పడినవట అని చెప్పింది. అది విన్న చరితకు కోపం రాలేదా? అదే దెబ్బ తలపైన తగిలితే తల రెండు చెక్కలయ్యేది. పోచమ్మతో, పోచమ్మా విన్న నాకేకోసం వచ్చింది. మరినీకు కోపం రాలేదా? నీ బిడ్డల గతి ఏమయ్యేది అని అడిగింది. దానికి పోచమ్మ..........

పో: ఏమిసేతునమ్మగారు. రకతం బలబలకారింది. పొల్లగాండ్లు ఏడ్చుపట్టిరి. నేను ఏడబడితి. ఏదో ఆడోళ్ల సంగమంట. ముగ్గురు, నలుగురు ఆడోరు వచ్చింద్రు. పోలీసుటేసన్‌కి తొల్కపోతం రమ్మనింద్రు. మా అయ్య, అన్నలు పోలీసోల్ల సుద్ది మన కొద్దనింద్రు. జల్దీ దవాఖానాకు పోవాలనింద్రు.

చ: దవాఖానాకు ఎవరు తీసుకెళ్లారు?

పో: ఆడే, కొట్టినోడే తోల్కపోయిండు. పయివేటు దాంట్లో సేర్చుకోమనింద్రు. దబ్బులిచ్చి సర్కార్ దవాఖానాలో సేర్పించిండు. మందులకు కరుసు సేసిండు. ఇంటికి తోల్కవచ్చిందన్క నాతోనే ఉండిండు.

చ: సర్కార్ దవాఖానాలో చేరావుకదా? డాక్టర్‌ని అడిగి సర్టిఫికేట్ తీసుకొని యింటికొచ్చిన తర్వాతనన్న పోలీస్ స్టేషన్‌కు వెళ్లి దరఖాస్తు పెడితే నీ పెనిమిటి జైలులో కటకటాలు లెక్క పెడుతుండేవాడు ఈ పాటికి.



పో: గసువంటియన్ని మాలాంటోల్లకు ఎరికవుతాయా?

చ: ఆడవాళ్ల సంఘం వారు వచ్చారని నీవేకదా చెప్పావు. వాళ్ల దగ్గరకు వెళ్లవలసింది.

పో: గట్లాంటివి మా కులపోలల్లో సెల్లవండి, కుల పెద్దోల్లు సెప్పినట్లు యిన్కొవాలి 'నీ మొగుడేగా కొట్టిండు, ఏదో కోపంలో కొట్టినా మల్ల ఆడే తోల్కపోయి నయం సేయించుకొచ్చిండుగందా. మొగుడు పెల్లాలన్నాక, తిట్టుకోకుండా, కొట్టుకోకుండా ఏడనన్న జరుగుద్దా? ఏడనన్న సూసినామా?" అనబట్టింద్రు.

చ: మరి యిప్పుడు బాగుంటున్నాడా?

పో: యాడుండిండు. ఇంటికి తొల్కవచ్చినాన్క నేను పట్నం (హైదరాబాద్) పోతనన్న. పదేను దినాల కొత్తనని సెప్పివస్తి. నెలదినాలు అయిపోయె. నేను పట్టుకున్న యిల్లు వున్నయో? ఏరినన్న పెట్టుకున్నరో. పెట్టుకుంటె మల్ల కొత్త యిల్లు పట్టుకోవాలన్న తాను కూడా వస్తననిండు. నీవు జల్ది నడసలేవు. ముంగాలనే బస్సుఎక్కేకాన్కిపో. ఎనకాతనేనొత్తననిండు. బస్సు వచ్చిందన్క చూసిన. రానేదు. ఒక్కదన్నే వస్తిని.

చ: ఇప్పటికైనా వచ్చిండా?

పో: యాడొచ్చిండు దానికాన్కి పోయుంటడు.

చ: దేనికాడికి?

పో: పట్నమొచ్చినాన్క యిండ్లు కట్టేసోటున పనిలో సేరిండు. అక్కడే మరో దానిని మరిగిండు. దాని తానేఉంటడు. గప్పుడప్పుడు తేప వచ్చిపోతుంటడు.

చ: నీవు ఎందుకురానిస్తున్నవు?

పో: ఇంటిలోని కచ్చినన్క ఎట్ల పొమ్మందు? ఎట్ట ఎల్లగొట్లేది? మా వూల్లలల్లో చానమంది గిట్లనే వుంటరండి.అని పోచమ్మ తన పని చేసుకొని వెళ్ళిపోయింది.

చ: సుశీలక్కా! చూశావా! గృహ హింస చట్టం ఎంత చక్కగా అమలు జరుగుతున్నదో? ఆ చట్టాన్ని గురించిన అవగాహన గ్రామీణ మహిళల్లో గాని,పట్టణ మహిళల్లో కలుగజేయటానికిగాని ప్రభుత్వ పరంగా ఏలాంటి కార్యక్రమాలు యింతవరకు చేట్టలేదు. పోలియో చుక్కలు వేయించుకోమని, ఎయిడ్స్ వ్యాధి గురించి చేసిన విధంగా టి.వి.లలో, సినిమాలలో, పత్రికలలో ప్రకటనల ద్వారా ప్రచారం చేయడం లేదా, ఇందిరమ్మ ఇండ్లని, రాజీవ్ గృహ కల్ప అని పత్రికల్లో, టివిల్లో ఊదరగొట్టడంలేదా? ఆ విధంగా చేస్తే కొంతలో కొంతైనా మహిళలు 'గృహ హింస'ను గురించి తెలుసుకో గలుగుతారు. అలా చేయకపోగా ఆ చట్టంలో లొసుగులున్నవని, దాని ఆధారంగా అనర్థాలు జరిగే అవకాశలున్నవని ప్రచారం గృహ హింస చట్టం కన్న ఎక్కువ జరుగుతుంది. దానికి విధానసభలో వున్న మహిళా మంత్రి గారు పునరాలోచిస్తామని, అవసరమైతే సవరణలు చేస్తామని అన్నారని ఈ మధ్యనే పత్రికలో చదివా.

సు: ఇంతకన్నా సిగ్గుచేటు యింకొటి ఉండదు. పోచమ్మలాంటి వాళ్లు మొగుడుకు కొట్టే అర్హత వున్నది. పెళ్లాం తన్నులు తినక తప్పదని అంటేఅర్థం చేసుకోవచ్చు. మూసి ఉన్న తలుపులను తెరవవచ్చు. తెరిచి వున్న తలుపులు తెరవటం వీలవుతుందా?

చ: బాగా చెప్పావక్కా. ప్రజా ప్రతినిధులుగా విధానసభలో ప్రవేశించి, శాసనంలో భాగస్తులయిన విద్యావంతులయిన మహిళామంత్రులు అలా ఎలా మాట్లాడగలుగుతున్నారో? అర్థంకాదు. జనాభాలో సగభాగమైన స్త్రీలకు 33శాతం బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టకుండా ఏవో కుంటిసాకులు చెప్పిదాటవేస్తున్నారు.

సు: జనాభాలో సగభాగమయినపుడు 50% రిజర్వేషన్లు ఉండాలిగామరి?

చ: ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కుతానందంట. 33% యింత వరకు సాధించుకోలేక పోయాం. పది పన్నెండేండ్లు పోరాడి సాధించుకున్న గృహ హింస చట్టానికి బాలారిష్టాలు మొదలైనవి. నీవేమో 50% దాకా వెళుతున్నావు.

సు: మరి కారణాలేమంటావు? చరిత.

చ: పదవులనలంకిరించిన మహిళా మణులలకు గట్టాగా మాట్లాడితే పదవులూడిపోతాయన్న భయము ఒకటి. అన్ని సమస్యలకు సూదంటు రాయిలాగ రాజకీయం ఆకర్షిస్తూ ఉంది. అన్నిటికంటే ముఖ్యమైనది సమాజంలో పురుషాధిక్యత.

సు: కొండవీటి చాంతడులాగ యిది పూర్తయేలాగ లేదుగాని, ఎల్లుండి ఎన్ని గంటలకు తయారుగా ఉండను.

చ: నిన్ను చాలా విసిగించినట్లున్నానక్క

సు: అదేమీలేదు. చిన్న దానివైనా తెలియని విషయాలు ఎన్నో చెప్పావు. విసిగించలా. అనవసరంగా మనసు నొచ్చుకోకు.

చ: మన యిద్దరి మధ్య అలాంటి అపార్థాలు ఉండవుకద అక్క ఎల్లుండి నాల్గు గంటలకు బయలుదేరుదాము. రెండు బస్సులు మారి వెళ్లేసరికి సమయానికి చేరుకోగల్గుతాము.

సు: పిల్లలకు కూడ వారం రోజులు సెలవులొచ్చినయి. తప్పక అన్ని రోజులు వెళదాం.

చ: మరి నే వెళ్లొస్తానక్కా.

సు: మంచిది చరిత. అని సాగనంపి వీధి తలుపు వేసుకొని లోపలకొచ్చింది.

*

# వేలంపాటలో అక్షరకత్తె...తస్లీమా

- శిలాలోలిత

ఆమె
ఒక నిప్పుకణిక
మాట్లాడడమే నేరమంటూ
శ్వాసించడమే నిషేధమైన చోట
స్వేచ్ఛ ఊసే 'అనకొండై'న చోట
మత మౌఢ్యమే రాజ్యమేలుతున్న చోట

ఆమె
ఒక స్ఫటికంలా వెలుగై నిలిచింది
చీకటి సమాజానికి ప్రశ్నలా నిలిచింది
అక్షరాల కత్తుల్ని పేర్చుకుంటూ
విస్ఫులింగాలను విస్తరింపజేసింది

ఆమె
ఓ స్వేచ్ఛా పతాక
అద్భుత భావ వీచిక
'లజ్జ'ను జీర్ణించుకోలేక ఉన్మాదులైనారు

ఆమె
ఒక జలపాతం
తానొక విద్యుత్తుననుకొంటుంది
బండరాళ్ళను నునుపు చేస్తూ మెరిపిస్తుంది
నిరంతరం పారే తాను
స్వచ్ఛతకు నిలయమనుకుంటుంది
అసమ సమాజ దుర్నీతిని
పొరలు పొరలుగా ఒలిచింది

ఆమె
ప్రపంచమంతా కాంతి రేఖలా వెలిగింది
ఆలోచన జ్ఞాన దీపాన్ని దిక్సూచిలా చేసింది
'సఖరోవ్' లాంటి అవార్డులెన్నెన్నో తీసుకొని
తట్టాబుట్టా సర్దుకుంటూ
ఒకోసారి కట్టు బట్టలతో
తీరాల వెంట, దూరాల వెంట
వలస వేటును కొనసాగిస్తోంది

అమెరికా, జర్మన్, స్వీడన్, భారత్‌లలో
కూసింత జాగా కోసం, నీడకోసం
గాలిపీల్చడం కోసం
బుక్కెడన్నం తినడం కోసం
నక్షత్రంగా వెలిగిన ఆమె
మానవ నక్షత్రాల కోసం
అవిశ్రాంత తీరానికి నిలయమైన
శరీర వేదికను మార్చుకుంటూ వెళ్తోంది

ఆమె
వైద్యాన్ని విడనాడి
ప్రజలే కావాలనుకుంది
ఏ జనం కోసం ఆమె పరితపించిందో
ఏ స్వేచ్ఛ కోసం అక్షరాయుధాన్ని మలుచుకుందో
సాహితీ లోకానికంతటికీ తెలుసు

ఇన్నాళ్ళూ, బతుకు శిల్పంలో
భయం 'ఉలి' లేని ఆమెను
నిర్భయంగా మత మృత్యువు 'ఫత్వా' జెండా పట్టుకుని
ఆమెతో ప్రతి అడుగులోనూ కలిసి నడుస్తోంది
'సాల్మన్ రష్దీ' మానసిక క్షోభ
'తస్లీమా'కు బట్వాడయింది
'జకియా జాకి' మృత్యుహస్తం
వెన్నుపామై జరజరా పాకుతూ నిలదీస్తోంది
ముల్లాలు, జన సమూహాలు
బూతుల, కూతల, కోపాగ్నుల ఉరితీతలై
సంక్షుభిత నిలయం చేస్తున్నాయి.

ఆమె
భారత్ మీద విశ్వాసంతో
కలకత్తా మీద కొండంత నమ్మకంతో
హైదరాబాదు మీద గౌరవంతో
మత సామరస్యాల కూడలి అనుకొంది.

తొలిసారిగా ఆమె కళ్ళల్లో
ఆశ్చర్య భయాలను చూశాను
విస్మయ కేంద్రమైంది ఆమె

అద్భుత రచనా సృష్టిని చేసిన
ఆమె తల వేలం పాటైంది
కోయిల గానం వినసొంపు కాదందరికి

ఉన్మాదానికి బహురూపాలు
పిచ్చివాళ్ళ ఊరేగింపు బయల్దేరింది
రాళ్ళూ రప్పలతో, మారణాయుధాలతో
మతాధికార ముద్రతో
ప్రభుత్వాల మౌనంతో
సున్నితమైన సమస్యలకు
దూర దూరమైన పదవీ వ్యామోహులతో
పైగా,
ఆడదానిపై యుద్ధం చేయడం వేడుకే వేడుక
కాస్త.......దారిఇవ్వండి..
పిచ్చివాడి చేతిలో రాయి ఎటైనా రావచ్చు
నువ్వూ నేనూ భద్రం అనుకుని
తలుపులు మూసేసుకున్నాం కదా!
ఉన్మాదులకు ఇవేమీ అడ్డం కావు
ఒక అశ్రుతర్పణం మినహా
ఒక ఉద్వేగ భరిత ఉపన్యాసం మినహా
ఏమీ చేయలేని మనం
మానులం
మనతోటి అక్షరకత్తెను
విహ్వలంగా చూడడం మినహా

మనసా...
నన్నింకా మనిషిగా మిగల్చకు
ఏ ఆర్ద్రతా అంటని బండరాయిని చేయి
ఆ విప్లవ వీరవనిత
ఏమౌతుందో తెలీదింకా?
క్షమించు సఖీ..క్షమించు
ఈ క్షమార్హురాలిని నీవైనా క్షమించు.

క్రీస్తులా చిరునవ్వు నవ్వు
'సద్దాం హుస్సేన్'ధిక్కారంలా విజయగర్వంతో నవ్వు.
మాలో ఆలోచనా దీపాంకురమైనందుకు నవ్వు
చెదరని ఆత్మ విశ్వాసంతో ప్రపంచ విజేతలానవ్వు
నీ ప్రతి అక్షరం
'ఏకలవ్యుల' అక్షరాలకు నాందే సుమా!

# సూరిడుకంటేముందే

## పాట

సూర్యుని కంటే ముందే
మీ ఇంట్లో మొలిసేము
ఇల్లూవాకిలంతా
మిరుమిట్లై మెరిసేము

అనుపల్లవి:-కాలుతున్న కొవ్వొత్తులం.....(మేము)
రాలుతున్న పూల గుత్తులం
మనుషులం పని మనుషులం
మేము కామామనుషులం

॥సూరిడు॥

చరణం :-అదేపనిగ అంట్లు తోమితే పడతాయి పుండ్లు
యాసిడ్ తో దొడ్లు కడిగితే మండుతాయి కండ్లు
డిజర్జెంట్ సబ్బుతో చర్మ మూడును పొట్టు
దులుపుతున్న దుమ్ముధూళితో రాలుతుంది జుట్టు

॥సూరిడు॥

2. ఊడుస్తున్న తుడుస్తున్నా వెన్నులోన కలుకు
ఎడతెగని సలుపులతో పట్టదయ్యా కునుకు
ఎక్కె మెట్టుదిగే మెట్టుతో పట్టుకుంటాయి పిక్కలు
పనిలో ఇంతతేడా వస్తే మాకు కానవస్తే చుక్కలు

॥సూరిడు॥

3. మాకు మా పనికి తప్పక ఉండాలి గుర్తింపు
కార్మికుల హక్కులు అన్ని అవ్వాలి వర్తింపు
జీతాలే జీవితాలని నిర్ణయించురోజుల్లో
వేతనాలు పెంచకుండా ఉంచుతారా చీకట్లో

॥సూరిడు॥

- దేవేంద్ర

# తేరాలు మారినా....

-ఎన్. పద్మాంజలి

'అత్తయ్య గారూ ఇదిగోండి మొత్తం ఇరవై మూరల పూలు, అందిరికీ ముక్కలు చేసి మీరే ఇవ్వండి' అని అత్తగారి చేతిలో పెట్టింది స్వరాజ్యం. పెరట్లోని మొక్కలకు పూసిన పూలను కోసి తాను మధ్యాహ్నం నుండి కడుతూనే ఉంది. స్వరాజ్యంకి అత్త, మామ,చిన్నపుడే భర్త చనిపోయి పుట్టింటికి చేరిన మామగారి అక్క మంచంలో ఉన్న మామగారి తల్లి, నలుగురు పెళ్ళికాని ఆడపడుచులు, ఇద్దరు బావగార్లు, తోడికోడళ్ళు, ఇద్దరు పెళ్ళికాని మరుదులతో సాగే ఉమ్మడి కుటుంబం. తలా ఒక పని చేస్తున్నప్పటికి స్వరాజ్యంకి ఎడతెరపిలేని పని, వంచిన నడుము ఎత్తకుండా ఇల్లు వాకిళ్ళు శుభ్రం చేయటం, మొత్తం మీద వచ్చిపోయేవారితో ఉన్న ఆ ఇంట్లో యాభైమందికి తక్కువగాకుండా ఉండేట్లు వంట వార్పు చేయడం స్వరాజ్యం విధి. "రాజ్యం లే" అంటూ ఒళ్ళు పులిసిపోయి నిద్రాదేవి ఒడిలోకి జారుకుంటున్న స్వరాజ్యం నడుము చుట్టు బలంగా పడిన చేతి వాటానికి చిటుక్కున మేల్కొని 'నావల్ల కాదండి, వళ్ళంతా పచ్చి పుండులా ఉంది. సర్దుకు పొండి, రేపుచూద్దాం" అంటూ భర్తని వారిన్తానే డీప్ స్లీప్‌లోకెళ్ళిపోయింది స్వరాజ్యం.




మా వాడు పెళ్ళికాక ముందు సలక్షణంగా ఉండేవాడు. ఈ మహాతల్లి వాడిని నిర్లక్ష్యం చేసింది. అందుకే వాడు ఆ సాని కొంపట్టుక తిరుగుతున్నాడు" నోరంతా జాపి ఇంటికొచ్చిన వారందరికీ చాడీగా చెప్తోంది అత్తగారు, తప్పంతా తనదే అయినట్లు స్వరాజ్యాన్ని నిందిస్తోంది. ఇలా అవుతుందని స్వరాజ్యం అనుకోలేదు. ఉమ్మడి సంసారం బోలెడంత చాకిరి, సనాతన కుటుంబం, మడి దడీ అంటూ కొన్ని రోజులు, ఒళ్ళలిసిపోయి చాకిరితో మరికొన్ని రోజులు భర్తకి దూరంగా ఉండటం వల్లనే ఇలా జరిగిందని స్వరాజ్యంకి బాగా తెలుసు. తన అవస్థకి తనే క్రుంగిపోయింది. అందుకే భర్తని నిందించలేదు. నా చిన్నారి తల్లినైనా ఇలా ఉమ్మడి సంసారంలో ఇవ్వకూడదు" అని గట్టిగా నిర్ణయించుకుని తన ప్రక్కనే పడుకుని ఉన్న తన గారాల కూతురు 10సం॥ల రూపని తలనిమురుతూ గట్టిగా ముద్దాడుతూ అనుకున్నది.

ఉండడ్రా! మీ గోలతో చస్తున్నాను. ఇంటి పని, మీపని నేనొక్కర్తినే చేస్కోలేక ఛస్తున్నాను. అదే నా చిన్నపుడు మా అత్తలు, పెద్దమ్మలు మా పని చూసేవారు." అని విసుక్కుంటూ గొణుక్కుంటూ, భర్తకి, పిల్లలకి ఆఫీసుకు, స్కూళ్ళకు క్యారేజిలు కట్టే హడావిడిలో తెగ కంగారు పడిపోతూ ఆదుర్దా పడుతున్నది రూప. రూపకి పట్నంలో ఉద్యోగస్థుడితో వివాహం. వెనుకా ముందు ఎవరూ లేరు. ఒంటరి కాపురం. ఎప్పుడైనా రూప బంధువులు వస్తే రెండు గదుల ఆ చిన్న ఇంట్లో ఉండలేక ఓ గంట ఉండి వెళ్ళిపోతున్నారు. రూప భర్త శ్యాంకి కోపం ఎక్కువ. ఐనా భార్య, పిల్లలంటే అమితమైన ప్రేమ. ఓ రోజు పార్టీ అని చెప్పి కొత్తగా తాగి ఇంటికి వచ్చాడు. రూప అరిచి గోల చేసింది. "ప్లీజ్, అరవకు ఇంకోసారి తాగను" అని మాట ఇచ్చాడు. ఒక రోజు ముద్దు, మరో రోజు ముద్దు, అదే పనిగా అలవాటైపోయింది శ్యాంకి. భార్యని కొట్టని రోజులేదు. పిల్లలకి తన చేత్తో ఫీజులు కట్టి ఎన్నాళ్ళయిందో. రూప తన కష్టాలను దిగమింగుకుని చదివిన వానా కాలం చదువుకే ఓ కాన్వెంటులో టీచరుగా చేరి సంసారాన్ని వెళ్ళదీస్తున్నది. రోజుకొక్కసారైనా ఈ మధ్య మనసులో అనుకుంటున్నది రూప. నా చిన్నపుడు మా తాత, జేజమ్మ వాళ్ళు నాన్న చొక్కా పట్టుకుని ఈడ్చుకు వచ్చి మా అమ్మకి అప్పచెప్పారు. కానీ ఈ రోజు ఆయనకు భయం లేదు. అలా చేసే దిక్కే నాకు లేదు" అని వగచుతూనే రోజులు వెళ్ళతీస్తున్నది. రూప కష్టంతో చదువుకుని వృద్ధిలోకి వచ్చారు ఆమె మగ పిల్లలిద్దరూ. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లయి రెండు చేతులా సంపాదిస్తున్నారు. రూప భర్త శ్యాం ఆరోగ్యం బాగా క్షీణించి ఇపుడు త్రాగటం మానేసి బుద్ధిగా ఉంటున్నాడు. అతనికి సేవలు మాత్రం రూప చేయకపోతే అతని పని ఖాళీనే.

"యువరానర్ నా క్లయింటుకు అతని భార్యతో సుఖం లేదు. అందుకే విడాకులు కోరుతున్నాడు" అని కోర్టులో గట్టిగా మాట్లాడుతున్నాడు రూప 2వ కొడుకు సుధీర్ తరుపు వకీలు. సుదీర్ అన్న రణధీర్ అమెరికాలో ఉంటున్నాడు. అక్కడ జరిగిన పెళ్ళి దాచిపెట్టి తల్లి చెప్పిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. అమెరికా తీసుకువెళ్ళి ఆ అమ్మాయిని చిత్ర హింసలు పెట్టాడు. రూపకి ఈ విషయం తెలిసి ఆ అమ్మాయిని జాగ్రత్తగా ఇండియాకి రప్పించి ఆమె తల్లిదండ్రులకు అప్పగించింది. తల్లి చంపేస్తుందన్న భయంతో రణధీర్ ఇండియా మొహం చూడనని కుటుంబాన్ని వదిలేసుకున్నాడు. ఇపుడు సుదీర్ భార్య ఉదయం ఏడుగంటలకెళ్ళి రాత్రి పది గంటలకొస్తుంది. ఆమె కూడా అతనితో సమానంగా చదువుకున్నది. అంతే జీతం పొందుతున్నది కూడా. కానీ సుదీర్‌కి అనుమానం. ఆమె ఎవరితో చనువుగా ఉన్నా అనుమానం. పైగా ఆమె బస్‌ల్లో ప్రయాణం చేసి వచ్చి ఇంట్లో వండుకుని తిని పడుకునే సరికి నిద్ర ముంచుకొచ్చేది. సుధీర్ సూటిపోటి మాటలతో కొంత, అలసిపోయి కొంత భర్తకి దూరంగా ఉండటంతో ఆమెకి ఎవరితోనో అక్రమ సంబంధలున్నాయని ఇంట్లోంచి వెళ్ళగొట్టి కోర్టులో కేసు ఫైల్ చేశాడు.

ఆనాడు స్వరాజ్యం సుఖపడలేదు. నిన్న రూప సుఖ పడలేదు. నేడు సుధీర్ భార్యకి మనశ్శాంతి లేదు. తరతరానికి కుటుంబ వ్యవస్థలో ఎన్నో మార్పులు వచ్చాయి. కానీ ఆడదానికి మనశ్శాంతి లేదు. పురుషాధిక్యతలో మార్పులేదు. ఏ మహానుబావుడు మళ్ళీ జన్మిస్తాడు? బాల్య వివాహాలు, సతీ సహగమనం, కన్యాశుల్కం రూపు మాసిపోయినట్లు ఈ పురుషాధిక్యత రూపుమాసిపోయే రోజు కోసం యావత్ ప్రపంచ స్త్రీలంతా వేయి కళ్ళతో ఎదురు చూస్తూ తమ వంతు కృషిగా ఓ చిన్ని పోరాటం చేస్తే తప్పులేదు. పోయేవి ఆమె కడగళ్లే తప్ప. ✡

# బడ్జెట్‌లో ఏదీ మా వాటా?

-టి. జ్యోతి

"లక్ష కోట్ల రూ॥ల బడ్జెట్‌ను మన ఆర్థిక శాఖామాత్యులు రోశయ్య గారు ఫిబ్రవరి 16వ తేదిన అసెంబ్లీలో ప్రవేశపెట్టారు. ఎవరికి వారు అన్ని తరగతుల ప్రజలు లక్ష కోట్ల రూ॥ల బడ్జెట్‌లో ఏదీ మా వాటా? అని వేయి కళ్లతో వెతుక్కున్నారు. ప్రజా సమస్యల పరిష్కారం కోసం కేటాయింపులు వుంటాయోమోనని ఆశపడ్డారు. అడుగడుగునా సమస్యల సుడిగుండంలో చిక్కుకున్న ప్రజానీకానికి ఈ బడ్జెట్ నిరాశనే మిగిల్చింది.

ఐద్వా టి.జ్యోతి, పట్టణ పేదల సంక్షేమ సంఘం పి.వి. శ్రీనివాస్, డివైఎఫ్ఐ భాస్కర్, ఆవాజ్ నాలుగు సంఘాల ఆధ్వర్యంలో ఫిబ్రవరి 6వ తేదిన ఆదిలాబాద్ నుండి జాతా ప్రారంభమైంది. ఆదిలాబాద్, కరీంనగర్, నిజామాబాద్, మెదక్, రంగారెడ్డి జిల్లాల నుండి సాగి 12వ తేది గ్రేటర్ హైదరాబాద్‌లోకి ప్రవేశించింది. 25 మున్సిపాలిటీల్లో 1200కి.మీ. పర్యటించి, 42 కేంద్రాల్లో బహిరంగసభలు నిర్వహించింది. (అనునిత్యం ప్రజలతో ఉంటూ, ప్రజా సమస్యలపై పనిచేసే ఈ సంఘాలు బడ్జెట్‌లో వాటాకై కొన్ని డిమాండ్లను రూపొందించుకుని ప్రజల ముందుకు వెళ్తే, ఆ డిమాండ్లు సరియైనవేనని ఢంకా భజాయించి చెప్పారు.) ప్రజలను పలుకరించి, వారి సమస్యలను తెలుసుకోవడంతోపాటు, వివిధ సమస్యలపై వారిచ్చిన పిటిషన్స్‌ను తీసుకుంది. బడ్జెట్‌లో వాటాకై సాగిన ఈ జాతాలో వ్యక్తమయిన ప్రజా సమస్యలను స్థూలంగా పరిశీలిస్తే...

**ఇళ్ళ స్థలాలు, నిర్మాణం:-**

తల దాచుకోవడానికి ఇంత గూడు కావాలని, ప్రతి పేద కుటుంబానికి 60 గజాల స్థలం కేటాయించమని 6 నెలల పోరాటం చేసాము. ఎండకు ఎండి వానకు తడిచి, పోలీసుల లాఠీలు, కేసులు, జైళ్లు, ప్రభుత్వం వైపు నుండి అన్ని రకాల నిర్బంధాలు ఎదుర్కొంటున్నాము. మరి ఈ లక్ష కోట్ల రూ॥ల బడ్జెట్‌లోనైనా ఇళ్ల స్థలాలు, నిర్మాణం కోసం ఏమైనా కేటాయించారా"? అని ఆశగా అడుగుతున్నారు. పట్టణాలకు దూరంగా నిర్మిస్తున్న రాజీవ్ గృహ కల్ప ఇళ్ల దగ్గరికి తీసుకెళ్లారు. 'పడుకుంటే తల లోపల, కాళ్లు బయటకు వచ్చే ఈ అగ్గి పెట్టెల్లాంటి ఇళ్లలో మేము నివసించేదెట్లా'? అని నిగ్గదీస్తున్నారు.

ప్రభుత్వం పంచరంగుల్లో ప్రచారం చేసుకుంటున్న ఇందిరమ్మ ఇళ్ల సొగసును చూపించారు. పునాదుల్లో ఆగిపోయినవి కొన్నైతే, పునాదుల వరకు వచ్చినవి, కప్పులు లేని ఇళ్లు. ఇవి ఇందిరమ్మ సంబడాలు. ఇళ్ల నిర్మాణానికి అప్పులు తెచ్చి, వడ్డీలు కట్టలేక, మానసిక వత్తిడితో ఆసుపత్రి పాలవుతున్న తీరునూ వివరించారు.

పట్టణాలలో పెద్ద సంఖ్యలో నివసించే అసంఘటిత రంగ ప్రజలు, చేసే కష్టంలో వచ్చిన డబ్బును ఇంటి కిరాయి కట్టడానికే సగానికి పైగా పొయ్యాల్సి వస్తుందని ఏకరువు పెట్టారు.

పట్టణాల చుట్టు ప్రక్కల ఉన్న ప్రభుత్వ భూములను, కార్పొరేట్




సంస్థలకు, పెట్టుబడిదారులకు అమ్ముకొని ప్రభుత్వం తన ఆదాయాన్ని సమకూర్చుకుంటుందట. అని చెప్పినపుడు పట్టణ పేదలు, మహిళలు ప్రభుత్వాన్ని దుమ్మెత్తిపోస్తున్నారు.

**అధిక ధరలు:**

పట్టణ మధ్య తరగతి, పేదలు ముక్త కంఠంతో ఆందోళనగా ప్రశ్నిస్తున్నది అధిక-ధరల సంగతి. బియ్యం, పప్పులు, నూనె, కూరగాయలు ఒకటేమిటి, అన్ని నిత్యావసర వస్తువుల ధరలు ఆకసాన్నంటుతున్నాయి. ఏం కొనేట్టు లేదు, ఏం తినేట్టు లేదు. పిల్లలకు తిండైనా పెట్టలేకపోతున్నాము అని మహిళలు వాపోతున్నారు. ధరలు అడ్డు, అదుపు లేకుండా పెరుగుతూ ఉంటే ప్రభుత్వం ఏం చేస్తున్నట్లు అని ప్రశ్నిస్తున్నారు.

**నత్తనడకన ప్రజా పంపిణీ వ్యవస్థ:-**

పెరిగిన రేషన్ కార్డులకనుగుణంగా రేషన్ కోటా పెంచకపోవడంతో పేదలు ఇబ్బంది పడుతున్నారు. ముఖ్యంగా కిరోసిన్ కోతతో మహిళలు దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. కుటుంబానికి 3 లీటర్లకు మించి ఇవ్వడం లేదు. తూకం వేస్తే 2 లీటర్లే ఉంటుంది. రెక్కాడితే డొక్కాడని పేద ప్రజలు డబ్బులు కూడగట్టుకొని నెలలో రెండవ వారం రేషన్ షాపుకు వెళితే సరుకులు అయిపోయాయని వెనక్కి పంపుతున్నారు. రేషన్ షాపుల్లో ఉండాల్సిన నీలి రంగు కిరోసిన్ బయట కిరాణాషాపులలో దర్శనమిస్తూ ఉంది. నాసిరకం బియ్యం ఇస్తున్నారు. పెరిగిన జనాభాకు అనుగుణంగా రేషన్ షాపుల సంఖ్య పెరగలేదు.

**కనీస సౌకర్యాలకు నోచుకోని పట్టణాలు:-**

మున్సిపల్ పట్టణాలన్నింటా రోడ్లతోపాటు డ్రైనేజి వ్యవస్థ అస్తవ్యస్థంగా ఉంది. రోడ్లపై పారుతున్న మురికి, దోమలతో పేదలు సహజీవనం చేస్తున్నారు. అంటురోగాలు విజృంభిస్తాయని భయపడుతున్నారు. మార్చి నెలలోనే ఎండలు మండుతున్నాయి. నల్లాల్లో నీరు రావడం లేదు. బోరింగ్‌లు పాడై నీటి కోసం అల్లాడుతున్నారు. పబ్లిక్ నల్లాలకు నీటి మీటర్లు బిగిస్తున్నారు. మున్సిపల్ ఆఫీసుల చుట్టూ తిరుగుతూ ఉన్నాము. ప్రాణాధారమైన రక్షిత మంచినీటి కోసం బడ్జెట్‌లో నిధులు కేటాయించారా? అని అడుగుతున్నారు. ప్రజా ప్రతినిధులు, మంత్రులు వచ్చినపుడు మాత్రమే వెలిగే వీధిలైట్లు, పట్టణ ప్రజలపై పెరుగుతున్న భారాలు, ఆస్తిపన్ను, భవనాల క్రమబద్ధీకరణ పేరుతో డబ్బులు దండుకోవడం దృష్టికి తెచ్చారు. బడ్జెట్‌లో మున్సిపాలిటీల వాటా ఎంత అని అడుగుతున్నారు.



**పింఛన్ల కోసం ఎదురుతెన్నులు:-**

70 సం॥లు దాటిన వృద్ధులు, చిన్న వయస్సులోనే భర్తను కోల్పోయి కుటుంబ భారాన్నంతా వోనస్తున్న యువతులు, వికలాంగులు, పింఛన్ల కోసం అప్లికేషన్లు పెట్టుకొని 5,6 సం॥ల నుంచి ఆఫీసుల చుట్టు తిరుగుతున్నారు. కేంద్ర ప్రభుత్వం 400రూ॥లు పింఛన్ ఇవ్వాలని నిర్ణయిస్తే రాష్ట్ర ప్రభుత్వం 200రూ॥లు మాత్రమే ఇచ్చి చేతులు దులుపుకుంటుంది.

చేనేత కార్మికుల ఆకలి చావులు, ఆత్మహత్యలతో ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్దికెక్కిన సిరిసిల్లలో భర్తలను కోల్పోయిన మహిళలు, ప్రభుత్వం ప్రకటించిన ఎక్స్‌గ్రేషియా రాక ఆఫీసుల చుట్టు తిరుగుతున్నారు. డబ్బుల కోసమే ఆత్మహత్యలు చేసుకుంటున్నారని మాజీ ముఖ్యమంత్రి సెలవిస్తే, సామాజిక మానసిక రుగ్మతగా ప్రకటించి నేటి ప్రభుత్వం చేతులు దులుపుకుంది.

**అత్యంత దుర్భర స్దితిలో ముస్లిమ్ మైనార్టీలు:-**

పట్టణాలన్నింటా 10% నుండి 20% వరకు వున్న ముస్లిమ్ మైనార్టీలు, బస్తీల్లో కనీస సౌకర్యాలకు నోచుకోక, అత్యంత బీదరికాన్ని అనుభవిస్తున్నారు. ముస్లిమ్‌లు నివసించే బస్తీలు అభివృద్ధికి ఆమడ దూరంలో ఉన్నవి. సంక్షేమ పథకాలు వీరి వరకు రావడం లేదు. సచార్ కమిటి నివేదిక ముస్లిమ్ ప్రజల జీవన స్దితిగతులను తేటతెల్లం చేసింది. ఉర్దూ స్కూళ్లు లేవు. టీచర్లు లేరు. మదరసాలలో కనీస సౌకర్యాలు లేవు. మరి ముస్లిమ్ మైనారిటీల అభివృద్ధికి బడ్జెట్‌లో కేటాయింపులెక్కడ?

**పావలా వడ్డీ కోసం, ఎదురు చేస్తున్న పొదుపు గ్రూపులు:-**

రాష్ట్ర వ్యాప్తంగా 68 లక్షల స్వయం సహాయ గ్రూపులు వున్నాయి. మహిళా సాధికరతకు ప్రభుత్వం పొదుపు గ్రూపులను ఎరగా చూపిస్తున్నది. గత సం॥ బడ్జెట్‌లో 5,000 కోట్ల రూ॥లు కేటాయించి 76 కోట్ల రూ॥లు మాత్రమే ఖర్చు పెట్టింది. 22% గ్రూపులకు మాత్రమే పావలా వడ్డీ మంజూరైంది. ఈ సం॥ బడ్జెట్‌లో 10,000 కోట్ల రూ॥ కేటాయించింది. ఇందులో ఖర్చు చేసేదెంతో? సాధికారత సాధించేదెన్నటికో?

**మధ్యాహ్న భోజన నిర్వాహకుల కడగండ్లు:-**

ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, జగిత్యాల, సంగారెడ్డి, అన్ని చోట్ల ప్రభుత్వం కేటాయించే దబ్బులతో పిల్లలకు పోషకాహారం ఇవ్వడం ఎలా సాధ్యమని ప్రశ్నిస్తున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా 68లక్షల మంది విద్యార్థులు ఈ పథకం ద్వారా లబ్ది పొందుతున్నారు. ఈసం॥ బడ్జెట్‌లో 250 కోట్లరూ॥లు కేటాయించింది. 600 కోట్ల రూ॥లకు ఈ బడ్జెట్ పెంచితే కాని పిల్లలకు బలవర్ధక ఆహారం అందించలేమంటున్నారు. నిర్వహణ బాధ్యతలను స్వచ్ఛంద సంస్దలకు కాంట్రాక్టర్లకు అప్పజెప్పి ప్రభుత్వం తమ ఉపాధిని లాక్కోవడానికి ప్రయత్నిస్తుందని ఆక్రోశం వెలిబుచ్చారు.

**దిక్కుతోచని అసంఘటిత రంగం:-**

అసంఘటితన రంగం రోజు రోజుకు పెరుగుతూ ఉంది. 96% మంది మహిళలు అసంఘటిత రంగంలోనే ఉన్నారు. బీడి, భవన నిర్మాణ కార్మికులు, గృహకార్మికులు, ఇంటి పనివారు, పారిశుద్య కార్మికులు మొదలగు అనేక వృత్తుల్లో వున్నారు. కనీస వేతనాలు లేక, శ్రమదోపిడీతోపాటు, అవమానాలు, వేధింపులకు గురవుతున్నారు. ఎటువంటి హక్కులు, చట్టాలు వీరికి లేవు. పట్టణాలను సర్వాంగ సుందరంగా, అందరిని అవసరాలను తీర్చే వీరి సంక్షేమానికి బడ్జెట్ కేటాంపులెక్కడ?

**మహిళలకు ఏదీ భద్రత:-**

ఇంటా, బయటా మహిళలపై హింస నిత్యకృత్యమైంది. మహిళలపై పెరుగుతున్న హింసలో మన రాష్ట్రం రెండవ స్దానంలో ఉంది. 2006సం॥లో మహిళలపై నేరాల సంఖ్య 17,646 వుంటే 2007లో 19,929కి పెరిగాయి. ఈవ్‌టీజింగ్, అత్యాచారాలు, లైంగిక వేధింపులు,వరకట్న హత్యలు, పడిపోతున్న స్త్రీ పురుష నిష్పత్తికి పట్టణాలు ప్రధాన కేంద్రాలుగా వున్నవి. మహిళా ఉద్యమం పోరాడి సాధించుకున్న మహిళా కమిషన్ అవినీతికి ఆలవాలమై రద్దు గావించబడింది. గృహ హింస రక్షణ చట్టం అమలుకు, పని ప్రదేశాలలో లైంగిక వేధింపులు అరికట్టడానికి, మహిళల రక్షణకు ప్రభుత్వం తీసుకున్న నిర్దిష్ట చర్యలేవి? బడ్జెట్‌లో కేటాయింపులు ఎంత?

**విచ్చలవిడి మద్యం అమ్మకాలు:**

ప్రభుత్వం మద్యం అమ్మకాలను ప్రోత్సహిస్తున్నది. తాగుడు ఎక్కువ అవడం వల్ల సామాజిక దుష్ఫలితాలు స్త్రీలే ఎక్కువ అనుభవించాల్సి వస్తుంది. ఎక్కుడకు వెళ్లిన మద్యం వల్ల కూలిపోతున్న తమ సంసారాల తీరు తెన్నులను వివరిస్తూ ఉన్నారు. ప్రస్తుతం 7,000కోట్ల రూ॥ ప్రభుత్వానికి ఆదాయం వస్తుంటే దానిని 10,000 కోట్లకు పెంచుకోవాలని ప్రభుత్వ లక్ష్యం. 3సం॥ల క్రితం 80,000వున్న బెల్టు షాపులు 1,50,000కుపెరిగాయి. ప్రజలను మత్తులో వుంచి ప్రభుత్వం తన పబ్బం గడుపుకోవాలనుకుంటుంది. క్రమంగా మద్యం అమ్మకాలను నియంత్రిస్తూ,సంపూర్ణ మద్య నిషేధం వైపు అడుగులేస్తామని చెప్పింది రాష్ట్ర ప్రభుత్వం. రాష్ట్ర మహిళలకిచ్చిన వాగ్దానం నిలుపుకోవడానికి, ఆ దిశగా చర్యలేవి? బడ్జెట్‌లో ఏవీ కేటాయింపులు?

పట్టణాలలో మధ్య తరగతి, పేదలు ముఖ్యంగా మహిళలు సమస్యల విష వలయంలో కొట్టుమిట్టాడుతున్నారు. మన రాష్ట్ర ప్రభుత్వం కోటి మంది మహిళలను లక్షాధికారులను చేస్తామని నిత్యం వల్లెవేస్తోంది. మహిళలు సమాజంలో అంతర్భాగం, ఆకసంలో లేరు. మౌలిక సమస్యలు పరిష్కరించకుండా మహిళా సమస్యలు పరిష్కారాలు కావు.

10వ ప్లానింగ్ కమిషన్ సిఫార్సుల ప్రకారం ప్రభుత్వం ప్రతి మంత్రిత్వ శాఖ పరిధిలో ప్రత్యేకించి మహిళల కోసం 30% నిధులు కేటాయించాలని ఐద్వా డిమాండ్ చేస్తూ ఉంది. బడ్జెట్‌లో తమ వాటా దక్కించుకోవడానికి మార్చి 19న లక్షలాది మంది ప్రజలు హైదరాబాద్ కదిలారు. "బడ్జెట్‌లో వాటా కోసం అసెంబ్లీ బాట" పట్టి లక్షలాది మంది ప్రజలతో జరిగిన బహిరంగసభ ఖచ్చితంగా చారిత్రాత్మకం.

✤

కె. అంజన.

# పాపాయి డైరీ



**అక్టోబర్ 5:**

యా... హూ.... నేను ఇవాళే అమ్మ బొజ్జలోకి వచ్చాను. అందుకు నాకు చాలా సంతోషంగా వుంది తెల్సా. నాకు ఎంతో ఇష్టమైన అమ్మలో నేనున్నాను. ఎంత హాయిగా వుందో ఇక్కడ. నాకు ఎలాంటి భయమూ లేదు. ఎందుకంటే నా చుట్టూ అమ్మ వుందిగా. తమాషా ఏంటంటే... నా గురించి అమ్మకూ, నాన్నకూ కూడా ఇంకా తెలీదు. నేను చాలా చిన్నగా వున్నాను. ఎంత చిన్నగా అంటే... ఆవగింజ కంటే చిన్నగా వున్నాను! ఇంకా నా చర్మం లేత గులాబీ రంగులో వుంటుంది. కళ్ళేమో తేనె కళ్లు. వెంట్రుకలేమో నల్లగా నిగనిగలాడుతూ వుంగరాలు తిరిగినట్టు పెరుగుతాయి. ఇంకా... నేను పాపను. బుల్లి రాణీగారినన్నమాట. ఇవన్నీ నాకెలా తెల్సంటే... మన అమ్మానాన్నలను బట్టే మన చర్మం, కళ్లు, వెంట్రుకలు... ఎలా వుండాలో నిర్ణయం అవుతుందంట. అసలు విషయం మర్చేపోయాను! తొమ్మిది నెలలు ఆగితే హాయిగా అమ్మ ఒడిలోకి వచ్చేస్తాను. అందుకే ఇవాళ చాలా చాలా... సంతోషంగా వున్నా.

**అక్టోబర్ 19:**

అమ్మకు ఇంకా నా గురించి తెలీనేలేదు. నాకైతే ఇది భలే బావుంది. అమ్మకు తెలీకుండానే అమ్మ బొజ్జలో పెరగడం ఎంత తమషా విషయమో. ఈరోజు అమ్మ కాళ్లకు, చేతులకు గోరింటాకు పెట్టుకుంది. ఎంత బావుందో! అమ్మ తెల్లగా వుంటుందికదా. గోరింటాకేమో ఎర్రగా పండింది. ఇంక పైగా నాన్న కొత్తగా తెచ్చిన జాలర పట్టాలు పెట్టుకుంది. అమ్మ పాదాలు ఎంత ముద్దుగా వున్నాయో! అమ్మ నడుస్తూ వుంటే పాదాల వంకే చూడాలనిపించింది. అంత బావుంటాయి. నేను కూడా పుట్టగానే గోరింటాకు పెట్టుకుంటాను అమ్మలాగా.

**అక్టోబర్ 23:**

నా నోరు ఇప్పుడిప్పుడే తెరచుకుంటోంది. నేను పుట్టాక కిలకిలా నవ్వుతాను. తర్వాత చిన్న చిన్నగా మాట్లాడతాను. నేను పలికే మొట్టమొదటి మాట ఏంటో తెల్సా... 'అమ్మ'. పెద్దవాళ్లు పిల్లలకు మొదట 'అత్త' అనడం నేర్పిస్తారుకానీ.... నాకు మొట్టమొదట 'అమ్మ' అనడమే ఇష్టం.

**అక్టోబర్ 25:**

ఇవాళ నా గుండె సొంతగా కొట్టుకోవడం మొదలెట్టింది. ఇవాళ్టి నుంచి అది ఇంక ఎప్పటికీ కొట్టుకుంటూనే వుంటుంది. ఇంక దానికి రెస్ట్ అనేదే వుండదు. గుండెను చూస్తుంటే భలే గర్వంగా వుంటుంది. ఎందుకంటే పాపం అది విశ్రాంతి తీసుకోకుండా పనిచేస్తుంది. అలా చాలా సంవత్సరాలు పనిచేసీ పనిచేసీ... ఎప్పటికో నేను బామ్మనయ్యాక రెస్ట్‌తీసుకుంటుంది. అప్పుడు నేను చచ్చిపోతాను. అన్నట్టు... కొంతమంది పుట్టుకతోటే రోగాలతో పుడతారు. కానీ... నా గుండె చాలా ఆరోగ్యంగా వుంది. నేను చాలా ఆరోగ్యంగా పుడతాను. అమ్మను అస్సలు ఏడిపించను.

**నవంబర్ 2:**

రోజు రోజుకీ నేను కొద్ది కొద్దిగా పెరుగుతున్నాను. నా కాళ్లు చేతులు ఒక రూపంలోకి వస్తున్నాయి.

**నవంబర్ 12:**

నా చేతులకు చిన్ని చిన్ని వేళ్లు వస్తున్నాయి. అవి ఎంత చిన్నగా తమాషాగా వున్నాయో! ఇంకా చాలా రోజులయ్యాక... నేను అమ్మ చేతుల్లోకి వస్తాను. నా చేతులతో ఎంచక్కా అమ్మ వెంట్రుకలు పట్టుకుని ఆడుకుంటాను. అమ్మ అప్పుడు నన్ను చూసి ప్రేమగా నవ్వుతుంది. మెల్లగా తన వెంట్రుకలను నా చేతిలోంచి తీసేస్తుంది. అప్పుడు నేను నా చిన్ని పెదాలు బిగించి ఏడవబోతే... అమ్మ ఊరుకుంటుందా! నా అరచేతులు పట్టుకొని ముద్దు పెడుతుంది. అప్పుడు నేను కూడా నవ్వేస్తాను. ఇంకా నా చిట్టి చేతులతో పెరట్లో పూస్తున్న రంగురంగుల పువ్వులు కోస్తాను. నాన్న బొజ్జ మీద కూర్చుని ఆడుకుంటాను.

**నవంబర్ 20:**

అమ్మ డాక్టర్ దగ్గర కెళ్లింది. డాక్టరుగారు అమ్మను పరీక్షించి నేను బాగా ఆరోగ్యంగా వున్నానని చెప్పారు. నాకు చాలా సంతోషంగా అనిపించింది. అమ్మకు కూడా అంతే.

**నవంబర్ 25:**

అమ్మ, నాన్న నాకు పేరు పెట్టాలని ఆలోచించారు. కానీ నేను పాపాయినని వాళ్లకు తెలీదుకదా. ఏవేవో పేర్లు ఆలోచించారు. నాకైతే... ఒక పేరంటే చాలా ఇష్టం. అదేంటో తెలుసా! 'ఆమని'. ఆ... అసలు విషయం మర్చేపోయాను. మొదటి కంటే ఇప్పుడు నేను చాలా పెద్దగా అయ్యాను.

**డిసెంబర్ 10:**

నా వెంట్రుకలు బాగా పెరుగుతున్నాయి. మెత్తగా ...మెరుస్తున్నాయి. నాకు అమ్మ వెంట్రుకలు చూసి భలే ఆశ్చర్యంగా వుంటుంది. తలంటుపోసుకుని ఆరపెట్టుకుంటుంటే... భలే బావుంటాయి. పొడవాటి వెంట్రుకలు గాలికి అటూ ఇటూ అల్లరిగా కదులుతాయి.

**డిసెంబర్ 13:**

హమ్మయ్య ఇప్పుడు నేను పూర్తిగా చూడగలుగుతున్నాను. కాకపోతే... నా చుట్టూ అంతా చీకటిగా వుంది. నన్ను అమ్మ కొత్త ప్రపంచంలోకి తీసుకొచ్చినప్పుడు అంతా వెలుతురే! ఎన్ని

రంగులో...ఎన్ని వింతలో... ఎన్ని అద్భుతాలో... గాలి... వాన... ఎండ... పూలు... మంచు... చెట్లు... కాయలు... చెరువులు... కాలువలు... సముద్రాలు... చేపలు.. కప్పలు... సీతాకోకచిలుకలు... చిలుకలు... పావురాళ్లు... రంగులు... నేస్తాలు.. ఆటలు.. పాటలు... ఇంకా చెప్పాలంటే చాలా వున్నాయిలే...అవన్నీ నేను చూస్తాను. వీటన్నిటికంటే ముఖ్యంగా... నేను ముందుగా అమ్మను చూస్తాను. అదే నాకు చాలా చాలా ఇష్టం. అది సరే అమ్మా... నువ్వు ఎలా వుంటావు!



**డిసెంబర్ 24:**

నా గుండె చప్పుడు అమ్మ వినగలుగుతుందా! అసలు ఆ విషయం తల్చుకుంటేనే చాలా ఆశ్చర్యంగా వుంటుంది నాకు. నా గుండె టప్ ..టప్... టప్.. టప్.. అని కొట్టుకుంటోంది. వింటుంటే... ఒక్కోసారి నాకు నవ్వొస్తుంది కూడా.

**డిసెంబర్ 28:**

ఈ రోజు నేను అమ్మతో కలిసి హాస్పిటల్‌కి వెళ్లాను. అక్కడ ఒక యంత్రం వుంది. అది నాకైతే రాక్షసి లాగా కనిపించింది. ఎందుకంటే అందులోంచి చూస్తేనే నేను పాపాయినని తెలిసింది. అంతే అంతా ఒక్కసారిగా నీరసపడిపోయారు.

**డిసెంబర్ 29:**

ఇంటికి వచ్చిన చుట్టాలు అన్న మాటలు వింటే నాకు చాలా బాధగా అనిపించింది. కొంతమందేమో! 'నెక్స్ట్ టైమ్ బెటర్ లక్' అన్నారు. అంటే నేను పుట్టడం బ్యాడా. అబ్బాయి పుడితేనే గుడ్డా! ఇంకొందరేమో! ఏదో జరగరానిది జరిగిపోయినట్టు... చాలా బాధగా... నీరసంగా... 'ఏం చేద్దాం. ఈసారికి తీయించుకుంటే సరి. వెయ్యి రూపాయలతోటే వదిలిపోతుంది శని. ఈ ఖర్చు చూసుకుంటే... ఇక జీవితాంతం దీన్ని భరించాల్సిందే... ఈ కళ్లతో ఎన్ని చూడలేదు...' అంటూ ఒకటే నూరిపోశారు. ఇంక తాతయ్యలకైతే నేను పుట్ట డమే ఇష్టం లేదు. వాళ్ల ఆస్తంతా ఎటో వెళ్లిపోతుందంట. అదే అబ్బాయి పుడితే ఆస్తి అంతా కుటుంబంలోనే వుంటుందంట. పైగా వచ్చే అమ్మాయి తెచ్చే ఆస్తికూడా కలిసి పెరుగుతుందంట. నానమ్మకైతే అబ్బాయిలంటేనే చాలా ఇష్టం. ఎందుకంటే పున్నామ నరకం నుంచి కాపాడేది అబ్బాయిలేనంట. తన కొడుక్కి ఆ నరకం నుంచి కాపాడే కొడుకు కావాలని వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంది. కానీ నేను నీ కడుపున పడ్డానని తెలిసిన దగ్గరనుంచి ఒకటే బాధపడింది. కానీ నానమ్మ ఇవాళ మాత్రం చాలా సంతోషంగా వుంది. మరి నన్ను వదిలించుకోవడానికి హాస్పిటల్‌కి తీసుకెళుతున్నారుగా.

కానీ అమ్మా... నాన్నా... నానమ్మా... తాతయ్యా... అమ్మమ్మా.. ఇంకో తాతయ్యా... అందరూ నా మాట వినరూ! నా గుండె ఏం కోరుకుంటుందో వినరూ! నన్ను ఇలా పిండంగానే చంపేయకండి. నాకు పాపాయిగా అమ్మ చేతుల్లోకి రావాలని వుంది. నన్ను పుట్టనివ్వరూ... ప్లీజ్!

అమ్మా! నేను పుట్టి పెరిగాక మీ అందరికీ సంతోషాన్నే ఇస్తానమ్మా. మంచి పేరు తెచ్చిపెడతానమ్మా. మీరు ఇప్పుడు నా చెయ్యి పట్టుకుని నడిపిస్తే... నేనేమో మీరు ముసలివాళ్లయ్యాక మీ రెండు చేతులు పట్టుకుని నడిపిస్తానమ్మా. చిన్నప్పుడు మీరు నాకు ఇచ్చిన ప్రేమకంటే చాలా చాలా ఎక్కువ ప్రేమను తర్వాత మీకు అందిస్తానమ్మా... అమ్మా! నువ్వు చెప్పు. నీ మనసులో ఏముందో! నాకు తెలుసు. తల్లికి ఆడపిల్లయినా... మగపిల్లాడయినా ఒకటేనని. నన్ను హాస్పటల్‌లో చంపేస్తారని తెలిసిన దగ్గర నుంచి నువ్వు ఎంత బాధపడుతున్నావో నాకు తెల్సమ్మా... రాత్రుళ్లు నాకోసం ఏడ్చీ ఏడ్చీ... అలా నిద్రపోయినప్పుడు నేను ఎంతో బాధపడేదాన్నమ్మా. నా మీద నీకు వున్న ప్రేమలో మిగతావారికి ఆవగింజంత వున్నా... నన్ను ఇవాళ ఇలా ఆస్పత్రి మంచంమీద పండబెట్టేవాళ్లే కాదు.

ఇప్పుడు నాకు వున్న ఒకే ఒక్క ఆశ... ఆధారం... నువ్వేనమ్మా... నువ్వు తల్చుకుంటే... నన్ను ఈ భూమి మీదకు తేవచ్చుమ్మా! కాదంటావా అమ్మా! ఇది వరకు... అంటే... అమ్మమ్మలు... వాళ్ల అమ్మమ్మలు... వాళ్ల అమ్మమ్మలు పుట్టకముందు... ఇలా ఈ ఆపరేషన్లు...చేసి నాలాంటి ఆడపిల్లల్ని చంపడం ఇంకా రాలేదు. కనీసం అప్పుడు ఆడపిల్ల తల్లి బొజ్జలో తొమ్మిది నెలలు పెరిగి... భూమి మీద పడేవరకైనా ఆగేవారు. అప్పుడు నోట్లో ఏ వడ్లగింజో వేసి చంపేసేవారు. లేకపోతే ఊపిరి ఆడకుండా చేసి చంపేసేవారు. లేకపోతే... గుడ్డల్లో చుట్టి ఏ కుప్ప తొట్లోనో, కాలువలోనో వేసేవాళ్లు. నీచు వాసనకు పందులో, కుక్కలో వచ్చి నోట కరుచుకుని వెళ్లి పాపాయిలను కొరికి కొరికి చంపి పారేసేవి. ఆ తర్వాత చీమలు పట్టి ఆగం చేసేవి. అంతటి దయనీయమైన చావు చచ్చినా... కనీసం ఆ కొద్ది గంటలైనా అమ్మ దగ్గర వుండే అవకాశం అప్పటి పాపాయిలకు దక్కేది. ఆ అపురూపమైన క్షణాలను తల్చుకుంటూ వాళ్లు కుక్కలు కరుస్తున్నా... పందులు కొరుకుతున్నా... కొద్దిపాటి సంతోషాన్ని తమతో తీసుకెళ్లేవారు. కానీ ఇప్పుడో... అదేం లేదు. మూడో నెల పిండంగా వుండగానే... నా లాంటి పాపాయిలను కత్తులు, కటార్లతో బయటకు తీసేస్తున్నారు. కాలువల్లో పడేస్తున్నారు. కనీసం కొద్ది క్షణాల పాటుకూడా అమ్మ స్పర్శ తెలియకుండానే ఆసుపత్రి డస్ట్‌బిన్‌లోకి ... అక్కడి నుంచి వీధుల్లో వున్న డస్ట్‌బిన్‌లోకి వెళ్లిపోతున్నాం.

అమ్మా! నాకు కూడా పుట్టాలని వుందమ్మా... నీ స్పర్శను తనివితీరా పొందాలని వుందమ్మా...నాకు నువ్వు కావాలమ్మా... నీ ముద్దు

మురిపాలు కావాలమ్మా... నీ చేతి గోరుముద్దలు తినాలని వుందమ్మా... ప్రేమగా నువ్వు చెప్పే మాటలు వినాలని వుందమ్మా... నీ ఆటపాటల్లో నన్ను నేను మర్చిపోవాలని వుందమ్మా...నీ ప్రేమలో తడిచిపోవాలని వుందమ్మా...నాకు ఆ ఒక్క అవకాశం ఇవ్వమ్మా. ప్లీజ్ అమ్మా... నా మాటలు వినిపిస్తున్నాయా అమ్మా.

మొన్న వీధిలో కుక్కపిల్ల తన స్కూటరు కింద పడిందని నాన్న ఎంత బాధపడ్డారు? దాన్ని ఇంటికి తీసుకొచ్చి మరీ కట్టుకట్టి పాలు తాగించి పంపించారు. గుర్తుందా! కనీసం కుక్కపిల్లమీద వున్న జాలి కూడా నామీద నాన్నకు లేదే అమ్మా...తన వల్ల దాని కాలికి దెబ్బ తగిలినందుకే అంత బాధపడ్డారే. మరి తన బిడ్డనైన నన్ను ఎందుకనమ్మా...ఇలా కత్తులతో చంపించాలని చూస్తున్నారు?! నేను రోడ్డుమీద బతికే కుక్కపిల్ల కంటే హీనమైన దాన్నా.

అన్నట్టు అమ్మా...నాకు ఒక విషయం గుర్తొచ్చింది. మొన్న ఎర్ర గేదెకు పెయ్యిదూడ పుట్టాలని నానమ్మ ఎన్ని దేవుళ్లకు మొక్కుకుంది?! కోడెదూడ పుట్టకూడదని ఎన్ని దేవతలను ప్రార్థించింది?! కానీ నీ దగ్గరకొచ్చేనరికి అలా ఎందుకుచేస్తోందమ్మా పాపాయి వద్దంటోందేంటి? కనీసం పశువు మీదున్న ప్రేమ కూడా నామీద లేదా అమ్మా. అమ్మా... ఈ ప్రపంచంలో నన్ను కాపాడగలిగేది నువ్వు ఒక్కదానివే. నీ ఒక్కదానివల్లే అవుతుంది. అమ్మా... కాస్త ధైర్యం తెచ్చుకోమ్మా... నోరు తెరిచి వాళ్లందరికి సమాధానం చెప్పమ్మా.. నామీద నీమనసులో వున్న ప్రేమను చెప్పమ్మా... వాళ్లకు అర్థం అయ్యేలా చెప్పమ్మా... అమ్మాయైనా..అబ్బాయైనా ఒక్కటేనని తెలిసేలా చెప్పమ్మా... నువ్వు చక్కగా మాట్లాడతావని నాన్న నిన్ను ఎన్నిసార్లు మెచ్చుకోలేదు. ఆ మాటలు ఇప్పుడు ఉపయోగించమ్మా... అందరికీ నామీద ప్రేమ... జాలి... కలిగేలా చెయ్యమ్మా... అమ్మా... ఒక్కసారి... ఒక్కటంటే... ఒక్కసారి నా కోసం వాళ్లందరినీ ఎదిరించలేవా అమ్మా... అమ్మా... ఇప్పటికైనా మాట్లాడమ్మా... డాక్టర్‌గారు నన్ను చంపడానికి రెడీ అవుతున్నారమ్మా...

అమ్మా! తొందరగా ఏదో ఒకటి నిర్ణయించుకోమ్మా...డాక్టరుగారు అంతా రెడీ అయ్యి వచ్చేస్తున్నారమ్మా... అమ్మా... ఇది నా ప్రార్థన... వేదన.... ఆశ... కోరిక... ఏదైనా అనుకోమ్మా... నన్ను బ్రతికించుకోమ్మా... నన్ను పుట్టనివ్వమ్మా... అదిగో వచ్చేశారమ్మా... మత్తుడాక్టరుగారు కూడా వచ్చేశారమ్మా... అమ్మా... ఆయన నీకు మత్తు ఇంజక్షను ఇచ్చేస్తే... ఇంక నేను ఏం చెప్పినా అస్సలు వినిపించదమ్మా...అమ్మా... ప్లీజ్ అమ్మా... ప్లీజ్ అమ్మా... ఈ ఒక్కమాట వినమ్మా... నన్ను బ్రతికించుకోమ్మా... ఒక్క మాట చెప్పమ్మా వాళ్లకు... అమ్మా డాక్టరు గారు ఇంజక్షన్ చేస్తున్నారమ్మా... ఇదే నా చివరి మాట అమ్మా... నాకు బ్రతకాలని వుందమ్మా... నీ పాపాయిగా పుట్టాలని వుందమ్మా... అయినా అమ్మా ఇంకా ఈ భూమి మీద పడని పాపాయికి హక్కులేం వుండవా అమ్మా... తనకు ఇష్టం లేకుండా చనిపోకుండా కాపాడే హక్కులేం లేవా అమ్మా... వాటిని కాపాడాల్సింది నీవే కదా అమ్మా... అమ్మా... అమ్మా... అమ్మా... ఇవే నేను నీకు చెప్తున్న చివరి మాటలు అమ్మా... అమ్మా...!!

*

# చిదంబరం గారూ! బాలల గోడు ఆలకిస్తారా?

- డా॥ కె. హేమలత

స్థూల జాతీయోత్పత్తి పెరుగుదల 8-9 శాతం వున్న దేశంలో భావి పౌరుల జీవితాలు బండబారుతున్నాయి. ఆ రకంగా భారత దేశం తన శోభను కోల్పోయి దయనీయ స్థితిని ఎదుర్కొంటున్నది. మానవాభివృద్ధిని తెలియజేసే కొన్ని సూచికలను ఈ దిగువన చూడొచ్చు.

భారతదేశంలో ప్రతియేటా 25లక్షల మంది పిల్లలు చనిపోతున్నారు. అంటే, ప్రపంచం మొత్తంమీద మరణించే పిల్లల్లో 20 శాతం అన్నమాట. మన దేశంలో జన్మించే ప్రతి 1000 మంది శిశువుల్లో 58 మంది తమ తొలి పుట్టినరోజు చేసుకోకుండానే కన్ను మూస్తున్నారు. శిశు మరణాలలో 55 శాతానికి పౌష్టికాహార లోపమే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కారణమవుతున్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ పేర్కొన్నది. తృతీయ ప్రపంచంలో జన్మిస్తున్న బరువు తక్కువ పిల్లల్లో 35 శాతం భారత దేశానికి చెందిన వారే. భారతదేశంలో జన్మించే ప్రతి రెండవ బిడ్డ బరువు తక్కువగా ఉంటున్నది. ప్రపంచంలో పౌష్టికాహార లోపంతో బాధపడుతున్న ప్రతి ముగ్గురు పిల్లల్లో ఒకరు మన దేశంలో వున్నారు. సరైన ఆహారం లేకపోవటమే మన దేశంలో అనారోగ్యానికి ప్రధాన కారణంగా ఉంది. మరీ ముఖ్యంగా గర్భధారణ వయసులో ఉన్న యువతులు, కౌమార వయస్కులు కునారిల్లి పోతున్నారు. పదకొండవ పంచవర్ష ప్రణాళిక కోసం బాల బాలికల అధ్యయన బృందం ఈ అంశాలను వెల్లడించింది.

ఈ విషాదగాథ ఇంతటితో ముగియలేదు. మన దేశంలో వేలాది శిశువులు పుట్టిన మరుక్షణంలోనే తమ తల్లులను పోగొట్టుకుంటున్నారు. ప్రసవ సమయంలో, గర్భస్రావ సమయంలో సరైన వైద్యం అందక ప్రతియేటా 1,36,000 తల్లులు తమ ప్రాణాలను కోల్పోతున్నారు. ప్రపంచంలోనే ఇది అత్యధిక సంఖ్య, ప్రతి లక్ష జననాలకు 301 ప్రసూతి మరణాలుంటున్నాయి. ఈ సంఖ్య ప్రపంచంలోనే ఎక్కువ. చివరకు పొరుగునవున్న శ్రీలంక, పాకిస్థాన్‌లతో పోల్చుకున్నప్పటికీ ఎక్కువనే చెప్పాలి.

ఈ రకమైన దుస్థితి ఉన్నందునే మానవాభివృద్ధి సూచిలో భారతదేశం 128వ స్థానంలో నిలిచింది. ఆకలితో అల్లాడిపోయే వారు ఎక్కువగావున్న దేశాల్లో 94వ స్థానంలో ఉంది. షేర్ మార్కెట్‌లో సెన్సెక్స్ కాస్త తగ్గినంతనే వెనువెంటనే స్పందించి మదుపుదారులకు విశ్వాసాన్ని కల్పించేందుకు చర్యలు చేపట్టే ప్రభుత్వం ఈ విషయంలో కూడా తగిన విధంగా స్పందించాలి.

సమగ్ర శిశు అభివృద్ధి సేవా పథకానికి చాలా ఏళ్ళుగా ప్రభుత్వ కేటాయింపులు అంతంత మాత్రంగానే ఉంటున్నాయి. దీన్ని బట్టే ప్రభుత్వ ఉదాసీనతను అర్థం చేసుకోవచ్చు. 1974లోచేపట్టిన జాతీయ శిశు విధానాన్ని అనుసరించి 1975లో ఐసిడిఎస్ ఉనికిలోకి వచ్చింది. ఈ విధానం పిల్లలను "అత్యున్నత ప్రాధాన్యత కలిగిన జాతి సంపద"గా గుర్తించింది. శిశువులు జన్మించటానికి ముందూ, ఆ తరువాతా వారి ఎదుగుదల కాలంలో, శారీరక, మానసిక, సామాజిక అభివృద్ధిని సాధించేలా దేశంలోని పిల్లలందరికీ ప్రభుత్వం తోడ్పాటునివ్వాలని ఈ విధానం చెబుతున్నది. ఈనాడు శిశు మరణాలు, ప్రసూతి మరణాలు చాలా ఎక్కువగా ఉన్నాయి. మున్ముందు మానవాభివృద్ధిపై దుష్ప్రభావం పడకుండా ఈ విషయమై తగు శ్రద్ధ తీసుకోవాల్సి ఉందని ప్రభుత్వం సైతం అంగీకరించింది.



మూడేళ్ళలోపు పిల్లలంతా అమ్మ ఒడికి, అంగన్ వాడీకి

పిల్లలు తక్కువ బరువుతో జన్మించడమూ, పౌష్టికాహార లోపమూ, మరణాలు ఇవన్నీ తల్లులకు సరైన ఆహారం లేకపోవటం, అలానే గర్భధారణకు ముందూ అటు పిమ్మటా తీసుకోవలసిన జాగ్రత్తలు అందుబాటులో లేకపోవటం వల్లే సంభవిస్తున్నాయి. ఈ విషయాన్ని గమనించి పౌష్టికాహారాన్ని, నర్సరీ విద్య, రోగనిరోధక టీకాలు, ఇతర సేవలు వగైరాలను అందుబాటులోకి తీసుకొచ్చేందుకు ఐసిడిఎస్ ప్రారంభించారు. పిల్లల్లో పౌష్టికాహార లోపాన్ని తగ్గించటంలోనూ,రోగనిరోధక టీకాలను అందుబాటులోకి తేవడంలోనూ, పాఠశాలల్లో హాజరును పెంచడంలోనూ ఐసిడిఎస్ సానుకూల

ప్రభావాన్ని చూపినట్లు ప్రణాళికా సంఘం, శిశు అభివృద్ధి వగైరా సంస్థలు చేసిన అధ్యయనాలు వెల్లడించాయి. దీనితో ఐసిడిఎస్‌ను విస్తరించే కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది. అయినప్పటికీ అర్హతగల వయో బృందంలో ఉన్న పిల్లల్లో మూడింట ఒక వంతుకన్నా తక్కువ మందికే ఈ పథకం అందుబాటులోకి వచ్చింది. అంగన్‌వాడీ కేంద్రాలను అవసరమైన అన్ని చోట్ల ఏర్పాటు చేస్తామని కనీస ఉమ్మడి కార్యక్రమంలో యుపిఎ ప్రభుత్వం తెలిపింది.

ఐసిడిఎస్‌ను చిత్తశుద్ధితో అమలు చేయగలిగితే ఐరాస నిర్ణయించిన సహస్రాబ్ది లక్ష్యాలు కూడా నెరవేరతాయి. బరువు తక్కువ పిల్లల సంఖ్యను సగానికి తగ్గించటం, అదేవిధంగా ఐదేళ్ళలోపు పిల్లల్లో మరణాలను మూడింట రెండువంతులు, ప్రసూతి మరణాలలో మూడొంతులు తగ్గించాలని సహస్రాబ్ది లక్ష్యాలుగా ఐరాస నిర్ణయించింది. 2000సం॥లో నిర్ణయించిన ఈ లక్ష్యాలను 2015 నాటికి సాధించాలని అప్పటిలో నిర్ణయం జరిగింది. మనం ఇప్పటికే 2008కి చేరుకున్నాము. కాని సాధించవలసింది మాత్రం చాలా ఉంది. నిర్ణీత వ్యవధిలో లక్ష్యాన్ని సాధించటం అసాధ్యమనే అనిపిస్తున్నది.

బాలబాలికల అభివృద్ధి గురించి ప్రభుత్వం చాలా మాటలు చెబుతోంది. కాని వనరుల కేటాయింపు మాత్రం అందుకు తగ్గట్లుగా లేదు. వరుసవారీగా వెలువడుతున్న బడ్జెట్‌లలో ఐసిడిఎస్‌కు చేసే కేటాయింపులు కంటితుడుపుగా మాత్రమే ఉంటున్నాయి. 2000-01 నుంచి 2004-05 మధ్య వెలువడిన కేంద్ర బడ్జెట్‌లలో సగటున 2.38 శాతాన్ని మాత్రమే పిల్లల కోసం ఖర్చు చేశారు. ఇందులో శిశు అభివృద్ధి కోసం 0.43శాతం మాత్రమే ఖర్చు చేస్తున్నారు. 2007 చివరి నాటికి 6 కోట్ల మంది పిల్లలకు అంటే అర్హత కలిగిన పిల్లల్లో 40 శాతం మందికి మాత్రమే అంగన్‌వాడీ కేంద్రల ద్వారా అనుబంధ పౌష్టికాహారం లభించింది. 2006లో కన్నా కేవలం 54 లక్షల మంది పిల్లలు పెరిగారు. ఈ ప్రకారమే పెరుగుదల ఉన్నట్లయితే రానున్న రెండు దశాబ్దాలలో సార్వత్రికత అనేది సాధ్యం కాదు. గత ఏడాది ఐసిడిఎస్ కోసం రూ॥4761 కోట్లు లేదా, మొత్తం 5లక్షల కోట్ల బడ్జెట్‌లో 0,0095శాతాన్ని కేటాయించారు. దిగువస్థాయిలో ఐసిడిఎస్‌ను జయప్రదం చేయటంలో కీలకపాత్రను నిర్వహించే అంగన్‌వాడీ కార్యకర్తలపట్ల కేంద్రం పూర్తిగా ఉదాసీనతనే చూపుతోంది. ప్రభుత్వ నిర్లక్ష్యానికి ఇదొక ఉదాహరణ. ఒకవైపు వారి బాధ్యతలను, విధులను, పనిగంటలను నిర్దేశిస్తూనే మరోవైపు వారిని 'సామాజిక సేవకులు'గా ప్రభుత్వం భావిస్తోంది. ఈ పథకంలో ఇదొక బలహీనత. కాలక్రమంలో వారిపై అనేకానేక బాధ్యతలను మోపుతోంది. ఐసిడిఎస్ కార్యక్రమంతో సంబంధంలేని పనులను కూడా రాష్ట్ర ప్రభుత్వం, ఇతర విభాగాలు వారికి అప్పజెప్తున్నాయి. కాని 'గౌరవభృతి' కింద వారికి చెల్లించే ప్రతిఫలం మాత్రం చాలా స్వల్పంగా ఉంటోంది. రోజుకు నాలుగున్నర గంటలుమాత్రమే పనిచేయవలసి ఉంటుందని చెపుతున్నప్పటికీ నిజానికి ఆరేడు గంటలు పనిచేయాల్సి వస్తోంది. దీనితో ఆదాయం వచ్చే వేరే పనిని చేసే అవకాశం వారికి ఉండటం లేదు. జాతీయ ఉపాధి హామీ పథకం కింద అనిపుణ శ్రామికునికి రోజుకు 66 రూ॥లు వేతనంగా (తరువాత రూ॥80కి పెంచారు) ప్రభుత్వం నిర్ణయించింది. కాగా శిక్షణపొంది నైపుణ్యం సంపాదించిన అంగన్‌వాడీ కార్యకర్తకు రోజుకు 35రూ॥ల కన్నా తక్కువ ఇస్తున్నారు. నైపుణ్యం లేని సహాయకులకు 17రూ॥లకన్నా తక్కువ చెల్లిస్తున్నారు. గత ఆరేళ్ళ కాలంలో నిత్యావసర సరుకులు అనేక రెట్లు పెరిగినప్పటికీ, వారికిచ్చే ప్రతిఫలం ఒక్క పైసా కూడా పెరగలేదు. పాలక వర్గాలకుండే శ్రామిక వ్యతిరేకతను ఈ దుస్థితి పట్టి చూపుతున్నది. నయా ఉదారవాద కాలంలో ఇది మరింత కనిపిస్తున్నది. యుపిఎ ప్రభుత్వం కానీ లేదా ప్రణాళికా సంఘం కానీ, జాతీయ సలహా మండలిగానీ అంగన్‌వాడీ కార్యకర్తల గురించి పట్టించుకోవడం లేదు. 58 లేదా 60సం॥ల వయసుకు చేరిన అంగన్‌వాడీ కార్యకర్తలు, సహాయకులు ఎలాంటి నష్టపరిహారం లేకుండానే పని నుంచి తప్పుకోవలసి వస్తున్నది.

బాలబాలికలకు ఆహారాన్ని, ఆరోగ్యాన్ని, విద్యనూ కల్పించటంలో ఐసిడిఎస్ నిర్వహిస్తున్న పాత్ర గుర్తించిన అఖిల భారత అంగన్‌వాడీ కార్యకర్తల, సహాయకుల సమాఖ్య ఐసిడిఎస్‌ను సార్వత్రికం చేయాలని అదేవిధంగా అంగన్‌వాడీ కార్యకర్తల, సహాయకుల పరిస్థితిని మెరుగుపరచాలని డిమాండ్ చేస్తున్నది. వారికిచ్చే నెలసరి ప్రతిఫలాన్ని కార్యకర్తలకు రూ॥3,000గానూ, సహాయకులకు రూ॥ 2,000 గానూ పెంచాలని డిమాండ్ చేసింది. ఉద్యోగ విరమణ చేసినపుడు వరుసగా లక్ష రూపాయలు, 50,000రూ॥లు ఇవ్వాలని కూడా డిమాండ్ చేసింది. కార్యకర్తలకు, సహాయకులకు 3,4 గ్రేడ్‌ల కింద బాగించి వారికి పెన్షన్ సౌకర్యం కూడా వర్తింప చేయాలని కోరింది. ఈ డిమాండ్ల సాధన కోసం గత నాలుగేళ్ళుగా సమాఖ్య అనేక పోరాటాలను, ఆందోళనలను నిర్వహించింది. అయితే ప్రభుత్వం హామీలు ఇవ్వడం మినహా మరేమీ చేయడం లేదు. వచ్చే ఫిబ్రవరిలో ప్రధానికి ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించాలని సమాఖ్య భావిస్తున్నది. ఇందుకు కోట్లాది సంతకాలను సేకరిస్తోంది. అదే నెల 18వ తేదీన ఢిల్లీలో ఒకప్రదర్శనను కూడా జరపనున్నది. ఐసిడిఎస్‌ను సార్వత్రికం చేయాలని కూడా సమాఖ్య పోరాటం చేస్తున్నది. అంగన్‌వాడీ కార్యకర్తలకు, సహాయకులకు సామాజిక భద్రతను కల్పించేటందుకు గాను ప్రత్యేకంగా రూ॥2,500కోట్లతో సహా ఐసిడిఎస్ కార్యక్రమానికి 12,000కోట్లను కేటాయించాలని బడ్జెట్ ముందు చర్చలలో సిఐటియు డిమాండు చేసింది. అంటే ఏడాదికి ఒకశిశువు కోసం 700రూ॥లు అన్నమాట. దేశ భవితవ్యాన్ని మహోజ్వలంగా మార్చాలని చెప్పే ప్రభుత్వం ఈ మాత్రం మొత్తాన్ని కేటాయించలేదా?



**అజ్ఞానమనేది విజ్ఞానము వైపుకు పయనించవచ్చు**
**కానీ మూఢత్వమనేది మరణానికి దారి తీస్తుంది.**

**- టాగూర్ .**

# చైతన్య భారతి భూపతిరాజు వెంకాయమ్మ

- అల్లూరి మన్మోహినీ

చీకటి యుగంలోని స్త్రీ జాతికి వెలుగు దివ్వెలుగా వెలసిన మహనీయులు కందుకూరి వీరేశలింగం, గురజాడ, రాజారామ్మోహన్‌రాయ్ మొదలైన వారి వారసులుగా, జాతి రత్నాలుగా వెలసిన మహిళా మణులలో కీ.శే. భూపతిరాజు వెంకాయమ్మ గారు ఒకరు.

18వ శతాబ్దంలో ప్రారంభమయిన సాంఘిక సంస్కరణోద్యమం స్త్రీ చైతన్యానికి మేల్కొలుపు అయింది. అందులో భాగమే పశ్చిమ గోదావరి జిల్లా మహిళా ఉద్యమ ప్రారంభ దశ.

అది పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురం తాలూకా జిన్నూరు గ్రామం. 1937 డిశంబరు 17వ తేదీన భూపతిరాజు వెంకాయమ్మగారి నాయకత్వాన మహిళలు సమావేశమై మహిళా సంఘాన్ని స్థాపించుకున్నారు. కార్య నిర్వాహక వర్గాన్ని ఎన్నుకున్నారు. వెంకాయ్యమ్మ గారే సంఘాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. తిరిగి 1938 జనవరి 18న జిన్నూరు మహిళా సంఘం కార్యవర్గం సమావేశమై జిల్లాలో విరివిగా మహిళా సంఘాలు స్థాపించాలని ప్రతి గ్రామంలోనూ మహిళా సంఘం స్థాపనకు కార్యక్రమం వేసుకున్నారు. పురుషులతోపాటు స్త్రీలకు సమాన వారసత్వం ఇవ్వాలని కోరారు. 1930నాటి స్వాతంత్రోద్యమ తరంగాలు మహిళల్లో మరింత సాంఘిక రాజకీయ చైతన్యాన్ని కలిగించినవి.



అధికారులకు ఇచ్చే మెమోరాండాన్ని చదివి వినిపిస్తున్న భూపతిరాజు వెంకాయమ్మ, ఎడమ వైపు ఉద్దరాజు మాణిక్యాంబ

భూపతిరాజు వెంకాయమ్మగారి భర్త ప్రముఖ స్వాతంత్ర సమర యోధుడు భూపతిరాజు లక్ష్మీనరసరాజు గారు. భర్తతోపాటు వెంకాయ్యమ్మగారు కూడా స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలు జీవితం అనుభవించారు. కాని స్వతంత్ర సమర యోధులకు ప్రభుత్వం ఇచ్చే పెన్షన్ వగైరాలు ఆమె పొందలేదు. స్వాతంత్రోద్యమం ఇచ్చిన చైతన్య స్ఫూర్తితోనే పశ్చిమగోదావరి జిల్లా మహిళా ఉద్యమ నిర్మాణం ప్రారంభమయింది.

జిన్నూరు ఆ పరిసర గ్రామాలలో కొంత మంది స్త్రీలకు అతి ఘోరమైన ఘోషా పద్ధతి ఉండేది. ఆ స్త్రీలు బయటకు రావడం అంటే అది ఒక సాంఘిక విప్లవమే. ఈ విషయం ఆంధ్ర రాష్ట్ర మహిళా ఉద్యమ నిర్మాత కీ.శే. మానికొండ సూర్యావతి గారు ఆమె ప్రసంగాలలోఎప్పుడూ చెపుతూ ఉండేవారు. మానికొండ సూర్యావతి గారు ప.గో.జిల్లా మహిళా ఉద్యమ ప్రారంభ కేంద్రం అయిన జిన్నూరు భూపతిరాజు వెంకాయమ్మ గారింటికి వచ్చేవారు. ఇప్పటికీ సజీవంగా 95సం॥ల వయసులో మహిళా ఉద్యమానికి స్ఫూర్తిగా ఉన్న మానికొండ సూర్యావతి గారి సహచరి కృష్ణాజిల్లా కాటూరు గ్రామంలోని నాగళ్ల రాజేశ్వరమ్మ గారు కూడా సూర్యావతి గారితో కలిసి జిన్నూరు గ్రామం వచ్చేవారు. సాంప్రదాయాల పేరుతో గృహ నిర్బంధాలలో అణచివేయబడిన స్త్రీలను బయటకు తీసుకువచ్చి వారిని చైతన్య పరచుటకు ఆనాటి మహిళా ఉద్యమం ఎన్నో ఒడిదుడుకులు దౌర్జన్యాలకు గురై కఠోరమైన అగ్ని పరీక్షలనెదుర్కొన్నది. అయినా విశ్రమించక అత్యంత దీక్షతో మహిళా ఉద్యమాన్ని ముందుకు నడిపింది.

(భూపతి రాజు వెంకాయమ్మ గారి నాయకత్వాన) 1937లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జరిపిన కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు భూపతిరాజు వెంకాయమ్మ అల్లూరి అన్నపూర్ణ, ఉద్దరాజు మాణిక్యాంబ వగైరాలు వెళ్లారు. ఆ సందర్భంగా పోలీసులు లాఠీచార్జిలు, అరెస్టులు చేసి మహిళలను రాయవెల్లూరు జైలుకు తరలించారు. జైళ్ళనుండి బయటకు వచ్చాక మరింత ఇనుమడించిన దీక్షతో మహిళా ఉద్యమ నిర్మాణానికి పూనుకున్నారు. అందులో భాగమే భూపతిరాజు వెంకాయమ్మ గారి నాయకత్వాన జరిగిన మెదటి మహిళా మహాసభ. పాలకొల్లు ప్రక్కనే ఉన్న లంకలకోడేరు గ్రామంలో 31.1.1938లో జరిగింది.

ఆ సభా విశేషాలు సేకరణ: 19.2.1938 నవశక్తి పత్రిక నుండి–

అగ్ని హోత్రుని ధర్మమా అని 11గం॥లకు జరగవలసిన స్త్రీల సభను మధ్యాహ్నం 2గం॥దాకా ప్రారంభం చేయటానికి వీలుకలుగలేదు. స్త్రీల సభను గురించి వ్రాయడానికి ముందు దాని చరిత్రను సంగ్రహంగా చెప్పాలి. అన్నపూర్ణమ్మగారు, ఆ రహస్యం కాస్తా బయట పెట్టారు. ఆడవాళ్ళు అసలు సభకు వస్తారా అని అనుమానం ఉండేదట. ఈ ప్రాంతంలో క్షత్రియ బృందం చెప్పరాని ఘోషావుండేవారు. అందుచే క్షత్రియ యోధులు. తమ అతివలను అంత:పురాల నుండి అవతలకు పంపేవారు కాదు. యువకులు కొందరు తమ భార్యలను బయటకు పంపారు. ఉద్దరాజు రామం గారు తన భార్యను 1932లో బయటకు తెచ్చి చెరసాలకు పంపినందుకు ఆ దంపతులు పడిన బాధ యింతయని చెప్పనలవికాదు. రాజు శబ్దం లాగేసి జందెం తెంపేసినందుకు సత్యం ప్రభృతులు పడిన పాట్లకు అంతులేదు. కొత్తపట్నానికి క్షత్రియ యువతులు తెగించి వచ్చి జైలుకు కూడా వెళ్లారు. ఈ తోక తెగిన నక్కలన్నీ ఊరుకుంటాయా? భూపతిరాజు వెంకాయమ్మగారు భుజం కాసారు. మహిళా సభను జయప్రదం చేయాలని కంకణం కట్టారామె. వీధినపడి వెలమలను పోగు చేసారు ఆమె. నాలుగువందల నారీమణులతో సభ కళకళలాడింది. ఘోషాను పదదన్ని వచ్చేసారు కోమలులు కుప్పతెప్పలుగా. వెంకాయమ్మగారే ఆహ్వాన సంఘ అధ్యక్షులు. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు సభను ప్రారంభించారు. పక్కా సామ్యవాదిలా ఉపన్యసించారు. కృష్ణాజిల్లా మహిళా సంఘాధ్యక్షురాలుగా విరామం లేకుండా పనిచేస్తున్నారామె. చెరసాలనలంకరించిన వీరనారీమణి.

డాక్టరు కొమర్రాజు అచ్చమాంబ అధ్యక్షురాలు ఆంధ్ర చరిత్ర కారుడగు లక్ష్మణ రాయని ముద్దుబిడ్డ. లండన్‌లో ఉన్నత విద్య పరీక్ష పాసై వచ్చిన ప్రజ్ఞావతి. సహజ నిర్మల హృదయంతో స్వాభావికమైన స్వచ్ఛతెనుగులో అట్టహాసాలు లేని సుందరశైలిలోసంభాషణ ఫక్కీని గంటకు పైగా ఉపన్యాసించి పరదా పద్ధతిని నిరసించారు. అజ్ఞానమును ఖండించారు. బాల్య వివాహాలు పనికిరావంది. అతివల ఆరోగ్యం దురాచారాలవల్ల నశించిపోతుందని విలపించారు. డా॥అచ్చమాంబ గారు కాంగ్రెసులో పనిచేస్తున్న పురుషులు కూడా తమ స్త్రీలకు స్వాతంత్రమిచ్చుటలేదని ఆక్షేపించారు. స్వాతంత్ర్యం, స్వామ్యవాదం గురించి చర్చించారు. స్త్రీలకు ముక్తినిచ్చేది సామ్యవాదమని సూటిగా పల్కారు. 11సం॥ల నుండి పనిచేస్తున్న అఖిల భారత మహిళా సంఘం ఉద్యోగస్తుల భార్యల హస్తగతమై ఎదుగుబొదుగులేక యున్నదని విమర్శించారు. పురుషునితోపాటు స్త్రీలు సరిసమానముగా అన్ని రంగాలలోనూ పాల్గొనవలెనని హెచ్చరించారు.

విద్య, వివాహ స్వాతంత్ర్యము, ఆంధ్ర రాష్ట్రము, భారత స్వాతంత్ర్యము, మున్నగు విషయాలు గూర్చి తీర్మానాలు గావించబడెను. వేలకొలది పురుషులు కూడా సభలో నుండుటకవకాశమివ్వబడెను. అన్నపూర్ణమ్మగారు అతివల కోరికపై అరగంట ఉపన్యశించారు. సామ్యవాదమే స్త్రీలకు విముక్తినిచ్చునని ఉపదేశమిచ్చారు.

పశ్చిమగోదావరి జిల్లా రాజకీయ సభలో అంతర్భాగంగా జరిగిన జిల్లా మహిళా మహాసభ వివరాలు: నవశక్తి:19-2-1938 పత్రిక

"ఆ రకంగా పశ్చిమగోదావరి జిల్లా మహిళా ఉద్యమ వ్యవస్థాపకులు.భూపతిరాజు వెంకాయమ్మ గారు". ఆమె మహిళా కార్యకర్తలకు కట్టుబొట్టు, ఓర్పు, నేర్పు, చాకచక్యం ఉట్టిపడేది ఆమె శిక్షణలో. మహిళా సంఘం ప్రారంభంలో స్త్రీలు, ఆరోగ్యకరమైన ఆహారం, వంట పద్ధతులు అవలంబించాలని ప్రచారం చేసేవారు. ఆంధ్ర రాష్ట్ర మహిళా సంఘం తొలి అధ్యక్షురాలైన డాక్టరు కొమర్రాజు అచ్చమాంబగారు వ్రాసిన ప్రసూతి శిశు పోషణ, నీవు నీ పుట్టుక అనే 2 పుస్తకాలు, మహిళా కార్యకర్తలు ఎంతో ఉత్సాహంతో మహిళా లోకానికి అందించి ప్రసూతి జాగ్రత్తలు, బిడ్డల పెంపకంపై పెద్ద ఎత్తున ప్రచారం చేసారు.

ప.గో.జిల్లా ద్వితీయ మహిళా మహాసభ, భీమవరం తాలూకా నవుడూరు గ్రామంలో 1943డిశంబరు 24,25 తేదీలలో జరిగింది. విశాల ప్రాతిపదికపై కొనసాగిన మహిళా ఉద్యమాలకు ప్రతిబింబంగా ఈ మహిళా మహాసభ జరిగింది. ఈ మహాసభలోకాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు అనే బేదం లేకుండా రాజకీయాలకతీతంగా జరిగిన మహాసభగా చరిత్రలో నూతనాధ్యాయాన్ని తెరచింది. ఘోషాలు, పురాతన సాంఘిక కట్టుబాట్లలో వెనుకబడి ఉన్న మహిళా లోకంలో గొప్ప సంచలనాన్ని చైతన్యాన్ని సృష్టించింది.

సత్యాగ్రహోద్యమాలలో పాల్గొన్న శ్రీమతులు ముల్పూరి చుక్కమ్మ, చుండూరి రత్నమ్మ, సత్యాగ్రహంలో పాల్గొని జైలు నుండి విడుదలై వచ్చిన పెనుగొండ వాస్తవ్యులు దేగల వెంకటరత్నమ్మ (భర్త దేగల సూర్యనారాయణ) భూపతిరాజు బంగారమ్మ (సుబ్బ తాతరాజు గారి భార్య) 3సార్లు అరెస్టు చేయబడి దీర్ఘకాలం జైలులో ఉన్న ప్రముఖ స్వాతంత్య సమరయోధుడు దాట్ల నీలాద్రి రాజు(70సం॥లు) దాట్ల తిరుపతిరాజు, పసల కృష్ణమూర్తి గారు, భర్త అంజమ్మ, స్వాతంత్ర సమరయోధులు అఖిల భారత మహిళా సంఘం స్టాండింగ్ కమిటీ సభ్యురాలు జాస్తి సీతామహాలక్ష్మమ్మ తణుకులో మహిళా విద్యాలయం నడుపుతున్న దేవులపల్లి సత్యవతమ్మ(సేవా సదనం) మొదలైనవారు మహాసభలో పాల్గొన్నారు. అప్పటికి జిల్లాలో 30 గ్రామాలలో గ్రామ మహిళా కమిటిలు ఏర్పడ్డాయి. 2,400మంది సభ్యులు. 3 గ్రామాలలో రాజకీయ శిక్షణా తరగతులు నడిపారు. స్త్రీల వివాహం, వారసత్వం, దత్తత మొదలైన విషయాలలో బి.యన్.రావు కమిటీ బిల్లులో స్త్రీలకు పురుషులతోపాటు సమాన హక్కునివ్వాలని కోరుతూ మహజర్లపై 4,000 సంతకాలు చేయించారు. ఈ విధంగా జిల్లా మహిళా సంఘం చేసిన కృషి ఫలితంగా గ్రామ గ్రామాల నుండి వందలాది మంది కదిలి మహాసభకు వచ్చారు. చింతలపూడి, పోలవరం తాలూకాలు మినహా జిల్లాలో అన్ని తాలూకాల నుండి 107మంది ప్రతినిధులు ఇరుగు, పొరుగు జిల్లాల నుండి 10మంది సౌహార్ద్ర ప్రతినిధులు వచ్చారు. పడవల మీద, బళ్ల మీద, కాలినడకన ప్రయాణం చేసి 800మంది స్త్రీలు ప్రేక్షకులుగా వచ్చారు. 5గురు మున్సిపల్ కార్మిక స్త్రీలు, ఇద్దరు వ్యవసాయ కార్మిక స్త్రీలు, ఇద్దరు ముస్లిం స్త్రీలు కూడా

ప్రతినిధులలో ఉన్నారు. మొదటిసారిగా ఘోషాలోంచి బయటకు అడుగుపెట్టి వచ్చిన వారు సగం మంది ఉన్నారు.

డిశంబరు 24వ తేదీ మధ్యాహ్నం ప్రతినిధుల సమావేశంలో జిల్లా సంఘ అధ్యక్షురాలు భూపతిరాజు వెంకాయమ్మగారు అంతవరకు జిల్లాలో జరిగిన మహిళా సంఘ కార్యక్రమాలపై నివేదిక ఇచ్చారు.

ఆనాడు ఆమోదించబడిన తీర్మానాలు చూస్తే ఏయే సమస్యలపై కేంద్రీకరించి మహిళా సంఘం పనిచేస్తుందో తెలుస్తుంది.

1. సమాన వారసత్వం హక్కు. రిజిస్ట్రేషన్ వివాహ పద్ధతి. విడాకుల హక్కును గుర్తిస్తూ హిందూ లా సవరణ బిల్లును 1944 జూన్‌లోగా సవరణ చేయాలి.

2. ప్రతి గ్రామంలోనూ స్త్రీలకు మరుగుదొడ్లు, శిక్షణ పొందిన మంత్రసానులు, బాలిక పాఠశాలలు ఏర్పరచాలి. అందుకు స్థానిక సంస్థలు చర్యతీసుకోవాలి.

3. గ్రామాలలో వ్యవసాయ పనులలో పురుషులతోపాటు స్త్రీలకు సమాన కూలి ఇవ్వాలి.

4. దేశానికి ఏర్పడిన ఫాసిస్టు దురాక్రమణ ప్రమాదాన్ని ఎదుర్కొని పోరాడడానికి స్త్రీలు సంసిద్ధం కావాలి.

5. బెంగాల్ రాయలసీమ కరువు నివారణకు అన్ని రాజకీయ పార్టీలు ఐక్యతతో కృషి చేయాలి.

6. బ్రిటిష్ ప్రభుత్వం ఆగస్టు ఉద్యమ సందర్భంలో అరెస్టు చేసిన జాతీయ నాయకులందరినీ విడుదల చేసి జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచాలి.

7. మద్రాసు ప్రభుత్వం మద్యపాన నిషేధ చట్టాన్ని తిరిగి అమలు చేయాలి.

8. గ్రామ గ్రామాన బాల సంఘాలను ఏర్పరచి వారికి మంచి క్రమశిక్షణ, దేశభక్తి నేర్పాలి.

25వ తేది మధ్యాహ్నం 350మంది స్త్రీలతో పెద్ద ప్రదర్శన జరిగింది. ఊరేగింపులో ఘోషా పద్ధతి నశించాలి. స్త్రీలకు వారసత్వ హక్కు కావాలి. ఫాసిజం నశించాలి. జాతీయ నాయకులను విడుదల చేయాలి. మొదలైన నినాదాలతో గ్రామ వీధులన్నీ ప్రతిధ్వనించాయి. జిల్లా కాంగ్రెసు నాయకురాలైన ముల్పూరి చుక్కమ్మ గారు స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం అన్న మహిళా సంఘం పతాకాన్ని ఆవిష్కరించారు.

మధ్యాహ్నం 3గం॥కు ఝాన్సీ లక్ష్మీబాయి ప్రాంగణంలో మహాసభ ప్రారంభం అయింది. స్త్రీలు, పురుషులు, సుమారు 2,400మందితో సభ కిటకిటలాడిపోయింది. డాక్టరు కొమర్రాజు అచ్చమాంబ సభను ప్రారంభిస్తూ స్త్రీల వారసత్వ హక్కు ఆవశ్యకత వివరించారు. బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, ఘోషా మున్నగు సాంఘిక దురాచారాలను స్త్రీలు విడనాడాలని ఉద్బోధించారు.

సభకు అధ్యక్షత వహించిన కృష్ణాజిల్లా మహిళా సంఘ నాయకురాలు శ్రీమతి మానికొండ సూర్యావతి దేశానికి ఏర్పడిన ఫాశిస్టు ప్రమాదం బెంగాల్ కరువులో లక్షల మంది మృతి మొదలైన విషయాలపై మాట్లాడుతూ అన్ని రాజకీయ పార్టీలు ఏకమై జాతీయ నాయకుల విడుదలకు ఉద్యమాలను నడపాలని, మహిళా సంఘాలు ఇంకా విరివిగా ఏర్పరచి సమాజంలో సగభాగంగా ఉన్న స్త్రీల పురోభివృద్ధికి కృషి చేయాలని ఉద్బోధించారు. జాస్తి సీతామహాలక్ష్మమ్మ, దేవులపల్లి సత్యవతి,ముల్పూరి చుక్కమ్మ గార్లు, మహిళా ఉద్యమం స్త్రీలలో చైతన్యం కలిగించిందని ప్రశంసిస్తూ మాట్లాడారు. అనంతరం సమిష్టిగానంలోను, శిశు ప్రదర్శన (అనగా బరువును బట్టి, ఆరోగ్యాన్ని బట్టి బహుమతులు) విచిత్ర వేషాలు మొదలైన వాటికి బహుమతులు ఇచ్చారు.

రాత్రి 11గం॥ల నుండి 2గం॥ల వరకు జరిగిన సాంస్కృతిక ప్రదర్శనలను 3500మంది స్త్రీ పురుషుల తిలకించారు. గుంటూరు జిల్లా మహిళా దళం వారు మోటూరు ఉదయం దళం సోవియట్ వీరవనిత టాన్యా బుర్రకథ చెప్పారు. మహిళా కార్యకర్తలు వెలుగులోకి అనే నాటికను ప్రదర్శించారు. అంతటి పురాతన రోజులలో మహిళల సామాజిక, సాంఘిక విలువలతో కూడిన నాటికలు మహిళలు ప్రదర్శించటం అంటె అది ఎంతటి గొప్ప సాంఘిక విప్లవదశో మనం అర్థం చేసుకోవాలి.

వెంకాయమ్మగారు నాయకత్వం వహించిన చివర ఉద్యమం:-

1964సం॥ ప్రారంభంలో ప్రభుత్వం రైతుల మీద భూమి శిస్తు పెంచుతూ చట్టం చేస్తున్న సందర్భంలో అఖిల పక్ష రైతు సంఘం అన్ని తాలూకా ఆఫీసుల వద్ద అదనపు భూమి శిస్తు చట్టానికి వ్యతిరేకంగా పికెటింగ్‌లు చేయమని పిలుపునిచ్చింది. ఒక్కొక్క రోజు ఒక్కొక్క గ్రామరైతులు నర్సాపురం తాలూకా ఆఫీసు వద్ద పికెటింగులు చేస్తున్నారు. పాలకొల్లు మహిళా సంఘం పరిసర గ్రామలలోని రైతు కుటుంబాలలోని మహిళలను సమీకరించి నర్సాపురం తాలూకా ఆఫీసు పికెటింగ్‌కి సిద్ధమయ్యారు. ఆ కార్యక్రమానికి జిన్నూరులో అప్పటికే ఆరోగ్యం పాడయి ఇంట్లోనే నిస్తబ్దతలో ఉన్న వెంకాయమ్మ గారి దగ్గరకు పాలకొల్లు మహిళలు వెళ్ళి జిల్లాలో ఉద్యమ నిర్మాత అయిన మీరే ఈ రైతాంగ మహిళల పికెటింగ్‌కి నాయకత్వం వహించాలి అని కోరి ఆహ్వానించారు. ఇద్దరూ ఉత్సాహంగా అనగా భూపతిరాజు వెంకాయమ్మ, ఉద్దరాజు మాణిక్యాంబ గార్లు హాజరై భూమిశిస్తు చట్టాన్ని ఖండిస్తూ తహశిల్దారుకి మెమోరాండం సమర్పించారు. ఒక 4 రోజుల వ్యవధిలోనే గ్రామాలలోని రైతాంగ మహిళలకు సమాచారం అందిస్తే బస్సులు మొదలైన ప్రయాణ సౌకర్యాలు లేకపోయినా కాలినడకన, చేలగట్లు వెంబడి పదేసి కిలోమీటర్లు నడిచి 200మంది మహిళలు అతి తక్కువ వ్యవధిలో హాజరై తమ చైతన్యాన్ని ప్రదర్శించారు. నర్సాపురం పట్టణంలో ప్రదర్శనగా వెళ్లి పికెటింగ్ చేసి ప్రభుత్వానికి హెచ్చరిక చేసాము.

వెంకాయమ్మ గారు 1968సం॥ నుండి బాగా సుస్తీ పడ్డారు. చివరకు మంచం పట్టారు. ఆమె భర్త కీ.శే. భూపతిరాజు లక్ష్మీనరసరాజుగారు స్వతంత్రం వచ్చాక జరిగిన మొదటి ఎన్నికలలో పాలకొల్లు అసెంబ్లీ స్థానంలో నిలబడి మొదటి శాసనసభ్యులుగా (ఎం.ఎల్.ఎ.) దీర్ఘకాలం జిన్నూరు గ్రామ సర్పంచ్‌గా ఈ శరీరం నాది కాదు ప్రజలది అన్నట్లుగా అత్యంత ఆదర్శవంతంగా తన సేవలందించారు. ఆ మహనీయుడైన భర్త అపురూపమైన నిరంతర సేవలలోనే ఆయన చేతులలోనే భూపతిరాజు వెంకాయమ్మగారు

1972 జూన్11వ తేదీ కన్నుమూసారు. మహిళల హక్కులే మానవ హక్కులు అనే ఆశయంలో ఆమె ఈనాటికి ఏనాటికీ చిరంజీవే.

జిన్నూరు గ్రామ పంచాయితీ గ్రామంలోని కుటుంబ తగాదాలు పరిష్కారం చేసే సందర్భంలో వెంకాయమ్మగారు, ఎక్కడ స్త్రీకి అన్యాయం జరుగుతుందో? అని పంచాయితీ న్యాయ నిర్ణయం చేసేవరకు వెంకాయమ్మగారు వారి మధ్యనే కూర్చునేవారు. ఆమె మార్గదర్శకంగా పాలకొల్లులో దాదాపు 30సం॥లుగా నడుస్తున్న మహిళా న్యాయ సహాయ కేంద్రం రజతోత్సవం 2007 డిశంబరు 28వ తేదీ జరిగిన సందర్భంగా మహిళా ఉద్యమ వ్యవస్థాపకులుగా వెంకాయమ్మగారి జ్ఞాపికలు ఆహ్వానితులకు అందించడం జరిగింది.

భూపతిరాజు వెంకాయమ్మ గారికి ఇద్దరు కుమార్తెలు ఒక కుమారుడు. భారతి, సూర్యాబాయి, భీమరాజు (కొడుకు). భూపతిరాజు సీతాదేవి (కోడలు) వెంకాయమ్మగారి వారసత్వంగా జిన్నూరు గ్రామంలోని ఝాన్సీలక్ష్మీ మహిళా మండలి అధ్యక్షురాలుగా ఆదర్శ మహిళా మండలిగా గుర్తింపుతో నిరంతరం సామాజిక సేవ సాగిస్తున్న ధన్యురాలు. అల్లే వెంకాయమ్మగారి ముని మనుమరాలు పెన్మత్స పద్మావతి రామచంద్ర రాజు, అణు శాస్త్రవేత్త స్వామీ జ్ఞానానంద గ్రామమైన భీమవరం దగ్గరలోని గొరగనమూడి గ్రామ సర్పంచ్‌గా చిన్న వయసులోనే ఆ గ్రామ ప్రజలకు సేవలందిస్తున్నారు. ముఖ్యంగా కొడుకు కీ.శే. భీమరాజు గారు ప్రజానాట్యమండలి కళాకారుడుగా ప్రముఖ హాస్యనటుడు అల్లు రామలింగయ్య గారితో కలిసి ప్రజానాట్యమండలి అధ్వర్యాన చిల్లర కొట్టు చిట్టెమ్మ వగైరా నాటకాలు, ఇంకా ముఖ్యంగా షాడో ప్లే, అనగా తెరవెనుక నటించే నీడతో అభినయం చూపించే కళా ప్రదర్శనలు సొంతంగా తయారు చేసి ఆనాటి రాజకీయాలకు సంబంధించిన ప్రదర్శనలకు జీవితం అంతా ధారపోసారు. ఆ కుటుంబ జీవితం సామాజిక సేవలతోనే సాగింది, సాగుతోంది.

భూపతి రాజు వెంకాయమ్మగారు పోడూరు గ్రామంలో జన్మించారు. పోడూరు, జిన్నూరు గ్రామాలు కవల పిల్లల వలె పక్కనే పక్కనే ఉండి వాటికి దగ్గరలో ఉండే వాలమర్రుతో సహా ఆదర్శ గ్రామాలుగా ప్రజా సేవలో ముందుండేవి. వెంకాయమ్మ గారి తల్లిదండ్రులు కోనూరు నరసమ్మ, పెదనారాయణరాజు గార్లు. వెంకాయమ్మ గారి సోదరులు డాక్టరు కోనూరి సీతారామరాజుగారు. జిల్లాలోనే ప్రముఖ హోమియోపతి వైద్య సేవకులుగా96సం॥ల వయసులో ఇప్పటికీ మంచి ఆరోగ్యంతో రోగులకు వైద్య సేవలందిస్తున్నారు. మేనల్లుడు అనగా డాక్టరు కోనూరు సీతారామరాజు గారి కుమారులు డాక్టరు సుందరరామ రాజు గారు, మనుమడు కూడా నిరంతరం ప్రముఖ హోమియోపతి వైద్య సేవలతో ప్రజానీకానికి మంచి ఆరోగ్యం అందిస్తున్న ఆదర్శ వైద్య సేవకులు. మరియు వెంకాయమ్మగారి మనుమడు చిట్టిబాబు అనగా భీమరాజు కొడుకు కూడా కళా రంగానికి సేవలు అందిస్తున్నాడు. ఇప్పటికీ జిన్నూరు గ్రామంలో భూపతిరాజు కుటుంబం అంతా అభ్యుదయ వాదులుగానే ఉన్నారు.



# శ్రీమతి హేమలతా లవణం



మార్చి 19వ తేదిన విజయవాడలో మరణించిన ప్రముఖ సంఘ సంస్కర్త, మానవతావాది హేమలత లవణం గారికి మానవి నివాళులు అర్పిస్తోంది.

శ్రీమతి హేమలతా లవణం ప్రముఖ కవి గుర్రం జాషువా కుమార్తె, ప్రముఖ సంఘ సంస్కర్త , నాస్తికవాది అయిన సరస్వతి గోరా కోడలుగానే సుపరిచితురాలు కాదు. జోగిని వ్యవస్థ నిర్మూలనకు కంకణం కట్టుకుని నిజామాబాద్ జిల్లా వర్ని మండలంలోని కోటయ్య క్యాంప్ అనే గ్రామంలో "చెల్లి నిలయం" స్థాపించారు. ఆమె కృషి వల్ల ఆ జిల్లాలో జోగిని వ్యవస్థను నిరోధించడం జరిగింది. అంతే కాదు 'సంస్కార్' సంస్థను స్థాపించి కరుడు గట్టిన నేరస్తులు(స్టూవర్టు పురం దొంగలు) తమ వృత్తి నుండి బయటపడేందుకు వారి జీవన స్థితిగతులను మార్చుకునేందుకు దోహదపడ్డారు.(ప్రస్తుతం సీతా నగరంలోని చాలా కుటుంబాలలోని పిల్లలు పెద్దపెద్దచదువులు చదివి ఉద్యోగాలలోను, వ్యాపారాలలోను స్థిరపడి ఉన్నతమైన జీవనం సాగిస్తున్నారు.)

బాణామతి ఒక ఆరోగ్య సమస్య అని తెలియజేస్తూ మూఢాచారాలకు వ్యతిరేకంగా ప్రచారం చేపట్టారు. అంతే కాకుండా పలు సేవా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొని తన ఔదార్యాన్ని చాటారు. ఆమె సంస్కర్తగానే కాక తండ్రి వారసత్వాన్ని తీసుకుని రచనలు కూడా చేసి రాష్ట్ర ప్రభుత్వంచే సాహిత్య పురస్కారం అందుకున్నారు.

విశ్వ మానవ దృక్పథంతో తన విశ్వసనీయతను చాటి చెప్పిన హేమలతా లవణం చిరస్మరణీయులు.

# ధైర్యసాహసి జానకి

- కె. సమత

జానకి అందరి ఆడపిల్లల్లాగే తన పెళ్ళి గురించి ఎన్నో కలలు కన్నది. తన భర్త, పిల్లలు, ఇల్లు అని ఎంతో గొప్పగా ఊహించుకొని ఊహాలోకంలో తేలియాడింది. జానక్కి పెద్ద చదువు లేకపోయినా మంచి సంబంధం కుదిరినందుకు అందరూ చాలా సంతోషించారు.

కాని జానకి భర్త రఘుకు లేని అలవాటు లేదు. జానకి పెళ్ళైన కొద్ది రోజుల్లోనే ఈ విషయం బయటపడింది. సముద్రంలో అటుపోటులా జానకి జీవితం నడవసాగింది. ఇది చాలదన్నట్లు భర్త రఘు, జానకిని, ఇద్దరి పిల్లల్ని కాదని తన వివాహ బంధాన్ని మధ్యలోనే తెంచుకొని తన దారిన తాను వెళ్ళిపోయాడు. జానకి తనలో తానేగుండె పగిలేలా ఏడ్చింది. చిన్నతనంలోనే తల్లి దండ్రుల్ని కోల్పోయిన జానకి గత్యంతరం లేని పరిస్థితిలో అన్నయ్యల పంచన చేరింది. జానకి తన పెద్ద అన్నయ్య ఇంట్లో 3 నెలలు ఉండేసరికి అక్కడ పరిస్థితి ఇబ్బందిగా తయారైంది.

పెద్ద వదిన జానకిని పెద్ద శత్రువులా చూస్తుంది. ఇంట్లో ...ఎపోటి మాటలతో జానకిని బాధ పెడుతుంది.

ఈయన పెద్ద పిచ్చిమాలోకం కాబట్టి ఈ దరిద్రాన్ని తీసుకొచ్చి ఇంట్లో పెట్టారు. మా మరిది చాలా తెలివైన వాడు కనుక న్యాక్‌గా తప్పించుకున్నాడు. ఆఖరికి అందరు కలిసి మానెత్తి మీద నిప్పుల కుంటి పెట్టారు. అదేమన్నంటే మొగుడూ వదిలేసి మనము చూడక అది ఒంటరిగా ఎలా బ్రతుకుతుంది అంటారు. ఈ రోజుల్లో ముగ్గురిని ఆయన ఒక్కడి సంపాదన మీద లాక్కురావడం అంటే మాటలా? నీ పిల్లలు ఏంగాను, వాళ్ళ చదువులు ఏంగాను, తెచ్చిదంతా ఇంటి ఖర్చులకు పోతే మిగిలేదేముంది? ఈ మంద వచ్చి ఇంట్లో చేరి పందికొక్కుల్లా తింటుంటే నేను, నా పిల్లలు అడుక్కుతినాలి, ఈ పీడ ఎప్పుడు విరగడ అవుతుందో గాని, అప్పటి వరకు నాకు మనశ్శాంతి ఉండదు అని జానకి పెద్ద వదిన పెద్ద పెద్దగా అరుచుకుంటూ పనిచేసుకుంటుంది.

వదిన అనే మాటలు జానకిని తీవ్ర మానసిక వేదనకు గురిచేసాయి. అయినా వదిన అన్నదాంట్లో తప్పేమీ లేదు. ఈ రోజుల్లో ఇంత మందిని పోషించాలటే కష్టమే. నేను, అన్నయ్యలకు భారం కాకుండా ఏదో ఒక పని చెయ్యాలి అని జానకి ఆలోచనలోపడింది.

ఆ మరుసటి రోజు అన్నయ్య, వదినలకు తన నిర్ణయం చెప్పింది. దానికి అన్నయ్యలు ఒకరి మొఖాలు ఒకరు చూసుకొని అదిగాదె నీకు ఇక్కడ ఇబ్బంది ఉండవచ్చు. కానీ నీవు ఒంటరిగా పిల్లలతో ఈ సమాజంలో బ్రతకడం చాలా కష్టం. అసలు నీవు బయటకెళ్లి ఏమి చేయగలవు? అదిగాక ఇద్దరన్నలు ఉద్యోగస్తులై ఉండి ఆడపిల్లని అలా ఒంటిరిగా వదిలేసారు అని నలుగురూ విమర్శిస్తారు అని అన్నారు అన్నయ్యలు. అది కాదన్నయ్యా మీరు నన్ను బాగానే చూడగలరు. కానీ ఎంతకాలం చూడగలరు? నేను, నా పిల్లలు ఎవరికీ భారం కా...డదు. నాకు నేనుగా బ్రతకడం నేర్చుకోవాలి. నా బ్రతుకుని నా పిల్లల భవిష్యత్‌ని నేనే తీర్చిదిద్దుకోవాలనుకుంటున్నాను అంది జానకి.

అయితే ఇప్పుడు మమ్మల్ని ఏమి చేయమంటావు? అన్నారు.

అదే అన్నయ్యా ఊరిలో మన పెంకుటిల్లు ఉందిగా అందులో నన్ను నా పిల్లల్ని తలదాచుకోనిస్తే చాలు అంది.

వదిన కలుగజేసుకుని భలే దానివే అది ఉమ్మడాస్తి. మీరు ఆ ఇంట్లో ఉంటే రేపు మాకు అవసరం వచ్చి అమ్ముకోవాలన్నా ఇబ్బందే అంది.

ముందు నీవు ఊరుకుంటావా? అక్కడకెళ్ళి దాని బాధలేవో అది పడతాను అంటుంటే మధ్య నీ గొడవేంటీ అన్నాడు జానకి అన్నయ్య. జానకి ఫర్లేదు అన్నయ్యా వదిన అన్నదాంట్లో తప్పేముంది? వదినా నేను కొంచెం నిలదొక్కుకునేదాక ఆ ఇంట్లో ఉండనిస్తే చాలు అంది.

చిన్న అన్నయ్య కలుగజేసుకొని “అమ్మా జానకీ మాతోపాటు నీకూ ఆ ఇంట్లో హక్కుంది కాబట్టి నీవు అక్కడ ఉండటానికి అభ్యంతరం చెప్పవలసిన అవసరం ఎవరికి లేదు” అని చెప్పాడు.

మరునాడు జానకిని, పిల్లల్ని ఊరిలోదించి అక్కడ జానకి అవసరాలకు కొంత డబ్బు చేతపెట్టి అలాగే ఇంటి పక్క ఉన్న ప్రెసిడెంట్ మామయ్యకు చెప్పి ఆఫీసులో సెలవు దొరక్క పోవడంతో అన్నయ్యలిద్దరు వెంటనే వెళ్ళిపోయారు.

జానకి ఆ ఇంటిని చూడగానే ఒక్కసారి ఏదో తెలియని అనుభూతికి లోనైంది. మరీ పెద్దది, మరీ చిన్నది కాని ఆ పెంకుటిల్లు, చుట్టూ ఖాళీస్థలం, ఇంటి ముందు పెద్ద వేపచెట్టు, అటు పక్కగా పొన్నాగ చెట్టు, ఇంటి వెనుక పెరడులో జామ చెట్టు, మామిడి చెట్టు, మంచినీళ్ళ బావి, అవి అన్నీ చూసి జానక్కి తన చిన్న నాటి రోజులు గుర్తుకువచ్చాయి.

అమ్మ ఉన్నప్పుడు ఇల్లు ఎలా ఉండేది? ఇంటి చుట్టూ పూలమొక్కలు, ఇంటి ముందు అరుగులు వాటి మీద ముగ్గులు, ఆ రోజులు ఎంత హాయిగా గడిచిపోయాయి అని ఆలోచిస్తుండగా, అంతలో పక్క ఇంటి సూరమ్మత్త జానకీ ఏమి చేస్తున్నావు అంటు ఇంట్లోకి వచ్చింది. ఇంటిని చూసుకుంటున్నావా? మొన్నేలే మీ అన్నయ్యలు ఇంటిని బాగు చేయించి రంగులు వేయించారు అంది. ఆ అవునత్తయ్యా రా కూర్చో అంది జానకి. అమ్మా జానకీ ఈ విషయం అంతా అన్నయ్యలు ఫోనుల్లో చెప్పారు. ఆ విషయం విని చాలా బాధపడ్డాను. మీ అమ్మ ఉంటే నిన్ను కడుపులో పెట్టుకొని చూసుకునేది. భగవంతుడు నీకు తల్లిని లేకుండా చేసాడు. అయినా నీకు ఏ భయం లేదు తల్లీ. మేము అందరం ఉన్నాముగా, నీకు నా కడుపున పుట్టకపోయినా నీవు నాబిడ్డలాంటిదానివే అంది. ఆ అసలు సంగతి మరిచిపోయాను. నీవు పిల్లలు మా ఇంటికి భోజనానికి రండి అంది. ఎందుకత్తయ్యా నీకు శ్రమ అంది జానకి. శ్రమ ఏముందమ్మా రేపటి నుంచి నీ పని నీకు తప్పదుగా, ఇక్కడ పని త్వరగా ముగించుకొని వచ్చేయండి. నేను వెళ్తాను మీ మామయ్య పట్నం నుంచి వచ్చే టైమ్ అయింది అని సూరమ్మత్త వెళ్ళిపోయింది.

సూరమ్మత్త మాటలు, ఆమె చూపిన ఆదరణ చూశాక జానకికి ఎంతో ధైర్యం వచ్చింది.

ఆ తరువాత కొద్ది రోజుల్లోనే ప్రెసిడెంట్ మామయ్య సహకారంతో అన్నయ్యలిచ్చిన డబ్బుతో పిల్లలిద్దర్నీ కాలేజిలో జాయిన్ చేసింది.

జానకి ప్రెసిడెంట్ మామయ్య, సూరమ్మత్తలతో కలిసి ఆలోచించి వడియాలు, అప్పడాలు, ఉప్పు మిరపకాయలు, పచ్చళ్ళ వ్యాపారం మొదలు పెట్టింది. పిల్లలు కూడా ఒక పక్క చదువుకుంటునే జానకికి అన్ని విధాలా సహాయం చేస్తున్నారు. కూతురు మధులత ఊళ్లో ఉన్న పిల్లలకు ట్యూషన్ చెబుతుంటే, వినోద్ ఉదయం పేపర్లు వేయడం, అలాగే తల్లి చేసిన పచ్చళ్ళు, వడియాలు పట్నంలో ఆర్డరిచ్చిన వ్యాపారం సంస్థలకు, హోటళ్ళకు వేసిరావడం చేస్తుండేవాడు.

ఆ విధంగా ఆ ఇంట్లో ముగ్గురు ఎంతో కష్టపడేవారు. కొద్ది రోజుల్లోనే జానకి చేసే పచ్చళ్లకి డిమాండ్ పెరిగి మంచి లాభాలు వస్తున్నాయి.

కొద్ది సంవత్సరాలలోనే మధులత, వినోద్ చదువులు పూర్తయి మధులత ప్రభుత్వ పాఠశాలలో టీచర్‌గా స్థిరపడింది. వినోద్ పట్నంలో జాబ్ చేయడం ఇష్టం లేక తల్లి చేసే పచ్చళ్ళ వ్యాపారాన్ని పెద్దది చేసి మరి కొంత మందికి ఉపాధి కలిగించి తాను మంచి లాభాలు సంపాదిస్తున్నాడు.

మధులత, వినోద్ కలిసి తాము వుంటున్న ఇంటి మీద ముందు ముందు ఏ గొడవలు రాకుండా ముందుగానే మామయ్యలతో మాట్లాడి వాళ్ళ అంగీకారం మేరకు జానకి వాటా తీసివేయగా మిగిలిన దానికి డబ్బు కట్టి ఆ ఇంటిని తల్లి పేర రిజిస్ట్రేషన్ చేయించారు. ఆ రోజు జానకికి చెప్పలేనంత ఆనందం కలిగింది.

ఆ రోజు ప్రెసిడెంట్ మామయ్య, అత్తయ్యా ఇద్దరూ వచ్చారు. అమ్మాయి జానకీ మొత్తానికి ధైర్యంగా నిలబడి, కష్టాలన్నీ ఎదుర్కొని నీ జీవితాన్ని నీకనుగుణంగా తీర్చిదిద్దుకున్నావు. కష్టాల్లో ఉన్న ప్రతి ఆడపిల్ల నిన్ను చూసి చాలా నేర్చుకోవాలి అన్నారు.

జానకి నవ్వి నాదేముంది మామయ్యా, మీరు, అత్తయ్యా, మా అన్నయ్యలు అందరూ నాకు అండగా ఉండడం వల్ల నేను, నా పిల్లలు ఈ స్థితికి రాగలిగాము. కష్టాల్లోనున్న ప్రతి మనిషి ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురు చూస్తూ ఉంటే జీవితం అంతా చీకటిలోనే గడచిపోతుంది. అలా కాకుండా ముందు మనం ఏం చేయాలో నిర్ణయించుకొని ఆ మార్గంలో పయనిస్తే కొంత కాలానికి మనం అనుకున్న గమ్యం చేరుకుంటాం.

అదేనమ్మా చీకటి చీకటి అని తిట్టుకోవడం కాదు, చీకటిలో ఒక చిరుదీపం వెలిగించు అన్నారు మన పెద్దలు. నీవు ఆపని చేసావు. ధైర్యే సాహసే లక్ష్మీ బదులు ధైర్యే సాహసే జానకీ అనాలి అన్నారు ప్రెసిడెంటు మామయ్య. దానికి అందరూ సంతోషంగా నవ్వారు. వారి నవ్వులతో శృతి కలిపినట్లుగా పెరడులో పూసిన మల్లెలు, మందారాలు, బంతులు, చామంతులు, జాజులు అన్నీ నిండుగా తలలూపాయి.

(14-7-2007న ఆకాశవాణిలో ప్రసారం అయింది)

# తక్కువ ఖర్చుతో ఎక్కువ పోషకాలు

-పి. రమాదేవి



బీట్‌రూట్ లో ఉన్న బలమైన యాంటీ ఆక్సిడెంట్, బీటాసియామైన్ వలన బీట్‌రూట్‌కు గాఢమైన ఎరుపు వర్ణంవచ్చింది. బీట్‌రూట్ రక్త శుద్ధికి, బిపి నివారణకు, క్యాన్సర్ నివారణకు కూడా తోడ్పడుతుంది. బీట్‌రూట్‌లో సిలికా అనే మినరల్ కూడా ఉంటుంది. దీని వలన ఆరోగ్యకరమైన చర్మము, గోళ్ళు, బోన్స్ కూడా పటిష్టగా తయారౌతాయి. అంతే కాకుండా బీట్‌రూట్‌లో సోడియం, పొటాషియం, పాస్ఫరస్, కాల్షియమ్, అయోడిన్, ఐరన్, కాపర్, బి1,బి2, బి3, బి6, సి విటమిన్స్ సమృద్ధిగా ఉంటాయి. బీట్ రూట్ మన శరీరంలోని కాలేయం, స్ప్లీన్, గాల్ బ్లాడర్ మరియు కిడ్నీలను శుద్ధి చేయడంలో బీట్‌రూట్ తోడ్పడుతుంది. బీట్ రూట్‌ను ఎక్కువగా తినుట వలన రక్తహీనత రాకుండా జాగ్రత్త పడవచ్చును. మన దేశంలో 6సం॥ల లోపు పిల్లలలో 69 శాతము, స్త్రీలలో 55 శాతము మంది అనీమియా బారిన పడటం మనకు తెలిసినదే. కాబట్టి విరివిగా దొరికే బీట్‌రూట్‌ను అనేక రూపాలలో మనము తీసుకోవచ్చు.

బీట్‌రూట్ పశ్చిమ ఆసియాలో మొట్టమొదట పండించబడింది. బీట్‌రూట్‌ని 2,000సం॥ల ముందు నుండే గ్రీక్స్, రోమన్స్ తినటం ప్రారంభించారు. ఇది అన్ని కాలాల్లో దొరుకుతుంది. జూన్ నుండి నవంబర్ నెలలో అత్యధికంగా లభిస్తుంది. ఇన్ని రకాలుగా ఉపయోగపడే బీట్‌రూట్‌ను అనేక రూపాలలో తీసుకోవచ్చును.

బీట్‌రూట్ ఐస్ క్రీమ్:-

కావలసిన పదార్థాలు:

| | |
|---|---|
| బీట్‌రూట్ | -250 గ్రాములు |
| పంచదార | - 150 గ్రాముల నుండి 200 గ్రాములు |
| పాలు | - ఒక కప్పు(చిన్నది) |
| కొబ్బరి తురుము | - ఒక కప్పు |
| యాలుకలు | -10 |
| ఎసెన్స్ | -2చుక్కలు (ఇష్టమైతే) |

**తయారు చేయు విధానము:-** ముందుగా బీట్‌రూట్ గడ్డలను శుభ్రముగా కడిగి పై చెక్కును తీసి చిన్న చిన్న ముక్కలుగా చేసుకొని మిక్సీలో వేయాలి. దానితోపాటుగా పంచదార కూడా వేయాలి. ఈ గుజ్జులో పాలను, యాలుకలుపొడిని వేసి బాగా కలపవలెను. తరువాత ఆ మిశ్రమాన్ని ఐస్‌క్రీమ్ సెట్స్‌లో నింపాలి. డీప్ ఫ్రీజర్‌ని క్విక్ ఫ్రీజ్ లోకి మార్చి గుజ్జుతో నింపిన ఐస్‌క్రీమ్ సెట్స్‌ని డీప్ ఫ్రీజర్‌లో ఉంచవలెను. 3,4 గంటలలో ఐస్ క్రీమ్ తయారౌతుంది. మనము తినాలనుకున్నపుడు ముందుగా ఒక గిన్నెలో నీరుపోసి 2లేక 3నిమిషాల పాటు ఐస్‌క్రీమ్‌లో సగం వరకు నీటిలో ఉండునట్లు చూడాలి. సెట్‌లో నుండి బయటకు తీసేటపుడు కొద్దిగా జాగ్రత్తగా తీసుకోవాలి. మనకు బయట దొరికే ఐస్ క్రీమ్ లాగా వస్తుంది. ఎండాకాలంలో ఇది చాలా బాగుంటుంది. ఇది కలర్‌ఫుల్‌గా చూడటానికి కూడా ఆకర్షణీయంగా ఉంటుంది.

# మేడిపండు

- సుధాకిరణ్. బి.

లక్ష్మి...

లక్ష్మి....

లక్ష్మీ.........

'ఎందుకలా గొంతు చించుకుంటారు! నేను ఇక్కడే ఉన్నాను'

'ఏంటి చెప్పండి....'

నికోసం.... నికోసం... నీకోసం...

ఏంటి శ్రీవారు మంచి హుషారు మీద ఉన్నారు!

డెలివరికి నాతో మీరు కూడా మా వూరు వస్తున్నారా! లేకపోతే స్వీటి స్కూలు పని చూడ్డానికి మీ అక్కని రావద్దని చెప్పబోతున్నారా..

'ఎప్పుడు మగవాళ్ళ చేత పని చేయించడమే నీ లక్ష్యమా! .సీతామహాలక్ష్మి అంటే ఎంత ఒద్దికైన పేరో అనుకున్నా... చేసుకున్నాక తెలిసింది.. సమానత్వం అంటూ హక్కులు మాట్లాడందే అవలించడం కూడా చేయని ఓ బ్రహ్మరాక్షసిని కట్టుకున్నానని...

'కట్టుకోవడమేంటండి నేనేమన్నా టవల్‌నా లేక చీరనా'... అయినా అన్ని పనులు నేనే చేయాలా ఎంటండి.. మీతో పాటు బయిట పని చేసి వస్తున్నా... మి అంత కాకపోయినా ఎంతో కొంత సంపాదిస్తున్నా.. ఇంటి పని సమస్తం నేనే చూస్తున్నా.. ఎపుడన్నా ఒంట్లో బాగోక పిల్లపని చూడమండటే 'నేనేమన్నా అడంగిలవాడినా అంటూ అరిచారే తప్ప ఇంటి పనిలో వేలు పెట్టరా'.... అదేమంటే హోటల్ కూడు తెచ్చారే.. కాని ఏప్పుడన్నా మీ చేత్తో మాకు ఇంత వండి పెట్టారు!.... 'ఇద్దరు పిల్లలు పెంచుకోవడం కష్టమని చెప్పానా! చదువులని, ఫీజులని '..అయినా విన్నారా.. 21వశతాబ్దంలో కూడా కొరివి పెట్టే కొడుకుండాలని ధీర్ఘాలు తీసారే.. నేను ఆఫీసు పని ఇంటిపని ఈవేవిళ్ళతో చేసుకోలేక ఎంత నరకం అనుభవిస్తున్నానో ఒక్కసారన్నా ఆలోచించారా! స్వీటి పుటకలకి ఆపరేషన్ అని చెబితే ఎంత టెన్షన్ పడ్డాను... ఆరునెలలకే డ్యూటిలో జాయిన్ అవమని ఎంత గోల పెట్టారు. ఇంకో మూడు నెలలు అన్నా ఉంటే బాగుంటుందని చెబితే వినిపించుకున్నారా! 'ఎందుకురా ఇంట్లో ఉంటే ఏదో ఒకటి తింటూ ఉంటావు.. మన యిద్దరం బయటకు వెళితే చుట్టానికి బాగోదు అంటూ ధీర్ఘాలు.... 'మీకు నేను గొంతు చించుకుని అరిచేదే వినిపిస్తుంది. సవ్యసాచి లాగా నేను పడే కష్టం మాత్రం మి కళ్ళకి కనిపించదు.. అసలు నేను పుట్టిందే మీ పనులు చేయడానికి అన్నట్లు..'

'అమ్మా.. తల్లి .. ఇప్పటి వరకు నీవు చదివిన దండకం చాలు... నువ్వు ఆయసపడి నీకేమన్నా అయితే ఆసుపత్రికి పరుగెత్తడం నావల్ల అయ్యే పని కాదు'.

అదిగో చూసారా!.. పుట్టే బిడ్డని బంతిలాగా చేసి యిస్తే నాకొడుకు అంటూ ఎగరేసి తిరుగుతారా! వాడి పనులన్నీ నేనే చయాలా? వాడు కడుపున పడ్డ దగ్గరనుంచి కాన్వెంటుకి వెళ్ళేదాకా నేను ఒళ్ళు పులిసిపోయేలా చేయాలా..అదేమంటే తల్లిప్రేమా అంటూ కబుర్లు చెబుతారు... పిల్లల పెంపకం సామాజిక బాధ్యత కాదా.. 'మీ మగాళ్ళు పిల్లల పనికి పూర్తిగా తల్లినే ఎందుకు బాధ్యురాలిని చేస్తారు ?'

'లక్ష్మి.... నువ్వు కొంచెం సేపు మాట్లాడకు.. నేను చెప్పది కొద్దిగా విను.. నీకు ఓ మంచి న్యూస్ వినిపిద్దామని ఆఫీసునుండి పెందలాడే ఇంటికొచ్చాను. కాని నువ్వు మాత్రం నాకు ఆ అవకాశం యిచ్చేలా లేవు.'

పేపరుచదవమన్నా , పుస్తకాలు చదవమన్నా అమడ దూరం పరుగెత్తే ఈయన ఈరోజు పేపరు ... వార్త అంటూ వచ్చారంటే ఏదో విశేషమే ఉంటుంది. అయినా వింటే పోలా... ఎలాగూ స్వీటి వచ్చేసరికి ఒ అర్ధగంట పట్టుద్ది. ఉండండి పక్కింటి పిన్ని గారు ఉడకబెట్టిన చనక్కాయలు ఇచ్చారు. అవి తెచ్చుకుంటా..తాపీగా తినడం మొదలు బెట్టింది...!

'కనీసం మొగుడికి పెట్టాలని ఆలోచించావా.. ఇన్ని చెప్పావు..'

'అదేంటండి నేను తినేది మీ బిడ్డకోసం కదా కొంటేగా నవ్వింది లక్ష్మి. ..

'ఎం మాట్లాడినా నాకే చుట్టుద్ది రాక్షసి...' అసలు విషయం పక్కదోవ పట్టేట్టుంది. 'ఈరోజు అన్ని పేపర్లు మీ గురించే వ్రాసారు తెలుసా..'

'ఇవాళ మార్చి 8 కాదుగా.. అంతర్జాతీయ మహిళా దినోత్సవం అనుకోవడానికి .. వెంటనే స్పందించింది లక్ష్మి..

అబ్బ. నువ్వు కాసేపు నోరుమూసుకుని నేను చెప్పేది విను..

మన ప్రభుత్వం మహిళకు కొన్ని హక్కులు కల్పిస్తుందంటా!

'ఉన్న హక్కులు అమలు చేసే దిక్కే లేదు. ఇంకా కొత్తవి ఏంటండి'.

'నిన్ను మాట్లాడవద్దన్నానా'... ముందు చెప్పిది విను... వాటిలో మెటర్నటీలీవు 90రోజుల నుండి 180రోజులకు పెంచడం. పొద్దుటి పూట ఆఫీసుకి ఆలస్యంగా పోవచ్చు.. సాయంత్రం ఇంటికి ముందుగా రావచ్చు... పిల్లల ఆలనా పాలనలో సుఖ సంతోషాలన్నీ పూర్తి గా అనుభవించవచ్చు... ఒకటేంటి లక్ష్మి.. మీరు ఎంత చక్కగా ఇల్లు చక్కబెట్టుకోవచ్చు.. సౌకర్యాలకి ..సౌకర్యాలు... ఉద్యోగానికి ఉద్యోగం.. '

'తొందరగా పిచ్చెక్కి మెంటల్ హాస్పటల్‌లో చేరచ్చు'..ఆనందరావు అనర్గళ వాక్ప్రవాహానికి లక్ష్మి మాటలు అడ్డుకట్టవేశాయి. .

అయోమయంగా తన వైపే చూస్తున్న ఆనందరావుని చూస్తుంటే .. పాపం అనిపించింది దో క్షణం లక్ష్మికి... అయినా మార్పు అనేది ఎక్కడో ఒక దగ్గర మొదలవ్వాల్సిందేగా.. . 'అయినా శ్రీవారు మీరు చదివేది 6వ వేతన కమీషన్ సిఫార్స్ గురించేగా.... అది ఇంకా పార్లమెంటులో పాస్ అవలేదు. .. దీని గురించి నేను రాత్రే న్యూస్‌లో చూసాను. దీనివల్ల వేమెందో సుఖపడిపోతామన్నాది ఒట్టి మాట..

. 'అది కాదు లక్ష్మి... '

ఆనందరావుగరారూ.. ముందు నేను చెప్పేది మీరు వినండి....తరువాత తమరు మాట్లాడుదురుగానీ... ఈ కమీషన్ సిఫార్స్‌లు పార్లమెంట్‌లో ఆమోదం పొందితే దాని వల్ల లాభం ఖచ్చితంగా మీ మగవారికే.. ఎలాగంటారా.. మామూలుగా మేము ఇంటేడు చాకిరి చేసి ఆఫీసుకి వెళ్ళాలి కదా! ఈ బిల్లు పాస్ అయితే ఒక అరగంట ముందు.. ఒక అరగంట వెనుక... '

ఇళ్ళల్లో కాస్తో కూస్తో పని చేసే మగమహారాజులు రేపటి నుండి ఏమంటారు? మీరు ఎపుడు ఆఫీసుకి వచ్చినా సమస్యలేదు కదా! అన్ని పనులు మీరే చూసుకోండంటారు..!. ఆఫీసుల్లో సిన్సియర్‌గా పనిచేసేది మహిళలే అని ప్రపంచ నివేదికలే చెబుతున్నది వాస్తమే కాబట్టి మేము సిన్సియర్‌గా 8గంటల పనిని 7గంటల్లో పూర్తి చేసి రిజల్ట్ సాధించడానికి విపరీతమైన ఆందోళనకు గురవుతాము... ఆఫీసులోనే క్రష్‌ల్లో ఉన్న పిల్లల్ని చూడాలా! పనే చేయాలా! ఇప్పటివరకు పనిలో మాతప్పులేకపోయినా బాస్‌లు ఆడవాళ్ళని పనిలో పెట్టుకుంటే ఇవే సమస్యలు అంటూ ఇబ్బందులకు చేస్తూనే ఉన్నారు. అలాంటిది పిల్లల్ని ఆఫీసులోనే ఉంచుకుని పని చేయడం అంటే ఎంతవరకు సహకరిస్తారు. తరువాత... ఇంటికొచ్చినా.. కుప్పలు కుప్పలుగా ఉన్న పనితో మేము సంతోషంగా ఉండగలమా.. 'అయినా శ్రీవారు...' 'నేను మొదట్లోనే చెప్పాను..పసిపిల్లల ఆలనా పాలన బాధ్యత ఒక్క తల్లిదేనా... తండ్రిది కాదా!... పిల్లల పెంపకం సామాజిక బాధ్యతని అభివృద్ధికాముకులందరూ గగ్గొలు పెడుతుంటే .....

'ఆ పేపరు ఇటివ్వండి ఈ తొక్కులు ఎత్తిపోయ్యాలి...' "లక్ష్మి డస్ట్‌బీన్‌లో వెసేది తొక్కుల్నా.... నామాటల్నా... ఆనందరావుకి తేల్లా'...



# సెలిమె

- జాజుల గౌరి

పడమట సూరీడు ఆత్రంగా అమ్మ వడిలకు వదిగిపోతున్నయాల, చుట్టు సందె చీకట్లు అలుముకుంటున్న యాల, కువ కువ మంటు పిట్టలు రయ్యి రయ్యిన ఎగిరి పోతూ గూళ్ళకు తిరుగు ముఖం పడ్తున్నయి. పొలాలల్ల కూలీనాలి చేసి అలసి సొలసి పాత చింపుల కుంచే గొంగళ్ళ మాటున సలికాచుకుంట యిండ్లకు తిరిగిపోతున్నప్పుడు మాదిగ వాడల కెల్లి ఒక గుంపు ఊరు మొఖానికి వస్తావుంది. ఆ గుంపు చంద్రమ్మను నడుమ పెట్టుకుని మౌనంగా కదిలివస్తా ఏదో బాధను తవ్వి పోసుకుంట తవ్వి పోసుకుంట నడుస్తావుంది.

పొలాలల్ల కెల్లి తిరిగొస్తున్నోళ్లు పక్క పక్కకు జరిగిపోతా రాళ్ళ లెక్క నిలవడి ఆ గుంపును సూస్తా గుడ్ల నీళ్ళు కుక్కకోవట్టిండ్రు.

యింకొందరికి దుఖ: తోటి కుతికలు ముడివడి ఏం మాట్లాడలేక రెండు సేతులను చెంపలకు ఆనించి "హా.........భగవంతా ఏమి రాత రాస్తివిరా!" అంట చంద్రమ్మను చూస్తుండగానే ఆ గుంపు ముందు నుండి కదిలిపోతావుంటే రస్తల అడ్డం వచ్చినోళ్ళు పక్కకు పక్కకు జరిగి నిలవడవట్టిండ్రు.

యింగ ఊళ్లెకుపోనికి పదంగల దూరం ఉండంగానే రాజమ్మ పెద్ద పెద్ద అంగలేస్త నడిసొచ్చి "నా యమ్మ......ఓయమ్మ ......నాబిడ్డే నీకెంత కష్టముచ్చెనే" అంట చంద్రమ్మను గుండెకు అదుముకుంట "ఏమి రాత రాసిండే దేవుడు....."అంట ఒక్క పెట్టున ఏడ్చేతాల్లకు మేనత్త చేతిల గువ్వలెక్క వదిగిన చంద్రమ్మ దుఖ: ఉప్పెన లెక్క ఎగసెగసి పడింది. గది సూసి సుట్టు ఉన్నోళ్ళ శోకం కట్టలు తెగింది.

నడితోవలనే ఒకలను వట్టుకుని ఒకలు ఏడుస్తా ఉంటే ......అంతట్లనే మొగోళ్ళు ముందట తేరుకొని "ఆ ..... పాండ్రి పాండ్రిరా! సీకటాళ్ళయింది జెల్దీ సేదు ఇడ్పించుకోని రావాలే జెల్ది నడువుండ్రి" అంట ముందుకు కదులుతుంటే గా గుంపులకెల్లి చంద్రమ్మ చిన్నత్త తేరుకొని "ఓ రాజమ్మ పిల్లను వట్టుకుని గల్లేడుస్తవేందిరా! నువ్వే గల్లేడుస్తే గా పిల్ల పుట్టెడు దుఖ:ంల వుండి యింకెట్ల ఏడ్వాలె" అంట ఆమెను పక్కకు గుంజేసి..చంద్రమ్మను దగ్గరకు తీసుకుంట గదువ కింద ఒక చెయ్యి ఉంచి రెండో సేతితో కండ్ల నీళ్లు తుడుస్త "వూకో..వూకో...నాయమ్మ నాయమ్మ వూకొ బిడ్డ. నీకు వచ్చిన కష్టం తక్వదా సెప్పు జర ఓర్చుకో కొడుకా" అంట ముందుకు దారితీసింది. గుంపు గుంపంతా కల్లు కంపౌనుకు పాయేతాళ్ళకు కల్లు కంపొండు జనంతోటి కిటకిట లాడవట్టింది.

ఆ గుంపు ఓ మూలన జాగ చూసుకుని నిలవడేతాళ్ళకు వంశపోల్లంతా ఒక్క తాన వరుసగా కూకుండ్రు. ఎంట వచ్చినోళ్లు తలా ఒక కల్లు సీసా తీసుకుని అందరి సేతులల్ల కొంచెం కొంచెం కల్లు పోస్త మిగిలిన కల్లు సీసాలను చెంద్రమ్మ ముందువుంచి పక్కకు జరుగ వట్టిండ్రు. సేదు ఇడిపించనీకి అరిచేతుల పోస్త పోతుంటే దాన్ని నోట్ల పోసుకుని నీళ్ళ పుక్కిలించినట్ల పుక్కిలించి ఉంచేయ సాగిండ్రు. చివరాకరికి మిగిలిన కల్లు సీసాను చంద్రమ్మ ముందుంచి వంశపోల్లందరికి తలా ఒక సీసా పంచి అందరు అది తాగంగనే సట్టున లేసి యింటి ముఖం పట్టిండ్రు.

అప్పటికి పూరగా సీకటి అలుముకుని సుట్టుపక్కల కెల్లి కీచురాళ్ళ రొద తోటి కప్పల బెక బెకలు కలగలిసి పోతుంటే దూరంగా కుక్కలు ఉండుండి అరుస్తున్నయి. రస్తల అందరు భారంగా నడిచిపోతుండ్రు. చంద్రమ్మ సూపంతా పొలాల దిక్కుపోయే రస్తంటనే ఉంది. చుట్టంతా కారు సీకటి అయినా ఎండి ఎలుగోలె పసిబిడ్డ నెత్తుకుని పొలం దిక్కు నడిసి పోతున్న యాది తలంపుకొచ్చి ఎర్రసూపులు చూస్తుంటే కడుపుల నుండి దేవినట్లయి కడుపు కోత యాదికొచ్చి దుఖ: ఎగదన్ను కొచ్చి "హ......హు.........హు..."అంట ఒక్క పెట్టున ఏడుస్తా ఏడుస్తా నా బిడ్డా ......ఓ......బిడ్డా.....అంట జోర్గ ఒర్లుతనే ఓసిలు తప్పి కుప్ప కూలింది.

అందరూ సట్టుక్కున తేరుకొని నలుగురు కలిసి చేతులల్లోకి తీసుకుని లేవదీస్తుండగనే మొగులయ్య సట్టుక్కున భార్యను భుజం మీదేసుకుని జెల్దీ జెల్ది యింటి దిక్కు నడుస్తుంటే చుట్టాలంతా గుంపు గుంపుగా ఎన్కవడి ఆత్రంగా ఉర్కెతాల్లకు సాయిబాన్ల పీట మీదో ముఖం మీద సల్లటి నీళ్లు చల్లే సరికి మెల్లగా కదలిక సురవై "........నా బిడ్డ.....నా....బిడ్డ..."అంట భారంగానే కండ్లు తెరిచినట్లనే తెరిచి మల్ల గుడ్లు తేలేసింది.

బిడ్డ కయాలు తప్పుడు చూసిన ఎల్లమ్మ "నాయమ్మ......నీకు ఎంత కష్టమొచ్చెనే నా తల్లి........"అంట శోకాలు పెడ్తుంటే, "ఏ ఊకో ఎల్లక్క ఊకో నువ్వే గిల్లేడుస్తే పిల్ల యింకా గుండెపగులుతది" అంట లచ్చవ్వ అనంగనే ఆమె ముఖానికి కొంగు అడ్డం పెట్టుకుని లోపల లోపలే కుమిలి కుమిలి ఏడ్వసాగింది. అందరి గుండెలు భారంతోటి బరువెక్కి ఎక్కడోళ్లక్కడనే బేజారుగా పంచలపొంటి కూర్చొని పచ్చి మంచీనీళ్లు ముట్టలే చెట్ల మీదున్న పిచ్చుకలు నిద్రలోకి జారుకుంటుంటే గవుడే మేల్కొన్న గుడ్లగూబలు ఉండుండి "గుర్రుర్....గుర్రుర్" మంట అరుస్తున్నయి.

నడి జాము దాటుతుండగా చంద్రమ్మ కయాలుకొచ్చి నెత్తితిప్పి అటు ఇటు సూసేతాళ్ళకు ఏడోళ్ళు ఆడనే కూసొనే కురుపట్లు పడ్తుండు చూసి మొగని దిక్కెల్లి సూసింది...దూరంగా పంచకు చేరగిలవడి నెత్తికి చేయి ఆనించి సీకట్లకు చూస్తుండు. గది చూడంగనే గుండె యింకింత చెరువై కండ్లల్ల కెల్లి దు:ఖం పొంగుకు రాంగనే కన్నీళ్ళు కాల్వలలెక్కె పోతా పోతా గుండె తలుపులు బళ్లున తెరుచుకుని యాదెంట ఉర్కినయి.

------------------

ఆయల్ల........ఆయల్ల........

తొలి కాన్పయి తల్లి గారింటి నుండి అత్త గారింటికి వస్తున్న చంద్రమ్మ తొలిచూరు బిడ్డనెత్తుకుని నిండుపున్నమి లెక్కుంది. పలుగురాళ్ళతోటి తొవ్వగుడిపి తంగేడి పూలేస్తా బిడ్డను సంటి పిల్లతోటి పలుగు రాళ్ళమీద నుంచి దాటిస్తా. "పైలము బిడ్డ సంటి పిల్లను మంచిగ చూసుకో, మందగల్ల ఇల్లు మీద ఏ పని సెయ్యకున్నా మాటలొస్తాయి కొడుకా...గట్లనే నీళ్లల్ల ఎక్వ నానకు పిల్లకు మొగులొస్తాయి, ఒక యాడాది దాక సంటిదాన్ని భద్రంగా సూసుకో, నడుమ నడుమ నేను నాయిన వస్తనే వుంటం తమ్ముడ్ని గూడ పంపుత తియ్యి బిడ్డా..."అంట బిడ్డకు ఆమాట ఈ మాట చెప్తనే "యింకా రెండు నెలలు ఉంచమంటే అప్పుడే తీస్కపోవడ్తివి జెర పిల్లలు పయిలం వొదినా....." అంట బిడ్డను అప్పజెప్పి బస్సెక్కించి పంపిస్తా... తోవ కనుమరుగయేే దాకా అంగలారుస్తుంటే ఎల్లమ్మ గుండె బరువెక్కింది.

గప్పటికి సెంద్రమ్మ అత్తగారింటికి వచ్చి నెలైయింది. కాన్పయి వెల్లిన కాణ్నించి ఊకే పిల్లను సూసుకుంట కూకుంటే యింట్ల



ఏమనుకుంటరోనని సంటి పిల్లను సూసుకుంట సూసుకుంటనే యింట్ల ఆ వని ఈ వని నగవెట్టవట్టింది. సిట్ట సిట్ట దినాలు గడుస్తున్నయి..సంటి పిల్ల బోర్లవడి నడింట్ల సందమామోలే పారాడ వట్టింది. బిడ్డను సూసి మొగులయ్య మస్తు మురిసిండు.

“ఎద్దు ఎవుసం గల్లయిల్లు పిల్ల యింట్లనే కూకుంటే పనెట్ల ఎట్లయితది చెప్పు” అంట అత్త సనుగుడు సురువు చేసే సరికి చెంద్రమ్మ యింట్ల పనులు చేసుకుంటనే పిల్లను ఓ కంట కనిపట్టుకుంట మిగతా టయిముల పొలం కాడికి గూడా పొయి సెట్టు కిద పిల్లనేసి పొలం పన్లు చేస్తా ఓ కన్ను పిల్ల దిక్కు ఎయ్యవట్టింది.

ఒకనాడు పొద్దుగాల్లనే కలేగూర గంపనెత్తుకుంట ...“ఓ పిల్లా నేను కూరలమ్మ పోతున్నగాని జెర బిరాన పని చేసుకుని పొలం కాడికి పోయి పాలకూర తెంపు, రేపు మనూర్లనే అంగడి ఉంది..... జెల్దీ పోవాలె.....” అంట అత్త చెప్తున్న మాటలు యింట్ల పనిచేస్తున్న చెంద్రమ్మ చెవిలపడి గింగురులు తిరుగుతున్నయి.

పదకొండాలకల్ల బిరానా పన్లు ముగించుకుని పిల్లను సంకనేసుకుని పొలం కాడికి పోయేతాళ్లకు ఎండకు పాలకూర నిగ నిగ లాడవట్టింది.

పొలం కాడున్న గడ్డాముల చింత సెట్టుకింద మంచి దాపు చూసి పిల్లను పొత్తిల్లల్లో వేసి పాలకూర మడిలకు పోయి పాలకూర కోసి కట్టలు కట్టుకుంటా గడ్డాము దిక్కు మనసు మర్లుతుంటే బిడ్డకు వినిపించేటట్టుగా పాటందుకుంది.

“లాలి లాలి జోలాలి
ఓ ఓ హాయి
కండ్ల నీళ్ళా నా తల్లి
ఓ ఓ హాయి ॥లాలి॥

నిన్ను యిడిసే యాలల్ల ఓ..ఓ..హాయి
ఎక్కి ఏడ్చే నా తల్లి ఓ ఓ హాయి
నాయిన వస్తే నా తల్లి ఓ ఓ హాయి
పందు తెస్తడు నా తల్లి ఓ ఓ హాయి
నాయి నొచ్చే దాకైనా ఓ ఓ హాయి
పండుకోరా నా కొండ ఓ ఓ హాయి ॥లాలి॥

నేను లేని యాలల్ల ఓ ఓ హాయి
చెట్టు కొమ్మే అమ్మాయే ఓ ఓ హాయి
ఊయలూగే యాలల్ల ఓ ఓ హాయి
నా యాదే నీ లాలాంట ఓ ఓ హాయి ॥లాలి॥

మదులల్ల నేనుంటే ఓ ఓ హాయి
సెట్టు దిక్కే నా పానం ఓ ఓ హాయి
నిన్ను మరువ నా సెందు ఓ ఓ హాయి
నన్ను ఇద్వు నా పందు ఓ ఓ హాయి ॥లాలి॥

సెట్టు పట్టు తేనిచ్చే ఓ ఓ హాయి
పట్టు కొమ్మ పూలిచ్చే ఓ ఓ హాయి
వెన్నెలల్లే మెరిసేవు ఓ ఓ హాయి
సందమామల్లె నవ్వేవు ఓ ఓ హాయి ॥లాలి॥

సక్కనమ్మ నా తల్లి ఓ ఓ హాయి
నిద్రపోరా నా కన్నా ఓ ..ఓ..హాయి
ఊయలూగు నా తల్లి ఓ..ఓ...హాయి
కంటి నిండా బజ్జోరా ఓ..ఓ...హాయి ॥లాలి॥”

ఒకనాడు ఎల్లమ్మ బిడ్డను పండుగకు తీసుకుపోదామని వచ్చేతాళ్లకు చంద్రమ్మ పొలం కాడుందని ఎర్కయి పొలం కాడికి బిర బిరా పోతుంటే తోవల గడ్డాము కాడ చెట్టు కింద మనుమరాలు ఉంగ...... ఉంగ... అంట బోర్లపడి మన్ను పెడ్డలతోటి ఆడుకునుడు సూసి ఆమె మనుసు మస్తు రంజి వద్దుంటే సంటి బిడ్డను సటుక్కున ఎత్తుకునేసరికి ఆవును చూసిన లేగ లెక్క సంటి పిల్ల ఏడుపందుకుంది. ముక్కుల కెల్లి కారుతున్న సీముడును నోట్లకెలి కారుతున్న జొల్లునంతా కొంగుతోటి తుడుస్త“ నా అమ్మనే.... ఊకో బిడ్డ.. ఊకో.. అని గుండెలకు అదుముకుంట బిడ్డ దిక్కెల్లి అటు ఇటు చూసింది. దూరంగా మడిల పాలకూర కోస్తా” కన్పించేసరికి మనుమరాలిని భుజం మీదేసుకుని అటు పోతనే “ఓ చెంద్రమ్మ ఏంది బిడ్డా పిల్లను గిట్ల వంటరిగిడిసి ఏందిరా..ఆపని...” అంటుంటే పాలకూర కోసుడు ఆపి చేతులు దులుపు కుంట తల్లి కాడికి బిర బిరా ఎదురొచ్చి ‘బాగునవాయె’ అంట నవ్వుతనే అడిగి సంటిపిల్లను తీసుకోంగనే “ఏంది బిడ్డా ఏంది ముత్యమంత పిల్లనేసుకుని గీ సర్దిల గీపనేందిరా.......” అంట బిడ్డను రంజిగ అడిగింది.

“ఆ... మల్ల ఏం జెయ్యమంటవే ఇంట్ల ఎవలమన్నా ఉట్టిగున్నమా సెప్పు. ఎవల పనులు ఆళ్ళకున్నయి. మా అత్త తిరిగి తిరిగి కూరలమ్మి వచ్చేతాళ్లకు గీద పచ్చకూరలు రడీగుండాలంటే యింట్ల పని అవంగనే పొలం కాడికి వచ్చి పాలకూర కోస్తున్న” అన్నది.

“కూలోళ్లను పెట్టుకోవచ్చు కదా” అన్నది.

“అమ్మ మా అత్తకు ఎట్ల చెప్తునే..’ అన్నది భయంగా

“చెప్పకుంటే ఎట్ల బిడ్డా.......గింత జెల్దీ పన్లకి దిగితే పిల్లకు సర్దయి మొగుల్లోస్తయి జెర భద్రం బిడ్డా...”అంట మనుమరాలిని దగ్గరకు తీసుకుని మురిపెంగా చూస్తా “అమ్మలు పండుగకు పోదాం యింటికి వస్తవామ్మ” అన్నది.

తల్లి పండుగకు తీసుకుపోను వచ్చిందని చంద్రమ్మకు సమజయింది.

ఆ మాట ఈ మాట మాట్లాడుకుంట మంచి చెద్దలు అర్సుకుని సేన్లకు కూరకట్ట పోయింది ఎల్లమ్మ.

పొద్దుగుంకి పోయేయాల్లకి కూరగాయల గంపతోటి వచ్చిన నర్సమ్మ వియ్యంకురాలిని మడిలసూసి దగ్గరకు పోతనే "ఎప్పుడొచ్చనవు వొదినా, అన్నగిట్ల బాగున్నరా" అంట పలకరింపు విన్పించి వెనకకు మర్లి చూస్తా. "బాగున్నరొదినా, మీరెట్లున్నరు? అంతామంచిగున్నరా? ఇయ్యాల పగటాళ్ళకల్లా యింటికొచ్చిన కానీ యింటికాడ ఎవలు లేరు యిగ పొలం కాడుంటరని తెలిసి ఇటొచ్చిన" అంటనే నర్సమ్మ ఈతనార చీరుతుంటే పాలకూర కట్టలుకడ్తనే "పిల్లను గింత జల్ది పన్లకు దించినవొదినా" అన్నది బాధతోటి.

"ఏం జేద్దు పిల్లా ఊర్ల కూలోళ్ళు దొరుకతలేరు నేనా అంగట్ల అంతా అమ్మివచ్చేతాల్లకు గింత యాళ్ళయితది గందుకనే" అని అనంగనే ఎల్లమ్మ మారు మాట్లాడక కట్టలు కట్టడంల మునిగింది.

పూరగా చీకటి పడే యాళ్ళకు యింటిముఖం పట్టింద్రందరు.

మర్నాడు ముని మబ్బులనే లేసిన ఎల్లమ్మ యింటికి పోను తయారయిత "పొలం కాడ మస్తు వనుందని మీ అత్త పండుగకుపంపనన్నది బిడ్డా పసి పిల్ల పయిలం జెర భద్రంగ చూసుకో. నేను పోయొస్త" అంట పసిపిల్లనెత్తుకుని గుడ్లల్ల నీళ్ళు తెచ్చుకుంట కదిలి పోతున్న తల్లి రూపాన్ని కన్నీళ్ళ మసకచేశాయి చంద్రమ్మకు.

దినాలు గడుస్తున్న కొద్ది యింటి పని పొలం పనితో చంద్రమ్మకు వశమయితలే అట్లని ఊకే కూకుండ ఆమెకు మనసొప్పక ఎట్లనో ఒకట్ల పిల్లను సమ్జయించుకుంటనే అన్ని పన్లు చేసుకోవట్టింది.

మొగులయ్య భార్య అవస్థను సూస్తనే వుండు కాని ఎద్దు ఎవుసం గళ్ళ యింట్ల ఎవలపని ఆళ్ళకు వుండి ఊపిరి సలపనిస్తలే.

యిటు యింట్ల అటు పొలం పని చేసేసరికి తల్లి సర్ది సంటి పిల్లకు తగిలి కుస్.. కుస్... అనవట్టింది.

ఆడికి మొగులయ్య పొలం కాడికి భార్యను పంపొద్దని తల్లికి చెప్పిండు అది విన్న నర్సమ్మ "మల్ల పెండ్లాన్ని పొలంకు పంపొద్దని బాగానే చెప్తున్నవు కానీ కూలోళ్ళను పెట్టి పొలం పనులు సేపియ్య రాదు" అంటూ కోపంగంటుంటే తల్లి ముందల గుటికెలు మింగిండు.

అందరి సేండ్లల్ల పొలం పనులు మస్తు జోర్గ నడుస్తుంటే కూలొళ్ళు దొరుకుడు కష్టం గుంది గట్లకాక ఆళ్ళు ఎంత అడిగితే అంత ఇచ్చే స్తోమత లేదు...అందుకే గమ్మునయిండు.

సలి కాలంకు తోడు తుఫాను పట్టి రెండు మూడు వాన జల్లులు పడ్డయి ఊరు ఊరంతా తడిసి ముద్దయితుంటే .........పొలం పని తప్పినా చంద్రమ్మకు యింటిపని తప్పలే. వానలో నానులూ ఆ పని ఈపని సుసుకునే తాళ్ళకు పిల్లకు సర్దితోటి వొళ్ళు ఎచ్చవడి జ్వరం పట్టింది.

ఆరం దినాలు గట్లనే గడిసే సరికి నర్సమ్మకు కాలుసేతులు ఆడలే పొలంల నీళ్ళనిండి పాలకూర ఏడకుళ్ళిపోతదో అని రంజి పడింది కానీ నాలుగోనాడు గౌరిచ్చింది. అందరు మల్ల పన్లపడ్డరు. ఐదోనాడు చంద్రమ్మకు పొలం పనులల్ల దిగక తప్పలే. పొలం కాడికి పోయి గడ్డాముల బిడ్డను ఎచ్చంగా పక్కపరిచి పాలు ఇయ్యపోతే పిల్ల సర్దితోనుండి సరిగి పాలు తాగలే పసిపిల్ల ముక్కులకెల్లి చీముడు కారుతుంటే కొంగుతోటి తుడిసి" ఏం బిడ్డా పాలు తాగుతలేవేందిరా" అంటుంటే సంటిపిల్ల నిదుర కండ్లతోటే సందమామోలే నవ్వింది. బిడ్డకు అట్లనే గుండేలకు అదుముకుని నెత్తి మీద ముద్దు పెట్టుకుంట "జెర నిద్రపోబిడ్డ జెల్ది జెల్ది కూర కోసొస్త" అంట గడ్డాముల బిడ్డకు పక్క పరిచి నిండుగ చీరగప్పి జోకొట్టె సరికి పసిపిల్ల నిద్రలకు జారుకుంది. "బిడ్డ సర్దితోటి మస్తు కుస్స కుస్స అయితంది. దబ దబ కూర కట్టి బిడ్డను తీసుకుని బిరాన యింటికి పోవాలే" అని మనుసులో అనుకుంట పొలం కాడికి పోయి సట్ట సట్ట కూర కోస్తా కోస్తా పనిల మునిగింది.

ఎంత సేపయినా అటు సెట్టు కింద నుండి కూడా సంటి పిల్లసప్పుడు లేక పోయేతాళ్ళకు తిండి తినడం మాని ఆత్రంగా పనిల వడింది.

పగటాల దాటుతుండగ నర్సమ్మ సరాసరి కోడలి తానకు వచ్చి 'ఏం పిల్ల బువ్వ తింటివా...బుడ్డ పిల్లకెట్లుంది' అనడుగుతుంటే 'తినలేదత్తమ్మ పిల్ల యింకా సుస్తిగానే ఉంది బిరాన పనిచేసుకుని పోదామని పనిలనే ఉన్న పిల్ల లేస్తే పోదామనుకుంటి, కాని బుజ్జి యింకా లేసినట్లులేదు." అంట గడ్డాము దిక్కు చూస్తుంటే

"సరే తియ్యి యింటి కాడ కట్టలు కడ్తాముగాని గంపల కూరంతా ఎత్తు పిల్లను తీసుకొస్తానంట నర్సమ్మ సెట్టు కాడికి పోతుంటే అటు దిక్కు తిరిగి చూస్తనే ఆకు కూరనంతా ఎత్తి గంపలో మట్టంగా పేర్చ సాగింది చంద్రమ్మ.

అంటతట్లనే గడ్డాము కాడికి చేరిన నర్సమ్మ చెట్టు కింద పసిపిల్లను చూస్తానే ఒక్క పెట్టున 'ఓయమ్మ" అంట కెవ్వున కేకేసి ఒర్లే తాళ్ళకు మడిల ఉన్న చంద్రమ్మ గుండె జల్లుమన్నది.

సేతులున్న పాలకూరను ఆడనే పడేసి గడ్డాము కాడికి ఒక్క అంగలో ఉర్కింది.

చెట్టు కింద బిడ్డను సూసేతాళ్ళకు మిఠాయి మీద ముసిరిన ఈగల లెక్క సలి సీమలు పసిబిడ్డ చుట్టు దట్టంగ ముసిరి వుండటం సూసి "నాబిడ్డ" అంట మీదకప్పి ఉన్న చీరను గుంజింది. కాని అప్పటికే చీర లోవల తెట్టలు తెట్టలుగా చేరిన చీమలు మిఠాయిని తింటున్నట్లుగా పిల్లను కొరికి పెడ్తుంటే చేతుల తోటి ఆత్రంగా దులపసాగిం. అంతట్లనే నర్సమ్మ యాప చెట్టుకాడికి ఉరికి యాపకొమ్మలను రప రప ఇరుసుకొచ్చి చీమలను పారదోలేసరికి అవి ఇద్దరి మీద కలబడ్డయి.

"ఓయమ్మ నా పిల్లను ఏం చేస్తయే" అంట ఏడ్సుకుంటనే యిద్దరు తలా ఒక దిక్కు దులిసేసరికి అవి బిల బిల మంటూ నలు దిక్కులకు సర్దుకుంట అడ్డొచ్చిన యిద్దరిని కరువవట్టినయి. అయినా అత్త కోడలు తంటాలుపడి సలిసీమల గుంపుల కెల్లి పిల్లను పక్కకు గుంజింద్రు. అప్పటికే పసిపిల్ల ఓసిలు తప్పి యిడువసందు లేకుండా రక్తం ముద్దయి గుడ్లు తేలేసింది. అత్త కోడండ్లిద్దరు సేతుల పిల్లనేసుకుని ఉరుకుల పరుగుల మీద ఉర్లకొచ్చే సరికి జనం గుమి గూడింద్రు. ఆత్రపడతా ఏ డాక్టరు కాడికి తీస్కపోయినా ఒక్క డాక్టరు కూడా చెయ్యి పట్టి చూడలే. అందరు కూడ పెద్ద దవఖానకు తీస్కపొమ్మని నీలపురి దవాఖానాకు రాసింద్రు.

అందరు గూడి ఆగమేఘాల మీద ఆ దవఖానకు పోతే ఎమర్జెన్సీల ఏసి గులుకోసు పెట్టింద్రు.

రెండు దినాలు కొన ఊపిరితో వున్న పసిపిల్ల మూడోనాడు ఊపిరి ఆపేసి కడుపుకోత మిగిల్చింది.

యాదినంతా నెమరేస్తూ ఎక్కెక్కి ఏడుస్తున్న భార్య దగ్గరకొచ్చిన మొగులయ్య నెత్తి మీద చెయ్యి వెయ్యంగానే రెండు చేతులు తోటి ఆ చెయ్యి పట్టుకుని సెలిమలెక్క మారుతున్న ఆమె ఏడుపుతో ఊరు ఊరంతా బళ్ళున తెల్లారి కన్నీటి సెలయేరయింది.





- వి.సుమతి

# తారే జమీన్ పర్

తల్లిదండ్రులకు పంచ్-తారే జమీన్ పర్

పేరు : ఇషాన్ నందకిశోర్ అవస్తి

(మమ్మీకి మాత్రం ఈనూ)

వయసు : ఎనిమిదేళ్లు

చదువు :మూడో తరగతి

హాబీలు: మమ్మీ యిచ్చిన వాటర్ బాటిల్‌లో స్కూలులోని సైడ్ కాలువ నుంచి చేపపిల్లల్ని సేకరించడం, టీచరు పాఠం చెబుతున్నప్పుడు కిటికీలోంచి ప్రకృతిని, పక్షుల్ని చూడడం.

పర్యవసానం : మాటిమాటికీ గెట్ అవుట్‌లు, క్లాసు బయట ఒంటి కాలి మీద నించోవడం, విసుగొచ్చి బంక్ కొట్టి రోడ్ల మీద చక్కర్లు, ఇంట్లో తెలిసాక పనిష్మెంట్‌గా హాస్టల్‌కు పంపడం.

ఇది ఒక్క ఇషాన్ కథ కాదు.

ఈ పోటీ ప్రపంచంలో పిల్లల అభిరుచినీ, వారి స్థాయినీ అంచనా వెయ్యలేని తల్లిదండ్రుల కథ. బిడ్డ పుట్టగానే వారిని డాక్టరును చెయ్యాలా.. ఇంజనీరును చెయ్యాలా అని తపన పడే తల్లిదండ్రుల కథ. పిల్లలు మెరిట్ సంపాదించలేక పోవడం, క్రీడల్లో ఓటమి పాలవడం, పాటల పోటీలో గెలుపొందలేకపోవడం అన్నీ తమ ప్రెస్టేజీకి భంగమని భావించే తల్లిదండ్రుల కథ. బిడ్డల భవిష్యత్తును తీర్చిదిద్దడమే ధ్యేయంగా గడియారంతోపాటు పరుగులు పెట్టే తల్లులూ, ఆశలతో సౌధాలు కట్టే తండ్రుల కథ.

ఆ తల్లిదండ్రులకు తమ బిడ్డల మనసులో ఏ ముందో తెలుసుకునే తీరిక వుండదు. వారి ఫెయిల్యూర్స్‌కు కారణమేమిటో కనుక్కోవాలని ఉండదు. ప్లానింగ్ మాత్రమే తెలుసు. ఆచరణలో ఎదురయ్యే అవరోధాల గురించి పట్టనే పట్టవు.

సరిగ్గా ఇదే ఇషాన్ విషయంలో జరిగింది. ఎనిమిదేళ్ల ఇషాన్ తల్లిదండ్రులకు రెండో కొడుకు, బ్రిలియంట్. చదువులోనేకాదు, టెన్నిస్‌లో కూడా బెస్ట్. చిన్ని ఇషాన్‌కు 'డిస్లెక్సియా' అనే మానసిక సంబంధమైన ఇబ్బంది ఉంది. ఒక్కసారిగా రెండు మూడు విషయాలు చెబితే అర్థం చేసుకోలేక వాడి చిన్న బుర్ర సతమతమై పోతుంది.

ఆల్జీబ్రా, అర్థమెటిక్స్,సైన్సు, సోషల్, కూడికలు, తీసివేతలు, యూనిట్ టెస్టులు అంటూ టీచర్లు పెట్టే ఘోష వాడికి గందరగోళంగా వుంటుంది.

ఫలితంగా ఎప్పుడూ గెటవుట్‌లే. స్కూలు బంక్ కొట్టి వీధుల్లో పడిన ఇషాన్‌కి ఎన్నో అద్భుతమైన అనుభవాలు. .బహుళ అంతస్తు భవనానికి కర్ర నిచ్చెన సాయంతో ఎక్కి సున్నం వేస్తున్న మనిషి, రోడ్డు పక్కన పీచు మిఠాయితో బొమ్మలు చేసేవాడు, మంచ మీద పడుకుని జగ్గుతో నీళ్ళు నోట్లో వొంపుకు తాగే పెద్ద మనిషి, పిల్లలకు ఆహారం నోటికి అందిస్తున్న పిట్టలు. అన్నీ అద్భుతాలే.

పెయింటింగ్ పట్ల అమితాసక్తిగల ఇషాన్ కాగితం, రంగులతో ప్రయోగాలు చేస్తుంటాడు. కుక్కలతో ఆడుకోవడం, ఇరుగు పొరుగు పిల్లలతో తగాదాలు పెట్టుకోవడం నిత్యకృత్యాలు.

స్కూలు నుంచి పిలుపు వచ్చి వెళ్లిన ఇషాన్ తల్లిదండ్రులకు ప్రిన్సిపల్ నుంచి కఠినమైన వార్నింగ్ వస్తుంది. ప్రతి సబ్జెక్టులో ఫెయిల్ అవుతున్న కారణంగా స్కూలు నుండి పంపించి వేస్తారు. ఫలితంగా ఇషాన్‌ను సంవత్సరం మధ్యలోనే హాస్టలులో చేరుస్తారు.

తల్లి గారాబం నుండి దూరం కావడం ఇషాన్ భరించలేడు. అంతటి అల్లరి పిల్లవాడు స్తబ్దంగా మారతాడు. విద్యార్థుల కెరీర్ మీద సర్వశక్తులు ఒడ్డుతున్నామనే టీచర్లకు ఇషాన్ ప్రవర్తన అంతుపట్టదు. ర్యాంకులు సంపాదించలేదనే, అసంతృప్తితో ఇషాన్ పట్ల క్రూరంగా వ్యవహరిస్తారు.

అప్పుడే ప్రవేశిస్తాడు రామ్ శంకర్ నికోమ్. డ్రాయింగ్ టీచరు. పిల్లల మానసిక స్థితి అంచనా వేయగలిగిన నికోమ్ ఈషాన్‌కి డిస్లెక్సియా అని గుర్తిస్తాడు. అతడిని సరిచేస్తానని ప్రిన్సిపాల్‌కి హామీ ఇచ్చి తన ఆటపాటలతో ఆకట్టుకుని మళ్లీ ఇషాన్‌లో పెయింటింగ్ పట్ల ఆసక్తిని కలిగిస్తాడు. డ్రాయింగ్ టీచర్‌గా అమీర్‌ఖాన్ ఆ పాత్రలో జీవించాడు.

ఇది ఒక్క ఇషాన్ కథ గాదు. టెన్త్‌క్లాసు ఫెయిల్ అయినా కూడా పాసయ్యాడని అబద్ధం ప్రచారం చేసిన తల్లి కారణంగా ఆత్మహత్య చేసుకున్న ప్రసాద్ కథ. 16 ఏళ్ల వయసులో క్షయ వ్యాధి సోకితే పది మందికీ తెలిస్తే పెళ్లి కాదేమోనని చికిత్సకు నోచుకోక మృత్యువాత పడిన లక్ష్మి కథ. ఇంజనీరింగ్ కాలేజీలో ర్యాగింగ్ కారణంగా మానసిక బలహీనతకు గురై చదువు నిలిపేస్తే సరైన సమయంలో ఆదుకోని తల్లిదండ్రుల కారణంగా పిచ్చివాడని ముద్ర వేయించుకున్న రవి కథ.

పిల్లల్ని దారిలో పెట్టడానికి హాస్టళ్లు ఉపకరిస్తాయనడం శుద్ధ తప్పు. ఇషాన్‌కి రామశంకర్ నికోమ్ టీచర్‌గా లభించడం యాదృచ్ఛికమే.

ముప్పయి ఏళ్ళ క్రితం ఒక స్కూలులో జరిగిన పేరెంట్స్ మీటింగ్‌లో ఎల్‌కెజి చదువుతున్న తన కొడుకుని మూడు గంటల పాటు కష్టపడి రెడీ చేసి పంపితే గంటన్నర మాత్రమే స్కూలులో ఉంచుతున్నారని ఒక తల్లి ఆవేదన వ్యక్తం చేసింది. అందుకు సమాధానంగా ఆ స్కూలు ప్రిన్సిపాల్ విదేశాలలో తొమ్మిది సంవత్సరాలకు గాని పిల్లల్ని బడికి పంపరనీ, ఒక బిడ్డను సముదాయించలేని తల్లులు వందలాది మందిని హాస్టలులో ఎలా సంబాళించ గలరనుకుంటున్నారని ప్రశ్నించింది.

రచయిత్రి దీపాభాటియా అందించిన కథను అమీర్‌ఖాన్ తెరకెక్కించిన తీరు అమోఘంగా వుంది. ఇంతకు ముందు లగాన్, మంగళ్‌పాండే, రంగ్‌దే బసంతి చిత్రాల ద్వారా ప్రేక్షకుల మస్తిష్కాలకు పని కల్పించిన అమీర్‌ఖాన్ ఈ సారి తల్లిదండ్రుల మెదళ్లకు పదును పెట్టడానికి ప్రయత్నించాడు. హాట్సాఫ్ టు హిమ్.

11ఏళ్ల దర్శీల్ 'ఇషాన్' పాత్రలో నటించడమేకాదు, బెస్ట్ యాక్టర్‌గా ఫిల్మ్ ఫేర్ అవార్డును అందుకున్నాడు కూడా.



# ఉద్యమాల బాటలో

## న్యాయ పోరాటం ముందు ఏ శక్తి ఆగదు

ఆయేషా మీరా హత్య కేసు రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. అసెంబ్లీలో ప్రతిపక్షాలు ఆయేషా మీరా కేసుపై ప్రభుత్వాన్ని నిలదీశాయి. 2007డిశంబరు నెలలో కృష్ణాజిల్లాలో ఐదుగురు అమ్మాయిలు ప్రేమోన్మాదంతో హత్యగావింపబడ్డారు. ఆయేషా కేసు ప్రేమ ఉన్మాదంలో జరిగిన హత్య కాదు. అసాంఘిక కార్యక్రమాలకు నిలయంగా మారిన హాస్టల్‌లో అతి పాశవికంగా ఆయేషా హత్య కావింపబడింది. ఆయేషా కేసు మాత్రమే ఇంత పెద్ద చర్చనీయాంశం కావటానికి కారణాలేమిటి పరిశీలించాలి.

మనం గమనించాల్సింది ఆయేషా తల్లిదండ్రుల నిబద్ధత, నిర్భీతి, న్యాయం కోసం పోరాడాలనే అకుంఠిత దీక్ష. తమ బిడ్డలాగా ఏ తల్లిదండ్రులకు కడుపుకోత అనుభవించకూడదనే పట్టుదలతో మూడునెలలుగా అసలైన దోషులు శిక్షించబడాలని న్యాయపోరాటం చేస్తున్నారు. ముఖ్యమంత్రిని తమ బిడ్డను చంపిన హంతకులను శిక్షించాలని కోరింది రాష్ట్రాన్ని ఏలే పాలకులు దుండగులను భుజానవేసుకుని బిడ్డకు ఖరీదు కట్టాలని చూస్తే ఆయన ఎదుటే తిరస్కరించారు తల్లిదండ్రులు. 'మీరు రిజర్వు బ్యాంకు తీసుకువచ్చి నా ముందుపెట్టినా నాకవసరం లేదు. నా బిడ్డను చంపిన వారు నిర్భయంగా తిరుగుతున్నారు. వారిని శిక్షించండి' అని సమాధానం చెప్పింది.

తెనాలికి చెందిన బాషా, షంషాద్ బేగమ్ దంపతులకు ఇద్దరు కుమార్తెలు. తండ్రి బాషా తెనాలిలోని ఓ ప్రైవేటు స్కూలులో టీచరు. తల్లి షంషాద్ బేగమ్ రేపల్లె కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. ఆయేషా తెలివైన విద్యార్థిని. చదువులో ఎప్పుడూ మొదటి ర్యాంకులో ఉండేది. పేదరికంలో ఉన్నా పిల్లలను ఉన్నత చదువులు చదివించాలని ఆకాంక్షతో ఇబ్రహీంపట్నం మైనార్టీ కళాశాలలో బి.ఫార్మసీలో చేర్పించారు.

కాలేజీలో హాస్టల్ సౌకర్యం లేకపోవటంతో దుర్గా లేడీస్ హాస్టల్‌లో చేర్పించారు. హాస్టల్‌లో చేరి నెలా పదిహేను రోజులు మాత్రమే అయింది. బక్రీదు, క్రిస్టమస్ పది రోజులు సెలవులకు వెళ్ళి డిశంబరు 26న సాయంత్రం ఆరున హాస్టల్‌లో దింపి వెళ్ళిన



విజయవాడ లెనిన్ సెంటర్ లో ఆయేషామీరా హత్యకు నిరసనగా మానవహారం.



ఆయేషామీరా కేసుకు సంబంధించి సి.పి ఆనంద్ కు మెమొరాండం ఇస్తూ.....

తల్లికి 27 ఉదయం ఆరు గంటలకు అశనిపాతంలాంటి వార్త అందింది. 27వ తేదీ ఉదయం ఐదుగంటలకు బాత్‌రూమ్ ముందు రక్తపు మడుగులో నగ్నంగా పడివున్న ఆయేషా మృతదేహాన్ని రూమ్‌మేట్ చూసి భయకంపితురాలై వార్డెన్‌కి తెలియజేసింది.

తెల్లవారుజామున మూడున్నరగంటలకే జరిగిన ఈ హత్యాఘటన మొత్తం వార్డెన్ కుటుంబానికి ప్రమేయం లేకుండా జరిగింది కాదు. హాస్టల్ మొదటి అంతస్తులో వార్డెన్ కుటుంబం ఉంటుంది. రెండవ అంతస్తులో 62మంది విద్యార్థినులు రెండు ప్లాట్లలో ఉన్నారు. ఆయేషా హత్య జరిగిన రోజు మొత్తం ఎనిమిది మంది ఆ రూముల్లో ఉన్నారు. ఏ ఒక్కరూ కూడా తమకు తెలిసిన విషయాన్ని చెప్పటానికి ముందుకు రావటం లేదు. హాస్టల్ వార్డెన్ ఒక ప్రముఖ వ్యక్తి బంధువు. ఘటన జరగగానే ఆధారాలు లేకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. వాళ్ళ పలుకుబడి, ధనబలం ఉపయోగించి కేసు నుండి తప్పుకునే ప్రయత్నాలు జరిగాయి. పోలీస్ యంత్రాంగం, బడానేతలు అసలైన దోషులను పక్కన పెట్టి తెనాలికి చెందిన ఆయేషా బంధువులను కేసుల్లో ఇరికించాలని చూశారు. ఇంటరాగేషన్ పేరుతో పదే పదే పోలీస్ స్టేషన్‌కి త్రిప్పి కేసును వెనక్కు తీసుకునేటట్టుగా వత్తిడి చేశారు. పోలీసు అధికారులు తల్లిదండ్రులను మీరు మీడియాతోకానీ, సంఘాల వద్దకు వెళ్ళవద్దని హెచ్చరించారు. 2నెలల తర్వాత కేసుతో ఏ మాత్రం సంబంధంలేదని గుర్విందసింగ్ (లడ్డు) రౌడీషీటర్‌ను డబ్బు ఆశచూపి అతనిపై నేరాన్ని అంగీకరింపచేయాలని పోలీసు అధికారులు ప్రయత్నాలు చేసారు. అతనికి నార్కో ఎనాలసిస్ టెస్టులు చేయించారు. కేసుతో అతనికి ప్రమేయం లేదని తేలింది. ప్రస్తుతం తండ్రి బాషా బంధువులపై ప్రభుత్వ దృష్టి మళ్లింది. కేసును నీరుగార్చే ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నారు.

మహిళలపై జరుగుతున్న హింసను చాలా కేసులలో మౌనంగా భరిస్తారు. కొన్ని కేసులు అస్సలు వెలుగులోకి రావు. డబ్బు, అంగబలంతో పోలీసు స్టేషను వరకూ వెళ్లవు. శవం అక్కడ వుండగానే

రాజీలు చేసి కేసు లేకుండా చేసే ఘటనలు అనేకం. అయేషా తల్లిదండ్రులు మాత్రం గర్భశోకాన్ని భరిస్తూనే తమకు న్యాయం కావాలని, ఇంకో బిడ్డ ఇలా బలిపశువు కాకూడదని నిద్రాహారాలు మాని రాష్ట్రమంతా తిరిగారు. తాము డబ్బుకోసం ఈ పోరాటం చేయటంలేదని, న్యాయం కావాలని ప్రభుత్వం యిచ్చిన ఎక్స్‌గ్రేషియాను తిరస్కరించారు. అమెరికా నుండి ఒక దాత 25,000రూ॥లు చెక్ పంపితే స్కూలుకి విరాళంగా యిచ్చిన ఉదాత్తులు. మైనార్టీలలో మహిళలు చదువు, ఉద్యోగాలలో వెనకబడిఉన్నారు. షంషాద్ చదువుకోవటమేగాక తన బిడ్డలను కూడా ఆ పద్ధతిలో చూడాలని కలలు గన్నది. ఆ కలలు కల్లలయ్యేసరికి ఆ తల్లిదండ్రుల ఘోష చెప్పనలవిగాదు. వారి పోరాటానికి మద్దతిద్దాం. డబ్బు, పలుకుబడితో ఏ ఘోరాలు చేసినా చెల్లుబాటవుతుందని భావించేవారికి బుద్ధి చెప్పాలి. ఐద్వా వారు చేస్తున్న పోరాటానికి సంపూర్ణ మద్దతు తెలియచేస్తున్నది. రాష్ట్ర వ్యాపితంగా హత్యకు నిరసనగా ఆందోళన నిర్వహించమేగాక హోం మంత్రికి, మానవహక్కుల కమీషన్, జాతీయ మహిళా కమిషన్‌కి మెమోరాండం యిచ్చింది. ముఖ్యమంత్రికి 40వేల పోస్టుకార్డులు పోస్ట్ చేయించింది.

డబ్బే సర్వస్వం, డబ్బుతో న్యాయాన్ని చట్టాలను కొనగలమని కొందరు దుర్మార్గులు విర్రవీగుతున్న ఈ రోజుల్లో షంషాద్ బేగం భాషా (అయేషా తల్లిదండ్రులు) నిర్వహిస్తున్న పోరాటం. ప్రతి తల్లి దండ్రులకు స్ఫూర్తి కావాలి. వారి బిడ్డ మనందరి బిడ్డగా భావించాలి.

**న్యాయసలహాకేంద్రం రజితోత్సవం :**

పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లులో మహిళా న్యాయ సహాయ కేంద్రం రజతోత్సవం, సమతా మహిళా విజ్ఞాన భవనం దశమ వార్షికోత్సవ సభలు 28-12-07వ తేది పాలకొల్లులో అత్యంత ప్రతిష్టాత్మకంగా జరిగాయి. 1979సం॥నుడి స్త్రీలకు కుటుంబం, సమాజపరంగా జరిగే అన్యాయాల పరిష్కారంకోసం మహిళా సంఘం నిరంతరం చేస్తున్న కృషి ఫలితం అది.

న్యాయ సహాయ కేంద్రం అధ్యక్షురాలు టి. ప్రభావతి గారి అధ్యక్షతన జరిగిన ఆ సభకు శ్రీమతి కారుమంచి రమాదేవి గారు


సదస్సులో మాట్లాడుతున్న సాంఘిక సంక్షేమ మండలి చైర్మన్ కారుమంచి రమాదేవి.

ముఖ్య అతిధిగా హాజరయ్యారు. (ఆంధ్ర ప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖ చైర్మన్), ఇంకా ప్రభుత్వాధికారులు, తహశీల్దారు, ఐ.సి.డి.యస్. అధికారులు, మున్సిపల్ చైర్‌పర్సన్ పి.సుజాత, టి. సుజాత ఆచంట ఎమ్.ఎల్.ఎ., శ్రీ శ్రీనివాస్, అడ్వకేట్ (లీగల్ సెల్ సలహాదారు), టి.జ్యోతి, ఐద్వా రాష్ట్ర అధ్యక్షులు, మోటూరు టాన్యా, ఉదయం ట్రస్టు కోశాధికారి, ఇంకా జిల్లా మహిళా సంఘం అధ్యక్ష, కార్యదర్శులు ఎ. అజయకుమారి, జి. విజయలక్ష్మి, గౌరవాధ్యక్షురాలు అన్నె అనసూయ గారు పాల్గొని సందేశమిచ్చారు.

ముఖ్య అతిధి కారుమంచి రమాదేవి గారు మాట్లాడుతూ దీర్ఘకాలంగా నడుస్తున్న న్యాయ సహాయ కేంద్రం ఆధ్వర్యాన పరిష్కారమైన స్త్రీల సమస్యలు సమాజంలోని రుగ్మతలకుకారణమైనవని, వాటిని రూపమాపుటలో మహిళా సంఘం ఆదర్శంగా కృషి చేస్తున్నందుకు అభినందనలు తెలిపారు. ఈ న్యాయ సహాయ కేంద్రానికి ప్రభత్వపరంగా సహాయం అందించగలమని అన్నారు. అట్లే తహశిల్దారు గారు కూడా ప్రభుత్వ పరంగా మహిళా సంఘానికి సహాయం అందిస్తానని ప్రకటించారు. పి. సుజాత గారు ఎం.ఎల్.ఎ. మాట్లాడుతూ సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలు అరికట్టుటకు అందరం కృషి చేయాలన్నారు. మున్సిపల్ చైర్‌పర్సన్ పి. సుజాత గారు కూడా పురుషాధిక్య సమాజంలో మహళల బాధలు అనంతం. సామాజిక న్యాయం కోసం అందరూ కృషి చేయాలన్నారు. అడ్వకేట్ శ్రీనివాస్ గారు లీగల్‌సెల్ ద్వారా పరిష్కారమైన కేసుల సమాచారం ఇచ్చారు.

1938సం॥లోమొదటిసారిగా మహిళల సమావేశం జరిపి మహిళా సంఘం నిర్మాణానికి బీజం వేసిన శ్రీమతి భూపతిరాజు వెంకాయమ్మగారి జ్ఞాపికలు ఆహ్వానితులకు అందజేయటం జరిగింది.

**మార్చి8 :**

మహిళా దినోత్సవం సందర్భంగా ఐద్వా ఆధ్వర్యంలో 7చోట్ల సదస్సులు జరిగాయి. మొత్తం 600మంది హాజరయ్యారు. నల్గొండజిల్లా నకిరేకల్‌లో 250మందితో, హైదరాబాద్-250, ఆదిలాబాద్-500మంది,అనంతపురం గుంతకల్‌లో-300మందితో



సదస్సు అనంతరం బెల్టుషాపులపై దాడిచేసి సారా, బ్రాందీ బాటిళ్లను పగలగొట్టడం జరిగింది. ఈ కార్యక్రమంలో 1000మంది పాల్గొన్నారు. కర్నూలులో 3డివిజన్‌లలో,ప॥గోదావరి జిల్లా మహిళారిజర్వేషన్ బిల్లును ప్రవేశపెట్టనందుకు నిరసనగా దిష్టిబొమ్మ దగ్దం, 3 పట్టణాలలోసదస్సులు, విశాఖలో 7 చోట్ల, సదస్సులు, హింసను నిర్మూలిద్దాం అనే నినాదంతో బ్యానర్‌పై సంతకాలు కార్యక్రమం, విజయనగరంజిల్లా ఎస్.కోటలో 100మందితో హింసపై సదస్సుల జరిగింది.

**అత్యాచారఘటనపై :**

మార్చి 11వ తేది హైదరాబాద్ పాత బస్తీలో 8 ఏళ్ళ బాలికను తల్లి చిల్లర సరుకుల కొరకు పంపగా, అదే బస్తీలోని వ్యక్తి ఆ బాలికను మాయమాటలతో మభ్యపెట్టి అత్యాచారం జరిపాడు. ఆ బాలికను తల్లి దండ్రులు వెంటనే ఆసుపత్రిలో జాయిన్



చేసి కేసు నమోదు చేశారు. పోలీసులు ఆ నిందితుడ్ని అరెస్ట్ చేశారు. ఐద్వా రాష్ట్రనాయకులు హైమావతి హైదరాబాద్ నగరకమిటి సభ్యులు, మధు ఎం.పి గారు ఆసుపత్రికి వెళ్ళి ఆ పాప ఆరోగ్యపరిస్థితి పై వైద్యులను కలిసి విచారించడం జరిగింది.

**ఇంటి పనివారల ధర్నా :**

విశాఖ జిల్లాలో 200మందితో లేబర్ కమిషనర్ ఆఫీసు వద్ద ధర్నా జరిగింది. ఇంటి పనివారలకు కనీస వేతన జివో విడుదల అయిన సందర్భంగా జివో అమలు అయ్యే విధంగా గుర్తింపు కార్డులు లేబర్ ఆఫీసర్లు చర్యలు తీసుకోవాలని, కనీస వేతనం జివో ప్రకారం జీతాలు పెంచాలని యజమానులకు వినతి పత్రాలు ఇచ్చే కార్యక్రమాన్ని గుంటూరు, విజయవాడ మరియు పట్టణాలలో స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం చేపట్టింది.

**ఉచిత న్యాయ సహాయ కేంద్రాలు:**

మోటూరు ఉదయంట్రస్టు ఆధ్వర్యంలో నల్గొండ జిల్లాలో ఉచిత న్యాయ సహాయ కేంద్రాలను ఏర్పాటు చేశారు. నల్గొండ జిల్లాలో జిల్లాజడ్జిఐద్వా ప్యాట్రన్ శ్రీమతి మల్లు స్వరాజ్యం తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.






ఖమ్మంలో మహిళాన్యాయ సలహా సంఘం ప్రారంభసభ శ్రీమతి శ్రీదేవి (అడ్వకేట్) అధ్వర్యంలో జరిగింది. ముఖ్య అతిధిగా హాజరైన జిల్లా జడ్జి శ్రీ ఇ.జగన్నాథరెడ్డి గారు సభలో ప్రసంగించారు. మహిళలకు ఉపయోగపడే అనేక చట్టాలు వున్నా అవి కింద స్థాయి మహిళలకు అవగాహన లేక సద్వినియోగ పడటం లేదన్నారు. మహిళా సంఘాలు మహిళలలో చైతన్యం కల్పించాల్సిన అవసరం వుందన్నారు. మోటూరు ఉదయంట్రస్టు కోశాదికారి డా॥టాన్యాగారు, జిల్లాపరిషత్ చైర్మన్ శ్రీమతి జి.విజయలక్ష్మి, మున్సిపల్ చైర్మన్ శ్రీమతి సమీనాఅఫ్రోజ్, ఐద్వారాష్ట్ర కార్యదర్శి కె.స్వరూపరాణి బార్ అసోసియేషన్ రాష్ట్ర నాయకులు కొల్లి సత్యనారాయణ, లీగల్ అథారిటి సెల్ నుండి శ్రీపార్ధసారధి గారు, ఖమ్మం ఎమ్.ఎల్.ఎ తమ్మినేని వీరభద్రంగారు సభలో ప్రసగించారు. సభకు 400 మంది హాజరైనారు.

**మధ్యాహ్న భోజన కార్మికుల సమస్యలపై:**

మధ్యాహ్న భోజన కార్మికులకు బడ్జెట్ పెంచాలని, మౌలిక వసతులు కల్పించాలని, కనీస వేతనాలు అమలు చేయాలని, బిల్లులు సక్రమంగా ఇవ్వాలనే డిమాండ్లతో నల్గొండ జిల్లాలో 80మందితో ధర్నా జరిగింది. అదే విధంగా రాష్ట్ర రాజధానిలో రాష్ట్ర ధర్నా 300మందితో ఇందిరా పార్క్‌వద్ద జరిగింది.



**సంక్రాంతి ఆటలపోటీలు:**

ఐద్వా ఆధ్వర్యంలో సంక్రాంతి ఆటలపోటీలు అన్ని జిల్లాల్లోను జరిగాయి. అనంతపురంలోని 6కాలనీలలో 600మందితో ఆటల

పోటీలు జరిగాయి.

**మార్చి 12 ధర్నా:**

బడ్జెట్‌లో వాటాకై రాయలసీయ, ఉత్తర తెలంగాణా జిల్లాల్లో 2 జాతాలు మార్చి 3వ తేదీన ప్రారంభమై అన్ని పట్టణా కేంద్రాలలో సభలు జరుపుకుంటూ ప్రజల సమస్యలు తెలుసుకుంటూ 12వ తేదీతో హైదరాబాద్‌కు జాతాలు చేరుకున్నాయి. ఈ సందర్భంగా ఇందిరా పార్క్ వద్ద 4సంఘాల (ఐద్వా, డివైఎఫ్ఐ, ఆవాజ్, పట్టణ పేదల సంక్షేమ సంఘం) ఆధ్వర్యంలో ధర్నా జరిగింది. ఈ ధర్నా నుద్దేశించి ఎం.పి. మధు గారు మాట్లాడారు.

**మహాసభలు:**

గుంటూరు జిల్లా మహాసభ మార్చి 3,4 తేదీలలో తెనాలిలో 170మందితో, ప్రకాశంజిల్లా మహాసభ ఫిబ్రవరి 23వతేది 160మందితో ఒంగోలు పట్టణంలో జరిగింది.

**హింస పై :**




రాష్ట్రంలో మహిళలపై, యువతులపై, కాలేజి విద్యార్థినులపై వరుసగా జరుగుతున్న అకృత్యాలకు నిరసనగా రాష్ట్ర రాజధానిలో 3 ప్రజాసంఘాలు (ఐద్వా, ఎస్.ఎఫ్.ఐ, డివైఎఫ్ఐ) ఆధ్వర్యంలో నిరసన ప్రదర్శన జరిగింది.

**డ్వాక్రా :**




మహిళల పావలా వడ్డి రుణాలు అందజేయాలని, రివాల్వింగ్ ఫండ్ అన్ని గ్రూపులకు ఇవ్వాలనే డిమాండ్ పై రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లో సదస్సులు జరిగాయి.

**మీనాకుమారి ఘటనపై :**

విజయవాడకు చెందిన ఇంజనీరింగ్ విద్యార్థిని మీనాకుమారిని సీనియర్ విద్యార్థి సందీప్ ప్రేమించానని పెళ్ళి చేసుకుంటానని బెదిరిస్తూ ఆమె ఇంటికి వెళ్ళి కత్తితో గొంతుకోసాడు.

ఆమె కుటుంబసభ్యులు వెంటనే ఆసుపత్రికి తరలించడంతో ప్రాణాపాయస్థితి నుండి బయట పడింది.




ఆదేరోజు కర్నూలులోని ఇంటర్ విద్యార్థిని పై ఆమె మేనమామ పెళ్ళి చేసుకోవటానికి నిరాకరించిందనే నెపంతో ఆమె పై దాడిచేసి హత్యచేసేందుకు ప్రయత్నించాడు. రాష్ట్రంలో ఒకేరోజు రెండుమూడు ఘటనలు పునరావృతం కావటం చూస్తుంటే గతంలో జరిగిన శ్రీలక్ష్మి, ఆయాషామీరా ఘటనలలో నిందితులకు కఠినశిక్షలు పడకపోవడం, పోలీసుయంత్రాంగం నిర్లక్ష్యంవల్ల ప్రేమోన్మాదులు ఇటువంటి ఘటనలకు పాల్పడుతున్నారన్నది ప్రజాభిప్రాయం.

ఈ ఘటనలను నిరసిస్తూ ఐద్వా, డి.వై.ఎఫ్.ఐ, యస్.ఎఫ్.ఐ ఆధ్వర్యంలో రాష్ట్ర రాజధానిలో దిష్టి బొమ్మను దగ్ధం చేయడం జరిగింది.

**మద్యం పై :**

మద్యాన్ని నియంత్రిస్తానని, బెల్టుషాపులు రద్దు చేస్తానని అధికారంలోకి వచ్చిన వై.ఎస్. ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత విచ్చల విడి మద్యం అమ్మకాలను ప్రోత్సహిస్తోంది. ఎక్సైజ్ అధికారులకు టార్గెట్స్‌పెట్టి అమ్మిస్తోంది. 2008-09సం॥రములో ఎక్సైజ్ నుండి 8675 కోట్లు ఆదాయం కోసం ప్రణాళికలు వేసింది.

రాష్ట్రంలో మద్యం షాపులతో పాటు బెల్టు షాపులు పెరిగాయి. అనధికార అంచనా ప్రకారం లక్షాయాభై వేల బెల్టు షాపులు వున్నాయి. ఆకాశాన్నంటుతున్న ధరలతో సంసారాలు ఈదలేక అష్ట కష్టాలు పడుతుంటే మద్యం మహిళల పాలిట శాపంగా మారింది. పైగా తాగొచ్చిన భర్తలు శారీరక, మానసిక హింసకు పాల్పడుతున్నారు.

మార్చి-31 మోటూరి ఉదయం గారి వర్ధంతి సందర్భంగా మోటూరి ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళనా కార్యక్రమాలు జరిగాయి. కొన్ని జిల్లాలో మద్యం సీసాలను ధ్వంసం చేశారు.



## శుభాకాంక్షలు

శ్రీకాకర్ల సంతోషం, కిరీటంగార్ల కుమారుడు
కిరణ్‌కుమార్ వివాహం మందులపు జ్యోతి శేషయ్య గారి
కుమార్తె దీప్తితో మార్చి1, 2008న
విశాఖపట్నంలో జరిగిన సందర్భంగా విరాళం
ఐద్వా రాష్ట్ర కమిటీకి అందజేశారు.
నూతన దంపతులకు ఐద్వా రాష్ట్ర కమిటీ
ఆశీస్సులు తెలియజేస్తుంది.

- ఐద్వా రాష్ట్ర కమిటీ

# నవయుగ వైతాళికుడు, యుగపురుషుడు

## కందుకూరి వీరేశలింగం, రాజ్యలక్ష్మమ్మ



నవయుగ వైతాళికుడు, యుగపురుషుడు కందుకూరి వీరేశలింగం, రాజ్యలక్ష్మమ్మ.

జననం: **1848** ఏప్రిల్ **16** – నిర్యాణం: **1919**మే**27**

రాజ్యలక్ష్మమ్మ జననం:**1851** నవంబర్ **5** – నిర్యాణం **1910** ఆగస్టు **12**.

ఆంధ్ర జాతికి వీరేశలింగం వెలుగు, రాజ్యలక్ష్మమ్మ వెన్నెల.

కందుకూరి గారు ఆధునిక ఆంధ్ర జాతి రూపు రేఖలు దిద్దిన ఆది గురువు. కుల మత మూడాచారాలతో కుళ్ళికంపు కొడుతున్న సంఘంపై ప్రాణాలకు తెగించి వీరోచితంగా తిరుగుబాటు ప్రకటించిన సాంఘిక విప్లవసేనాని. స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహం కొరకు అత్యంత ధైర్యంతో ఉద్యమం సాగించిన దిట్ట. సాంఘిక సంస్కరణల అమలుకై వలంటీర్ దళాలను నిర్మించి సవ్య సాచివలె పోరాడి సాధించిన యుగకర్త. దళిత వాడలలో వలంటీర్స్‌తో మకాం పెట్టి అస్పృశ్యతా నివారణకు కృషి చేసిన మహనీయుడు. అగ్ని తరంగం వీరేశలింగం. ఆ విరాట్ స్వరూపం జాతి పునరుజ్జీవనాన్ని సాధించింది.

రాజమండ్రిలో హితకారిణి సమాజం, వితంతు శరణాలయం, మొదలైన ఎన్నో సంస్థలను నిర్మించి విజ్ఞాన వంతమైన మాతలు, ఉత్తమ తల్లులు, సుశిక్షణ కలిగిన బిడ్డలు, సమాజ వికాసానికి మార్గదర్శకులు అని, అందుకు పూనుకొని చివరకంటా కృషి చేసిన నిత్య చైతన్య మూర్తి వీరేశలింగం గారు.

రాజ్యలక్ష్మమ్మ గారు భర్త తలపెట్టిన సమస్త ప్రయత్నములలోనూ ఛాయ వలె తోడుగా నిలచి సకల కష్టములు, కఠోర పరీక్షలు సంతోషముతో భరించి, ఇద్దరి వ్యక్తిత్వం ఒకటిగా రూపం దాల్చిన మహోన్నత భారతి పుత్రిక, మానవతా మూర్తి.

మిత్రులకు వీరేశలింగం గారు వ్రాసిన చివరి వీలునామాలో ఒక మాట " అజ్ఞానంలో, అమాయకత్వంలో జీవిత సంస్కారం లేని ప్రజా సామాన్యానికి విద్య, విజ్ఞానం, సమానత్వం, సంస్కారం కలిగించటానికి కృషి చేయాలని కోరుతున్నాను. స్త్రీల పురోభివృద్ధిలోనే సమాజ పురోభివృద్ధి కాగలదు".

చరిత్ర, చారిత్రక పురుషులు నిర్వహించిన కార్యక్రమాలు అధ్యయనం చేస్తూ యువత ముందుకు సాగాలి.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A 123 |
| పుస్తకం పేరు | చైతన్య వీరాణి |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |